# ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం: మహిళా సంఘాలు

## [1860 - 1983]



మల్లాది సుబ్బమ్మ

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్,
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీ పట్నం,
హైదరాబాద్ - 500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. 34

ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం : మహిళా సంఘాలు (1860-1983)

రచన : మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ : 1985

ప్రతులు : 2000





వెల : ~~[illegible] ప్రతి~~
40-00 మేలు ప్రతి

పబ్లిషర్సు :
ప్రజాస్వామ్య ప్రచురణలు.
8, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాదు - 500 028
ఫోను : 31423

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
వికాసం
8, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాదు - 500 028
ఫోను : 31423

ముద్రణ :
లిబర్టీ ప్రింటర్సు
చీరాల - 523 155

విషయసూచిక

# అవగాహన

చరిత్ర వ్రాసే పద్ధతి రెండు రకాలుగా ఉంటుంది. సంఘటనలను యథాతథంగా చిత్రించి చివరకు రచయిత తన దృక్కోణాన్నుండి అభిప్రాయ ప్రకటన చేయటం మొదటిది. అలా కాక సంఘటనలను ఏర్చి కూర్చటంలో రచయిత తన స్వీయదృక్పథాన్ని ప్రవేశపెట్టి ఒక్కొక్కచో చరిత్రనే మార్చి వేయటం రెండవది. ఈ రెంటిలో మొదటిది అనుసరణీయం. ఈ గ్రంథ రచయిత మొదటి పద్ధతిని అనుసరించినట్లు కన్పడుతున్నది.

ఇక ఉద్యమాలను మదింపు వేసే విధానాన్ని గురించి చెప్పుకోవలసి యున్నది. ఉద్యమ నాయకత్వ లక్ష్యాలను, ఆదర్శాలను మాత్రమే లెక్కలోకి తీసుకోవటం ఒకపద్ధతి. అలాకాక ఉద్యమపు నడక తీరును మాత్రం గమనించటం మరో పద్ధతి. ఉద్యమానికి అండదండలను అందించిన వర్గాలను, 'గూపులను' పరిగణనలోకి తీసుకొని విలువకట్టటం మరోమార్గం. అలా కాక, ఉద్యమం ఎవరి ప్రయోజనాలకు ఉపకరించింది, ఏమి సాధించింది అనే ప్రశ్నలకు సమాధానాలు సంపాదించి ఉద్యమాన్ని సమీక్ష చేయడం ఒకా విధానం. ఇవన్నీ పాక్షిక దృక్పథాల ఫలితాలు. అలా కాకుండా సమ్యక్ దృష్టితో సమగ్ర పరిశీలనతో అవగాహన చేసుకోవటం అవసరం.

చరిత్ర అనేక ఉద్యమాల సంఘటీకరణం. కొన్ని ఉద్యమాలు ఇంచుమించుగా స్వతంత్ర ప్రతిపత్తి కలవి. మరికొన్ని రాజకీయ పార్టీలకో, లేక ఇతర ఉద్యమాలకో ప్రతిచ్ఛాయలు; వాటి పరిధి దాటి పోనివి. ఆమాటకువస్తే, సరాసరి ఆ రాజకీయ పార్టీల, శక్తుల ప్రాబల్యం క్రింద పని చేసేవి. విద్యార్థి, కార్మిక సంఘాలవలె మహిళా సంఘాలు కూడా రాజకీయ పార్టీల ప్రాబల్యంలో ఉండడం కద్దు. అలా స్త్రీల రాజకీయాలు స్వతంత్రమయి రాజకీయ మహిళోద్యమాలు ఉద్భవిల్లాయి. స్త్రీలు ఒక వర్గపు వారని (Class) రాడికల్ స్త్రీ విమోచనకారులు వాదిస్తుంటే, స్త్రీలు సమాజంలో ఒక శాఖకు లేక ఒక తెగకు (Category) సంబంధించిన వారని వీణా మజుందార్ లాంటి మహిళోద్యమ కార్యకర్తలూ పరిశీలకులూ అభిప్రాయ పడుతున్నారు. ఏదైనా సమాజంలో స్త్రీలకు విశిష్టమైన స్థానం ఉన్నది. వారికి ప్రత్యేకమైన ఇబ్బందులు, కష్టాలు, సమస్యలు

ఉన్నాయి. వారి వారి ఆర్థిక పరిస్థితివల్ల వచ్చిన తేడాను తోసిరాజని స్త్రీలందరిని కూడగట్టే సమస్యలు కోకొల్లలు. అలాంటి పరిస్థితిలో స్వతంత్ర మహిళోద్యమాన్ని చేపట్టి నడిపించటం అవశ్య కర్తవ్యం. అది ఇప్పట్లో సాధ్యం కాక పోయినా సమష్టి కార్యాచరణకు దోహదం చేసే సమస్యాయు సంఘాల నిర్మాణం – తాత్కాలిక ప్రాతిపదికపైన మాత్రమే జరిగినా – ముదావహం; అభిలషణీయం. అది ముందు ముందు సమైక్య మహిళోద్యమ నిర్మాణానికి దారి తీస్తుందని ఆశించవచ్చును.

ఈ రచయితకు ఒక తాత్విక దృక్పథం లేదని కొందరు విమర్శించ వచ్చును. ఆమె తన తాత్విక అవగాహనను 'స్త్రీ విమోచన సిద్ధాంతాలు' అనే అధ్యాయంలో విశదీకరించారు. కాగా, వివిధ యుగాల ఉద్యమాలను సమీక్ష చేసేటప్పుడు ప్రతి ఉద్యమాన్ని సానుభూతితో పరిశీలిస్తున్నట్లు తోస్తుంది. ఈ ఆరోపణ కొంతవరకు సత్యమే ప్రతి దశలోని ఉద్యమాన్ని ఎంతో అభిమానంతో, ఎంతో సహనంతో దర్శనం చేసుకోవటం జరిగింది. ఇది సరియైన పద్ధతే 19 వ శతాబ్దపు సంఘటనలను, ఉద్యమాలను ఈ నాటి విలువలతో, గీటురాళ్ళతో, తాత్విక అవగాహనతో మదింపు వేయపూనటం అనుచితం. కనుక ఇలా నూట ఇరువది సంవత్సరాల చరిత్ర రచనకు పూనుకున్నపుడు ప్రతి ఉద్యమపు మౌలికాంశాన్ని వీలయినంత నిర్లిప్తంగా వెలికితీయ ప్రయత్నం చేశారు గ్రంథకర్త. కనుకనే కందుకూరి యుగపు సమాజ సంస్కరణ భావం, గాంధీజీ ఇచ్చిన 'కార్యాచరణకు పిలుపు', కమ్యూనిస్టుల తిరుగుబాటు ఆందోళన తత్వాలు, స్వాతంత్ర్యానంతర సామాజిక సేవాదృక్పథం, మహిళా దశాబ్దపు చైతన్య ఉద్దీపన రచయితను ఆకర్షించాయి. ఆ భావాలను రచయిత వ్యక్తం చేశారు. ఇందులో రచయితకు మహిళోద్యమం యెడగల అభిమానమే కాక అవగాహన కూడా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

ఈ గ్రంథం సమగ్ర దర్శనం చేయదు. నూట ఇరువది సంవత్సరాల చరిత్రను సమగ్రంగా రాయాలంటే గ్రంథం కనీసం 20 సంపుటాలుగా వెలువడవలసి యున్నది. దీనికి ఓపిక, శ్రద్ధ, పరిశ్రమ, కాలం, ఇంకా ఇతర సాధన సంపత్తి అవసరం. ఇవన్నీ కలిగిన పరిశోధకులు ఈ పనికి పూనుకుంటారని ఆశించవచ్చును. అందుకు ఈ గ్రంథం కొంతగా కొంత ఉపకరిస్తుంది.



**ఎం. వి. రామమూర్తి**

# సాగరమథనం

ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం : మహిళా సంఘాలు అనే విషయంపై సంక్షిప్తంగా పరిశోధనా గ్రంథం వ్రాసి ఇవ్వమని భారత సమాజ విజ్ఞాన పరిశోధనా సమితి దక్షిణ ప్రాంతీయ కేంద్రం (I.C.S.S.R.) వారు కోరినప్పుడు నాకు ఒక విధంగా ఉత్సాహం మరోవిధంగా అధైర్యం కలిగాయి. దీర్ఘంగా ఆలోచించుకున్నాను. మరోసారి తర్కించుకున్నాను. ఒక మహిళా కార్యకర్తగా పిరికితనం పనికిరాదని నిశ్చయించుకున్నాను. నాకు మహిళోద్యమ మన్నా మహిళా కార్యకర్తలన్నా ఎనలేని ఉత్సాహం, గౌరవభావం కలుగుతాయి. నా జీవితానికి, మహిళావిముక్తి ఉద్యమానికి ఉన్న సంబంధమే నా చేత ఈ సాహసకార్యం చేయించటానికి పూనుకున్నది. ఇందులోని పొరపాట్లను, లోటుపాట్లను మన్నించగల సానుభూతి పాఠకలోకానికున్నదనే ధైర్యంతో ఈ బృహత్ కార్యానికి ఉపక్రమించాను. ఇక మహిళోద్యమ చరిత్రపై కావాల్సిన సమాచారం లభించటం అసాధ్యమేమోననిపించింది. అలాంటి సాహిత్యం ఎక్కువగా వెలువడలేదని తేలింది. అక్కడక్కడా లభించిన పురాతన పత్రికలూ, వ్యాసాలు, సావనీర్లు, చర్చలు, వాదోపవాదాలే నాకు ఆధారమయినాయి. ఒక సర్వేలోలాగా వ్యక్తుల్ని, గ్రంథాలను వెతుక్కోవాల్సి వచ్చింది. చరిత్ర అసంపూర్ణ మవుతుందేమోనని అనుమానం మళ్ళీ నన్నావరించింది. మిత్రులు కొందరు ధైర్యమిచ్చారు. మరికొందరు హితులు 'లోటుపాట్లు వుంటాయి జాగ్రత్తసుమా' అని హెచ్చరించారు. అంటే చరిత్ర వ్రాసేటప్పుడు చాలా బాధ్యతతో వ్రాయాలని, అసత్యాలు సత్యాలుగా రాయకుండా, యదార్థాలను దాచకుండా వ్రాయాలని వారి భావం. అలాగే నిర్లిప్తంగా, పక్షపాత రహితంగా తెలిసినంత వరకు వ్రాశానని మనవి చేస్తున్నాను.

ఒక సంవత్సర కాలవ్యవధితో ఒక మహా ఓషధిని మధించిన ఫలితమే ఈ గ్రంథావిర్భావం. ఈ గ్రంథంలో అనేక అంశాలను స్థూలంగా మాత్రమే వివరించడం జరిగింది. కొన్ని సంఘటనలు, కొంత మంది పేర్లు ఇందులో కన్పడక పోవచ్చును. అంటే బహిర్గతం కాని సమాచారం కొంత వుండవచ్చు, వెలువడినది కూడా కొంత విషయసామాగ్రి నాకు లభించక పోవచ్చు. అందువల్ల నాకు తెలిసింది, నేచదివింది, ఇతరత్రా

సేకరించింది అంతా ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది. అంతేకాని ఏ వ్యక్తుల్నిగాని, ఏ ఉద్యమాన్ని గాని, ఏ కార్యక్రమాన్ని గాని, కించపరచాలనే దురుద్దేశ్యం నాకు లేదు. ఒకవేళ ఏ ముఖ్య కార్య రంగమైనా జారిపోతే దానికి సంబంధించిన వ్యక్తులు నన్ను అన్యథా భావించవద్దని మనవి చేస్తున్నాను. అందులో 125 సం॥ రాల చరిత్ర సంఘటిత కార్యక్రమాలు, ఉద్యమాలు, ఆయావ్యక్తుల పేర్లు, నాటి పరిస్థితులు సేకరించటం దానికి ఒక సాహిత్య రూపం ఇవ్వటం అంత తేలిక పనికాదు. ఈ అంశాన్ని పాఠకులు గమనించ గలరని ఆశిస్తున్నాను.

మహిళోద్యమం, మహిళా కార్యకర్తలు, మహిళాసంఘాల తొలి దశ గురించి వ్రాస్తున్నపుడు చాలా బాల్యావస్థలో వున్నట్లు తోస్తుంది. కాని ఆనాటి సాంఘికాచారాలు, సనాతన సంప్రదాయాలు, కట్టుబాట్లు, ఆర్థిక బాధలు, సాంస్కృతిక హోదా, రాజకీయ బంధాలను తొలగించుకొని మేమూ మనుష్యులమే మాకూ హక్కులూ గట్రా కావాలని స్త్రీలు నాల్గు గోడలు దాటి బైటికి రావడమే గొప్ప సాహసంగా భావించాల. అదికాక 1947 వరకు బ్రిటిష్‌వారి పరిపాలనతో అంతకు పూర్వం విదేశస్తుల దండ యాత్రలతో నలిగి పోయిన దేశం మనది అంతవరకు పురుషులకే స్వేచ్ఛ, హక్కులు లేక బానిసత్వంలో మ్రగ్గిన సమాజం మనది. అంతే కాక అనేక మతాలు, భాషలు, కులాలు, ఆచారాలు వుండటంతో ఐక్యతా భావం లేక ముక్కచెక్కలై, హెచ్చుతగ్గులలో సతమత మవుతున్న రాజ్యం మనది.

ఇక స్త్రీల విషయం మరీ అధ్వాన్నంగా వుండేది. ఒక వంక సతీసహగమనం, మరోవంక బాల్యవివాహాలు, విధవల అగచాట్లు, పరదా, విద్యాలోపం, కన్యాశుల్కం, సాంఘిక అసమానత్వం రాజకీయ పరిజ్ఞాన లోపంలాంటి విషపంక్తిలమధ్య నలిగిపోయే రోజులవి. వెలుగు చూడలేని అసూర్యంపశ్యలుగా, పతిసేవే పరమ ధర్మంగా కాలంగడిపేవారు నాటి స్త్రీలు. అలాంటి వాతావరణాన్ని ఛేధించుకొని ఏ చిన్నది బైటకొచ్చినా వెలివేసేవారు. చిత్రహింసలు పెట్టేవారు. కందుకూరి కాలానికి మన సాంఘిక వ్యవస్థ ఘోరమైన అస్తవ్యస్థంగా వుండేది. వర్ణవ్యవస్థ, కులమతాల వైషమ్యాలు, అస్పృశ్యత, ఆడా మగా తేడాలు, ఆర్థిక హెచ్చు తగ్గుల లాంటి తారతమ్యాలు విలయతాండవం చేస్తున్న దశ అది.

పరాచారాలను, పురుష సూక్తులను వల్లె వేస్తూ ప్రాచీన కావ్య పఠనంతో పుణ్యం పొందగోరే బాల వితంతువులను వెన్ను తట్టి, కనువిప్పు కలిగించిన ఘనుడు కందుకూరి. అబలల దుస్థితికి, వారిపై జరిగే దురాచారాలకు వగచి వారిలో వ్యక్తిత్వానికి ప్రోది చేసింది మన గురజాడ. వీరిద్దరూ ఆంధ్రలో ఆ కాలంలో స్త్రీ జనాభ్యుదయానికి పెద్దపీట వేసిన సంస్కర్తలు; మాననీయులు. ఒకరు విధవా వివాహోద్యమానికి జీవితం ధారపోస్తే రెండోవారు కన్యాశుల్క విమోచనకు, సనాతన సంప్రదాయ విధ్వంసాలకు, మూఢాచార నిర్మూలనకు మార్గదర్శకులయ్యారు. మరి కొందరు సంస్కర్తలు ఆ ఉద్యమాలకు తమ చేయూతనిచ్చారు. అశేష త్యాగాలు చేశారు.

ఇక స్త్రీలకు రాజకీయాలపై దృష్టి, దేశసేవపై ఆసక్తి, ఆర్తి కలిగించిన ధీరోదాత్తుడు మహాత్మాగాంధీ. ఆనాడు గాంధీ పిలుపుతో మారుమూల గ్రామస్త్రీలు, వృద్ధవనితలు, నిరక్షరకుక్షులు గడపదాటి సత్యాగ్రహోద్యమంలోకి దూకారు. నిర్భీతితో, నిస్వార్థంతో ముందడుగు వేశారు. జైళ్ళపాలయ్యారు. జైళ్ళల్లో పురుళ్ళు పోసుకున్నారనేది గమనార్హం. విదేశీ వస్త్రదహనం చేశారు. పట్టుచీరెలు కాల్చి రాట్నంతో వొడికిన నూలు బట్టలు ధరించారు. స్త్రీలలో వికాసానికి అదొక ఘట్టం.

ఏదైనా సంస్కరణల విషయంలో నాటికీ, నేటికి మన సమాజం వెనుకడుగు వేస్తుందంటే కారణం రాజా రామ్మోహన రాయికి పూర్వం 1812, 15, 17 సం॥ రాల్లో బ్రిటిష్‌వారు గర్భిణీ స్త్రీలకు, అతిబాల వితంతువులకు, పసిపిల్లల తల్లులకు "సతి" నిషేధిస్తూ శాసనం చేశారు. కాని 1857 లో సిపాయి తిరుగుబాటు, భారత ప్రజల నిరసనల తర్వాత దేశంలో సాంఘిక దురాచారాల్లో కాని, మతసంబంధ విషయాల్లో కాని విక్టోరియా రాణి ప్రకటన వల్ల ఆ అత్యల్ప సంస్కరణ భావం సన్నగిల్లి వారు జోక్యంబీకలిగించుకోలేదు. అందువల్ల రకరకాలైన దురాచారాలు, మత వైషమ్యాలు, అమల్లోవున్నాయి; నిజంగా చెప్పాలంటే పెచ్చు పెరిగాయి. అందువల్ల సంఘసంస్కరణ, స్త్రీ జనాభ్యుదయం ఆ దశలో శూన్యమయినాయని చెప్పవచ్చు. దరిదాపు శూన్యమైన ఆ దశలో సామాజిక జీవితాన్ని పరిశుద్ధం చేయటానికి, స్త్రీ జనోద్ధరణకు సంస్కర్తలు పూనుకోవటం జరిగింది. కనుక 1860 నుండి మాత్రమే ఈ చరిత్ర ప్రారంభించటం సముచితం : సమంజసం.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ రచనలో తోడ్పడిన నా జీవిత భాగస్వామి, సహచరులు సహకార్యకర్త, అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు సంఘాధ్యక్షులు అయిన ఎం. వి. రామమూర్తి గారికి నేనా జన్మాంతం రుణపడి వుంటాను, గ్రంధప్రచురణకు వారు సహాయ సహకారాలందించుటేకాక ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు. అలాంటి వారి మేలు విస్మరించతానిది. ICSSR డిప్యూటీ డైరెక్టరు పోలు సత్యనారాయణ గారి ప్రోద్బలం వల్లనే ఈ గ్రంథం వెలుగు చూచింది. వారి ప్రోత్సాహం, సహృద్భావం నాకు అండదండలు. అతి ప్రాచీన పుస్తక భాండాగారమైన సారస్వతి నికేతనం (వేటపాలెం) లో కొంతకాలం వుండి నోట్సురాసుకొని వచ్చాను. ఆ గ్రంథాలయంవారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. అముద్రిత వివరాలు, కరపత్రాల ద్వారానే కాక ఇంటర్వ్యూల ద్వారా సమాచారాన్ని అందించిన ప్రముఖులకు, ఉత్సాహపరిచిన కార్యకర్తలకు నా ధన్యవాదాలు. పుస్తకముద్రణలో సహాయపడిన ప్రభుత్వ సాహిత్య, సాంస్కృతికశాఖవారికి నా కృతజ్ఞతలు. అనేక పుస్తకాలనుండి, పత్రికలనుండి సమాచారాన్ని సేకరించుకోవడం జరిగింది, వారిని పేరు పేరునా ఇందులో ఉదహరించలేక పోయినందుకు మన్నించేది. ఆయా రచయితలకు, వ్యాసకర్తలకు నా ధన్యవాదాలు.

పరిశోదనే వ్యాసవృత్తి పెట్టుకునే మేధావులకు ఈ చిన్ని పొత్తం విషయాన్ని స్థూలంగా దర్శనం చేయగలదు. ముమ్ముందు సూక్ష్మంగా, వివరంగా జరగవలసిన బృహత్తర పరిశోధనకు ఉపకరిస్తే నాకదే పదివేలు. మహిళోద్యమ కార్యకర్తలు సంఘసేవాభిలాషులు, సంస్కరణాభిమానులు ఈ గ్రంథ పఠనం వల్ల స్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్ని పొందగలిగితే, చదువరులు సేవాకార్యక్రమాలను చేపట్ట గలిగితే నా కృషి ఫలించినట్లే. నాకదే పారితోషికంగా భావిస్తాను. పాఠకులు ఉత్తేజంతో, ఉత్సాహంతో సేవాకార్యక్రమాలకై ఆరాట పడతారని ఆశిస్తున్నాను.

రచయిత : మల్లాది సుబ్బమ్మ

# పీ ఠి క

కోస్తా ప్రాంతం, రాయలసీమ, తెలంగాణం అని పిలువబడే మూడు ప్రాంతాలలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. మున్ముందుగా, కోస్తా ప్రాంతం బ్రిటీషు పాలన క్రిందికి వచ్చింది. ఆనాడు దత్త మండలాలు అని పేర్కొన బడిన జిల్లాలను నైజాం నవాబు బ్రిటీషువారికి దత్తంచేశాడు. ఈ రెండు ప్రాంతాలు సమష్టి మద్రాసు రాష్ట్రంలో భాగంగా వుండేవి 1953 లో కోస్తాప్రాంతం, బళ్ళారిజిల్లా మినహాయించిన దత్త మండలం కలిసి ఆంధ్ర రాష్ట్రంగా రూపొందాయి. నైజాంరాజ్యంలోని తెలుగుమాట్లాడే తెలంగాణా ప్రాంతమూ, ఆంధ్రరాష్ట్రమూకలసి ఆంధ్రప్రదేశ్‌గా 1956 నవంబరు 1 వ తేదీన అవతరించాయి. 1981 జనాభా సేకరణ లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనాభా 5 కోట్ల 50 లక్షలు. తూర్పున బంగాళాఖాతము, పశ్చిమాన కర్ణాటక రాష్ట్రమూ, దక్షిణాన తమిళనాడు, ఉత్తరాన మహారాష్ట్రమూ, ఈశాన్యాన మధ్యప్రదేశ్ ఒరిస్సాలు హద్దులుగా కలిగినది ఆంధ్రప్రదేశ్. అక్షరాస్యత 29.7 శాతం. పురుషులలో అక్షరాస్యత 39 శాతం కాగా, స్త్రీలలో 20.2 శాతంగా వుండేది 1981 లో. ఈనాడు 23 జిల్లాలున్నాయి రాష్ట్రంలో. సాంస్కృతికంగా మూడు ప్రాంతాలుగాను పరిపాలనా సందర్భంగా ఆరు ప్రాంతాలుగాను రాష్ట్రం ఉన్నది. నేడు ముఖ్యంగా రాష్ట్ర ఐక్యత భాషపై ఆధారపడి వుంటోంది. ప్రాంతానికీ, ప్రాంతానికీ ప్రజల మనస్తత్వాలలో తేడాలు కనిపిస్తాయి.

# ఉపోద్ఘాతం

గ్రంథస్థమైన పరిశోధనా కాలం 120 సంవత్సరాల వ్యవధి కలదగుటచే విషయాన్ని స్థూలంగా మాత్రమే దర్శనం చేయటం జరుగుతున్నది. కనుక ఈ అధ్యయనంలో వివరాలు ఉండటానికి అవకాశంలేదు; అలాగే గాఢపరిశీలన కన్పించదు. అలాంటి అంశాలకోసం వెదకవద్దని చదువరిని హెచ్చరిస్తున్నాను.

మహిళోద్యమాన్ని రెండు దృక్పథాలనుండి పరిశీలించవచ్చును. స్త్రీల సంక్షేమాన్ని, స్త్రీల అభ్యుదయాన్ని కాంక్షించేదిగా స్త్రీ పురుషులచేత ఉద్యమింపబడినది ఒకటి. అలాకాక స్త్రీల పరిస్థితిని మెరుగుపరచుకోవటానికి, స్త్రీ జనాభ్యుదయానికి మహిళా ప్రగతికి స్త్రీలచేత నడుపబడేది రెండవది. మొదటిదాని పరిధి విశాలం. రెండవదాని కార్యరంగం సంకుచితం. అభ్యుదయకాములైన పురుషుల ప్రయత్నాలు, ఉద్యమాలు స్త్రీ జనాభ్యుదయానికి, ఎంతో తోడ్పడినాయి. పురుష దురహంకారంనుండి పురుషాధిక్యతాభావంనుండి విముక్తిపొందిన పురుషులు స్త్రీ విమోచన కొరకు మున్ముందుగా కార్యాచరణకు ఉపక్రమించారనేది నగ్న సత్యం. అయితే సామాజిక స్పృహ కలిగిన స్త్రీలు అనేకమంది ఉత్సాహంగా, ఉత్తేజవంతంగా ఈ ఉద్యమాలను చేపట్టి కొనసాగించారనే సత్యాన్ని మనం విస్మరించరాదు. అప్పటినుండి వారి కృషికి, వారి ఉద్యమాలకు, వారి పోరాటాలకు మాత్రమే ప్రాధాన్యం వచ్చింది. ఈ కాలంలో వివేకవంతులైన పురుషులు, సహాయ సహకారాలు అందిచ్చినమాట వాస్తవమే.

పోరాటం దీర్ఘకాల స్వభావాన్ని సంతరించుకున్నది. మూడవ దశలో అది పూర్తిగా స్త్రీలకొరకు, స్త్రీలచేత నడుపబడిన ఉద్యమం. ఐక్యరాజ్య సమితి 1975 లో మహిళా దశాబ్దాన్ని ప్రారంభించిననాటినుండి ఉద్యమం పూర్తిగా స్త్రీలదయింది.

ఈ గ్రంథ విషయం మహిళోద్యమానికే గాక మహిళాసంఘాల చరిత్రకు కూడ సంబంధించినవని మరువరాదు. అందువలన తమ పరిస్థితిని మెరుగుపరుచుకోవడానికి జరిగిన స్త్రీల సమష్టికృషిపై నొక్కిచెప్పడం గమనార్హం. స్వయంకృషి అమూల్యమని అందరికీ తెలుసు. అంతేగాక కష్టనష్టాలు అనుభవించేవారికి విశదమయినట్లుగా సమస్య తదితరులకు అవగాహనకాదు కనుక స్త్రీల పోరాటాలు, స్త్రీల సమష్టి ప్రయత్నాలు ప్రాధాన్యతను సంతరించుకుంటాయి.

ఈ గ్రంథ రచనలో రచయితకు ఒక సమస్య ఎదురయ్యింది. గ్రంథస్థకాలాన్ని దశలుగా విభజించి పరిశీలించవలెనా లేక ఉద్యమ అంశాలను పేర్కొని వాటిని గురించి వ్రాయవలెనా అనేది ప్రశ్నగా తయారయ్యింది. ఈ రెండు పద్ధతులు లాభనష్టాలతోకూడి ఉన్నాయి. మొదటి పద్ధతిని అనుసరిస్తే ఆ దశయొక్క స్వభావాన్ని లక్షణాన్ని బాగా ఎరుకపరచుకొని దాని వికాసాన్ని అధ్యయనం చేయటానికి వీలు కలుగుతుంది. రెండవ మార్గాన్ని చేపట్టితే స్త్రీల పోరాటాలను అవిచ్ఛిన్నంగా సమగ్రంగా గమనించి దరిహంమీద ఒక్కసారిగా ఆకళింపు చేసుకోవటానికి అవకాశం లభిస్తుంది.

ప్రతి యుగానికి ఒక ప్రాముఖ్యత, ఒక అర్థం ఉంది. పూర్వరంగం అంతర్జాతీయమూ, జాతీయమూ కావచ్చును. అన్ని ఉద్యమాలలో మహిళోద్యమంకూడా ఆ యా యుగాలలో ఉద్భవించినది; అంతేగాక ఆ యుగ లక్షణాలను కలిగి ఉండేది. ఆ యుగస్ఫూర్తివల్ల ప్రభావితమయి తిరిగి ఆ దశనుకూడా ప్రభావితం చేస్తుంది. మొదటి విధానాన్ని

ఆమోదిస్తే ఈ చర్య ప్రతిచర్యలను వివరంగా విశదంగా వెలికి తేవచ్చును.

ఆంధ్రదేశంలో మహిళోద్యమాన్ని సమస్యాపరంగా ఎంతో విద్వత్తుతో, సునిశిత దృష్టితో అధ్యయనంచేసిన గ్రంథాలను రచయిత చూడటం తటస్థించింది. అందువలన సమస్యను మరో దృక్కోణంనుండి చూడటం సబబని రచయితకు తోచింది.

గ్రంథస్థ విషయాన్ని దశలవారీగా దర్శింపచేయటానికి మరో బలవత్తరమైన కారణం వుంది. సామాజిక సంస్కరణ, రాజకీయ స్వాతంత్ర్యం, సాంస్కృతిక వికాసం గమ్యాలుగా వున్న అనేక ఉద్యమాలు 1860 నుండి అనేక దశలుగా నేటి వరకు దేశాన్ని అందులో ముఖ్యం తెలుగునాడును ప్రభావితం చేశాయి. అందువలన వాటి ప్రభావం స్త్రీ విమోచనోద్యమంమీద పడింది. ఆ ఉద్యమాల ప్రభావమే లేకపోతే తెలుగు స్త్రీలు అంతగా ఉత్తేజితులయ్యేవారుకారని, ఉత్సాహంతో ముందుకు సాగేవారు కాదని, విజయాలను సాధించేవారుకాదని ఉద్ఘాటించటం అవాస్తవికం కాదు.

మహిళోద్యమంపై ఆ ఉద్యమాల ప్రభావాన్ని ఉటంకించటం అప్రస్తుతమూ, అసమంజసమూ కానేకాదు. సత్యనిరతి పరిశోధనాసక్తి వున్నంతకాలం ఆ ఉద్యమాలకు మహిళోద్యమం రుణపడి వున్నదన్న సంగతిని నొక్కిచెప్పక తప్పదు.

బహుశః ఈ గ్రంథ విభాగాల తీరును గురించి కొంత చదువరి తెలుసుకోవచ్చును. 1860 నుండి 1918 వరకు సామాజిక సంస్కరణ యుగంగాను, 1919 నుండి 1942 వరకు సహాయనిరాకరణ రాజకీయ శకం గాను, 1943 నుండి 1952 వరకు ఆందోళన తిరుగుబాటుకాలంగాను, 1953 నుండి 1974 వరకు స్థిరీకరణ దశగాను, 1975 నుండి ఈనాటి వరకు

మహిళా దశాబ్దంగాను పేర్కొనడం జరిగింది. ఆ యా కాలపు ముఖ్య లక్షణాన్ని, స్వభావాన్ని బట్టి దానికి నామకరణం చేశాను. ప్రతి దశలోని రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాలను ప్రత్యేక అధ్యాయాలలో పరిశీలించడం జరిగింది.

అలా ఈ గ్రంథం ఉద్యమ విశ్లేషణకు తోడ్పడుతుంది. అయితే అది స్థూలదర్శనం మాత్రమే. ఆంధ్రప్రదేశ్‌లోని మహిళోద్యమాన్ని గురించి సమగ్ర చరిత్రను రచించటానికి, ఆ కార్యభారాన్ని వహించటానికి, కాలం వెచ్చించటానికి ముందుకువచ్చే సమర్థులకు ఈ గ్రంథం కొంతగా కొంత ఉపకరిస్తే రచయిత శ్రమకు సాఫల్యత లభించినట్లే.

# 1 వ భాగం

# సామాజిక సంస్కరణయుగం

## 1 వ అధ్యాయం : యుగప్రాధాన్యత

1857 లో భారతీయులు బ్రిటిషువారిపై బ్రహ్మాండమైన తిరుగుబాటు చేశారు. బ్రిటిషు చరిత్రకారులు దానిని సిపాయి తిరుగుబాటుగా అభివర్ణించారు. దానిని ప్రథమ స్వాతంత్ర్య యుద్ధంగా చిత్రించారు భారతీయ చరిత్రకారులు. తూర్పున బెంగాలు, పశ్చిమాన పంజాబు, దక్షిణాన మద్రాసు రాష్ట్రం ఎల్లలుగాకల ప్రాంతమంతా బ్రిటిషువారికి ఎదురుతిరిగింది. బ్రిటిషు సామ్రాజ్యాధిపత్యానికి తలలువంచి ఇతర విషయాలలో స్వతంత్రంగా పరిపాలిస్తున్న రాజ్యాధినేతలు ఆ పోరాటంలో పాల్గొన్నారు; అగ్రభాగాన నిలిచారు ఆనాడు ప్రాణాలొడ్డి పోరాడుతున్నవారికి పంజాబీలు, బెంగాలీవారు, మళయాళీలు, కన్నడిగులు, తెలుగువారు, తమిళులు తమ సహాయ సహకారాలను అందించలేదు. పైపెచ్చు విదేశీ ప్రభుత్వానికి అండదండలు అందించారు. తిరుగుబాటును బ్రిటిషువారు అణచివేశారు. భారతదేశ పరిపాలనా బాధ్యతను కంపెనీవారి చేతులనుండి తప్పించి బ్రిటిషు రాజరికం తన అదీనంలోకి తీసుకుంది. అపుడు విక్టోరియా మహారాణి చేసిన ప్రకటన ప్రకారం భారతీయుల మత విషయాలలో జోక్యం మానుకున్నారు బ్రిటిషువారు.

కేంద్రప్రభుత్వ కార్యాలయాలు కలకత్తాలో ఉండేవి. సహజంగా బెంగాలీలకు ఆ పరిస్థితి లాభకరంగా పరిణమించింది. ఇతర భాషలవారి కంటె ముమ్ముందుగా వారు బ్రిటిషువారితో, బ్రిటిషు సంస్కృతితో పరిచయం పెంచుకున్నారు. రాజారామమోహన్‌రాయ్ ఆనాడు కలకత్తాలో నివసించేవాడు క్రైస్తవ మతంలోని 'యూనిటేరియను' శాఖకు సామీప్యంవున్న బ్రహ్మసమాజం బెంగాలులో ఉద్భవించింది. రాజా రామమోహనరాయ్ దానిని ప్రారంభిస్తే కేశవచంద్రసేన్, దేవేంద్రనాథ్ టాగూరులు దానిని పెంచి పెద్దచేశారు. హిందూ విధవలకు పునర్వివాహ అవకాశాలు కావాలని ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వాదించాడు. వారి పరి

స్థితిని మెరుగుపరచడానికి ఆయన కృషి చేశాడు. భావ వికాస వీచికలు దేశమంతటా వ్యాపించాయి. తెలుగు ప్రాంతానికి కూడా ఆ ప్రభావం తగిలింది.

సతీసహగమనాన్ని 1829 లో బ్రిటిషు ప్రభుత్వం నిషేధించింది. రాజారామమోహనరాయ్ కృషి, ఆనాటి వైస్రాయి విలియం బెంటింకు ఉదార వైఖరి పిటి ఫలితంగా విధవా వివాహ శాసనం 1856 లో వచ్చింది. ప్రథమ విధవా వివాహం బెంగాలులో కొలది నెలల తదుపరి జరిగింది. ఈ వార్త దావానలంలా దేశమంతటా వ్యాపించింది. ఇతర ప్రాంతాలలోని సంఘసంస్కర్తలు ఉత్తేజితులయినారు. బెంగాలులో ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహారాష్ట్రలో మహదేవ్ గోవిందరెనడే సంఘ సంస్కరణకు పూనుకున్నవారిలో ముఖ్యులు.

ఐరోపియను సారస్వతమూ, విజ్ఞానమూ భారతీయుల మనః ఫలకాలపై చెరగని ముద్రవేశాయి. హిందూ సమాజంలో కులవ్యవస్థ ఘనీభవించి ఆనాటికి నిచ్చెనమెట్ల సమాజంగా ఉండేది. అలాంటి సమాజంపై పాశ్చాత్య భావ వీచికలు ప్రసరించాయి. నూతనత్వానికి నాందిపలికాయి. స్వేచ్ఛా సమానత్వాలయెడ కాంక్షను పెంచాయి. అణగారిపోతున్న అస్పృశ్యులలోను, స్త్రీలలోను సమానత్వాన్ని కోరేభావాన్ని రేకెత్తించాయి.

క్రైస్తవ మిషనరీలు ప్రేమ, కరుణ అనే భావాలను వ్యాప్తి చేశారు. ఆ సందేశం నిమ్నజాతులను నిద్రలేపింది. మిషనరీలు స్థాపించిన విద్యాలయాలు బాలికల విద్యకు దోహదంచేశాయి. కందుకూరి వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంనాయుడు, గురజాడ అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్లు ఆ యుగంలో ప్రధాన సంఘ సంస్కర్తలు. లక్ష్యసాధనలో వారి పట్టుదల, స్పందనకు లోనయిన ప్రజలలో వారు రేకెత్తించిన ఉత్సాహం, సంఘసంస్కరణాభిలాషులకు వారు అందించిన ఉత్తేజం అనన్య సామాన్యం. ఆ యుగంలో ఇతర రంగాలలో కూడా కొంత అభివృద్ధి జరిగింది. కాని అప్పుడు సంఘసంస్కరణేచ్ఛ మెండుగా వుండేది. ఇది కార్యాచరణకు దారితీసింది. ఈ సంఘసంస్కరణ ఉద్యమం ఇతర రంగాలపై తన ప్రభావాన్ని వ్యాప్తిచేసింది. అందువలన ఆ కాలాన్ని సంఘసంస్కరణయుగమని పిలవడం సమంజసం.

# 2 వ అధ్యాయం : విద్య

స్త్రీ విద్య సమాజాభివృద్ధికి కొలమానం. సమాజంలో సగం మందిగా ఉన్న స్త్రీలు అవిద్య, అజ్ఞానాంధకారంలో ఉంటున్నపుడు సమాజం అభ్యున్నతి పొందుతుందని భావించడం భ్రమ. ఈ గీటురాయి అన్ని సమాజాలకు వర్తిస్తుంది. పాశ్చాత్య లేక ప్రాచ్య సమాజాలకు, పెట్టుబడి దారీ లేక సామ్యవాద సమాజాల అన్నింటి అభ్యుదయాన్ని మదింపు వేయు డానికి స్త్రీ విద్య స్థాయిని పరిగణనలోకి తీసుకోవాలి. కనుక 1860 నుండి 1918 వరకు బాలికల విద్య ఎలా కొనసాగిందో పరిశీలించడం సమంజసం. ఇది చారిత్రిక దృక్పథంతో, చారిత్రిక వైఖరితో జరగాలి. అప్పుడే ఆ అధ్యయనం ఫలవంతమవుతుంది. బాలికల విద్య విషయమై ప్రభుత్వ విధానాన్ని సూచించే మొట్టమొదటి ప్రభుత్వ పత్రం లార్డ్ డల్‌హౌసీ యొక్క అభిప్రాయ ప్రకటనను పొందుపరచింది. భారత ప్రజల వ్యవహారాలలో జోక్యం చేసుకోమనే విధానానికి అది అంతం పలికింది. మదరాసులో బాలికల విద్యకు బహిరంగ ప్రోత్సాహాన్ని చేపట్టింది. 1855 లో విద్యాశాఖ నెలకొల్పబడింది. 1860 నాటికి విశాఖపట్టణం, రాజమండ్రి, నెల్లూరులలో జిల్లాకు రెండు చొప్పున బాలికా పాఠశాలలు వెలిశాయి. గంజాం, గుంటూరు, మచిలీపట్నంలలో ఒక్కొక్క పాఠశాల స్థాపించడం జరిగింది. గంజాం, మచిలీపట్నం, కడప, బళ్ళారి, విశాఖ పట్నం, గుంటూరు, కర్నూలు. నెల్లూరు జిల్లాలలో 1860 నాటికి 235 బాలికలు విద్యార్థినులుగా ఉన్నారు.[1] 1881 నాటికి మదరాసు రాష్ట్రంలో బాలికా పాఠశాలల సంఖ్య 543 కు పెరిగింది. విద్యార్థినుల సంఖ్య 32341. ఉత్తర సర్కారు మాత్రమే తీసుకుంటే 67 విద్యాలయాలు, 5372 విద్యార్థినులు ఉన్నట్లు లెక్క తేలింది. 1908 నాటికి విద్యాలయాల సంఖ్య 329 కి పెరిగింది. విద్యార్థినులు 43546 అయ్యారు. పాఠశాలలకు పోదగిన వయస్సు కల బాలికలలో బడికి వచ్చే బాలికల సంఖ్య 1881 లో ఒకటవ శాతం; 1908 లో 5 వ శాతం. ఇవి కోస్తాప్రాంతపు లెక్కలు.[2]

స్త్రీ విద్యను ప్రోత్సహించిన మహామహుల పేర్లు, సంస్థల నామధేయాలు ఈ దిగువనున్న పట్టికలో గమనించవచ్చును.

| వరుససంఖ్య | స్థాపకుని పేరు, | సంవత్సరం. | ప్రదేశం | రిఫరెన్సు |
|---|---|---|---|---|
| 1. | ఫాదర్ హేయర్ (అమెరికను లూథరన్ మిషన్) | 1842 | గుంటూరు | 2 |
| 2. | కెనడియను బాప్టిస్టు మిషను | 1869 | సామర్లకోట హయ్యరు ఎలిమెంటరీ స్కూలు | 3 |
| 3. | ,, | 1869 | రాజమండ్రి మిడిల్ స్కూల్ | 4 |
| 4. | విజయనగరం మహారాజా | 1870 | కాకినాడ | 5 |
| 5. | పిఠాపురం రాజా | 1870 | ,, | 5 |
| 6. | శ్రీమతి ఎ. వి. నరసింగరావు | 1870 | విశాఖపట్టణం | 6 |
| 7. | స్కాచ్ ఫ్రీ చర్చిమిషన్ | 1871 | నెల్లూరు. గూడూరు | 7 |
| 8. | కందుకూరి వీరేశలింగం | 1874 | ధవళేశ్వరం | 8 |
| 9. | ,, | 1881 | రాజమండ్రి | 9 |
| 10. | ,, | 1905 | ,, | 9 |
| 11. | కాకర్ల శ్రీరాములు | | ఆకివీడు | 10 |
| 12. | అయ్యదేవర కాళేశ్వరరావు | 1901 | విజయవాడ | 11 |
| 13. | ,, | 1903 | నందిగామ | 11 |

మరొక స్త్రీ చోరగుడి సీతమ్మగారు 1916 లో బాపట్లలో మిడిల్ స్కూలు నెలకొల్పారు. 12

బాలికల విద్యపై ఈ కాలంలో నొక్కు పెట్టినట్లు మనకు విశద మవుతుంది.

స్త్రీ విద్యను గురించి నొక్కి చెప్తూ అనేక వ్యాసాలు ప్రతిష్టాయుత మైన పత్రికలలో ప్రకటిత మయినాయి.

| వ. నెం | రచయితపేరు | సంవత్సరం | పత్రిక | పుట |
|---|---|---|---|---|
| 1. | కొండా వెంకటప్పయ్య | 1913 | ఆంధ్రపత్రిక సంవత్సరాదిపంచిక | 57 |
| 2. | వేమూరి విశ్వనాథశర్మ | 1916 | ,, | 92 |
| 3. | జూలూరి తులశమ్మ | 1916 | ,, | 287 |
| 4. | ఎం. ఎస్. కమల | 1917 | ,, | 188 |
| 5. | దొర్బంరాజు వెంకట లక్ష్మమాంబ | 1917 | ,, | 192 |

స్త్రీ యొక్క హోదా, విద్యలను గురించి ఆనాడు రెండు రకాల వైఖరులు ప్రబలంగా ఉండేవి. "స్త్రీ పురుషులు హోదాలో సమానులే. కాని వారు అన్నింటా ఒకరినిపోలి మరొకరు ఉండరు. ఒకరు మరియొకరికి దోహదకారి. ఒకరికి కొన్ని లక్షణాలు గుణాలు ఉంటే మరొకరికి భిన్నమైన లక్షణాలు గుణాలు ఉంటాయి. అలా స్త్రీ పురుషుల జంట అసమానమైనది." అని మహాత్మాగాంధీ 1918 లో అభిప్రాయ ప్రకటన చేశాడు.[13] దివ్య జ్ఞాన సమాజ స్థాపకురాలు శ్రీమతి అనిబిసెంటు ఇలా అన్నారు. "భారత దేశానికి ఉదాత్తమైన శిక్షణ పొందిన భార్యలు, తల్లులు, ఇంటిని వివేకవంతంగా మార్దవంగా చక్కదిద్దుకునే ఇల్లాళ్ళు, పసివారికి విద్యగరిపే విద్యావంతులు, భర్తలకు తమ సలహాలద్వారా సహాయపడే స్త్రీలు, నేర్పరులు అయిన నర్సులు ముఖ్యంగా కావాలి. ప్లీడరీ, అధ్యాపకత్వం మొదలైన వృత్తులను చేపట్టే ఉన్నతస్థాయి విద్యావంతులకన్నా పై చెప్పిన రకం స్త్రీలు దేశానికి అత్యావశ్యకం."[14] అనిబిసెంటు అభిప్రాయానికి భిన్నంగా జూలూరి తులశమ్మ ఇలా వాదించింది. "స్త్రీలు అన్ని రకాల విజ్ఞానాన్ని, జ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. అన్ని విధాలైన విద్యలను అభ్యసించాలి."[15] విద్యావంతులైనస్త్రీలలో అనిబిసెంటు వైఖరిని సమర్థించేవారు ఉండటం శోచనీయం. స్త్రీలు తమ సహజమైన ఆకర్షణను సౌకుమార్యాన్ని కోల్పోతున్నారని, తమ కున్న ప్రత్యేక లైంగిక తత్వాన్ని విడనాడుతున్నారని డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి వ్యథ చెందుతున్నారు.[16]

## మొదటి భాగం రెండవ అధ్యాయం రిఫరెన్సులు


1. విద్యా సంబంధమైన నివేదిక 1868 పుట 54 తే 26 - 11 - 1868 ది గల గవర్నరు ఇన్ కౌన్సిల్ ఆర్డరు : డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి "ఆంధ్రలో స్త్రీల పరిస్థితిలో మార్పు" (1980) గ్రంథంలో పుట 56
2. 'స్త్రీ విద్యాభివృద్ధి' రాయసం వెంకట శివుడు ఆంధ్రపత్రిక సంవత్సర సంచిక పుటలు 75 - 77
3. స్త్రీలకు విశాల పంథా (A Larger way for women) : కె. బ్రూక్లిన్‌నారా (1949) పుట 56 డా॥ పుతలీ కృష్ణమూర్తి గ్రంథం పుట 48
4. 1868 - 70 విద్యపై నివేదిక పుట 55 ,, ,, 56
5. 1870 - 71 ,, పుట 90 ,, ,, 57
6. 1870 - 71 ,, 69 ,, ,, 57
7. 1871 - 72 ,, 89 - 90 ,, ,, 59
8. కందుకూరి వీరేశలింగం. డి. ఆంజనేయులు Builders of India Series Page 129
9. ,, ,, ,, పుట 1'0
10. 'ఆంధ్రలో స్త్రీల పరిస్థితిలో మార్పు' : డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి ,, 67
11. అయ్యదేవర కాళేశ్వరరావు నవ్యాంధ్రము (1959) ,, 75
12. కనుపర్తి వరలక్ష్మమ్మ స్మారక సంచిక, బాపట్ల, (1980) ,, iii
13. స్త్రీలు : మహాత్మాగాంధి (నవజీవన్ ప్రచురణసంస్థ 1964) ,, 5
14. నూతన భారత ఆవిర్భావం (Birth of new India, 1917) అనిబిసెంటు పుట 150 : డా॥ పుతలీ కృష్ణమూర్తి గ్రంథం పుట 29
15. ఆంధ్రపత్రిక సంవత్సర సంచిక 1816 పుట 267
16. డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి గ్రంథం పుట 83

# 3 వ అధ్యాయం : మార్గదర్శకులు

1848 నుండి 1919 వరకు జీవించిన కందుకూరి వీరేశలింగంపంతులు గారిని ఈ యుగపురుషులలో ముఖ్యుందుగా పేర్కొనడం అవశ్యకర్తవ్యం. మద్రాసునగరవాసి "గృహలక్ష్మి" పత్రికా సంపాదకుడు డా॥ కేసరిగారు బాపట్లలోని కనుపర్తి వరలక్ష్మమ్మగారిని మహిళోద్యమానికి ఆమె చేసిన సేవకు గుర్తింపుగా ప్రథమ గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతగా ఎంపికచేసుకున్నారు. ఆమె వీరేశలింగంగారిని మహిళోద్యమ పితగా అభివర్ణించారు. ఆ చిత్రణ సమంజసమైనది. వీరేశలింగంగారు జీవం పోయకుంటే ఆంధ్రులు, తెలుగుదేశం ఈనాటి స్థితికి చేరివుండేదికాదని మహామేధావి శ్రీమాన్ సి. రాజగోపాలాచారి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. "మహత్తర ధైర్యాన్ని, చైతన్యశక్తిని, సునిశిత మేధస్సును కలిగిన ఉన్నతోన్నత భారతీయులలో వీరేశలింగం ఒకరు. ఆయన అసత్యాన్ని ఎదిరించి పోరాడిన దిట్ట. ధృడనిశ్చయంతో, పట్టుదలతో అభ్యుదయం కోసం కృషిచేశారు. [2]

కందుకూరి వీరేశలింగం ఆకారంలో తక్కువస్థాయి మనిషి. కాని తదితర మానవులందరికన్న ఉన్నతుడు. "వీరేశలింగం ఆధునికులలో అధికుడు. ఒక యుగ చరిత్ర ఆయన జీవితంలో ఇమిడివుంది. నూతన శకాన్ని సృష్టించినవాడు. దానికి ప్రతినిధి. ఆ యుగంలో ఆవిర్భవించాడు కనుకనే దానికి సృష్టికర్త కాగలిగాడు. ఎందుకంటే కాలధర్మాన్ని పుణికి పుచ్చుకున్నవారే సృష్టికర్తలు కాగలరు." [3] అని సి. ఆర్. రెడ్డిగారు వీరేశలింగంను గురించి ప్రశంశావాక్యాలు పల్కాడు. ఈ అభిప్రాయంతో ప్రఖ్యాత రచయిత, పత్రికా సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు ఏకీభవించటంలేదు. "వీరేశలింగం యుగకర్త మాత్రమే కాదు. ఆ యుగ నిర్మాత ఆయన ఒక్కరే" అన్నారు నార్లగారు. [4] కందుకూరి వీరేశలింగం గారి జీవిత చరిత్రను వ్రాసిన డి. ఆంజనేయులు ఇలా అంటున్నారు.

"గత శతాబ్దపు చివరి సగంలో తెలుగు భాషావికాసానికి ఆయన ముఖ్య ప్రోత్సాహకారి, నిర్మాత. అంతేగాక ఆంధ్ర సామాజిక జీవితాన్ని పునరుజ్జీవనం చేసిన జీవశక్తి" [5] కేంద్ర సాహిత్య అకాడమీకి వీరేశలింగంపై వ్యాసం వ్రాసియిచ్చిన నార్లవారు ఇలా ఆయనను పొగిడారు. "సమాజంలో ప్రమాదాలు ఏర్పరచుకున్న అంధవిశ్వాసానికి, మతమౌఢ్యానికి ప్రతీకలైన శక్తుల ప్రతిఘటనను ఎదుర్కొని ఎడతెగని పోరాటాన్ని సాగించి, మెట్టు మెట్టుగా విజయాలు సాధించిన వీరేశలింగం ఆంధ్రప్రదేశ్‌లో వికాసయుగానికి ఆవిర్భావం చేశాడు. ఇదంతా ఒక్కవ్యక్తి కృషి. ఫ్రెంచిదేశానికి చెందిన వాల్టేర్ (Voltaire) నుండి కండార్సెటు (Condorcet) వరకువున్న 'ఎన్‌సైక్లోపీడిస్టులు' (Encyclopaedists) అందరూకలిసి సాధించినకృషితో ఇది సరితూగుతున్నది" [6] దేవదాసీ సమాజానికి ఎనలేని సేవచేసి, వీరేశలింగం అడుగుజాడలలో పయనించిన రఘుపతి వెంకటరత్నం నాయుడు తన గురువును గురించి ఇలా అన్నాడు: "ఆయనలో మేధస్సూ హృదయమూ రెండు సమతుల్య స్థితిలో ఉన్నాయి. పని పూజా సంపన్నతకు తోడ్పడింది. భక్తి భావం పనిని ఫలవంతం చేసింది." [7]

అన్నింటా వీరేశలింగంది ప్రథమస్థానమే. సంస్కృత నాటకాలను ఆంధ్రీకరణ చేయుటం, షేక్స్పియర్ నాటకాలకు తెలుగుసేత, ప్రహసన రచన, స్త్రీలకొరకు శరీరశాస్త్రంపై గ్రంథరచన, సంఘసంస్కరణకోసం కలం పట్టడం వీటిలో అందరికంటే ప్రథముడు. ఆయన నవల "రాజశేఖర చరిత్ర" ఇంగ్లీషులోనికి అనువదింపబడింది "అదృష్ట చక్రం" (Fortune's wheel) అనే పేరుతో. టి. ఆర్ హచ్చిన్‌సన్ ఆ నవలను ఇలా ప్రశంసించాడు: "హిందూ కుటుంబ జీవితం మతభావాలు, పూజా విధానాలు, అంధవిశ్వాసాలు, పెండ్లిలో ఎంపిక హక్కులేని స్త్రీల దైన్యస్థితి అన్నీ ఈ గ్రంథంలో చక్కగా చిత్రించబడినాయి. ఈ పుస్తకం పాఠకు లందరినీ ఆకర్షించగలదు" [8] కుటుంబ నిర్మాణానికి స్త్రీ విద్య అమూల్య మయినదని నొక్కివక్కాణించటానికి వీరేశలింగం "సత్యవతీ చరిత్ర" వ్రాశాడు [9] "బ్రాహ్మ వివాహం" అనేగ్రంథంలో బాలికలనువయోవృద్ధులకు ఇచ్చి వివాహంచేసే దురాచారాన్ని ఎగతాళిచేసి దుయ్యబట్టాడు. బాల వితంతువుల పునర్వికాసానికి ఆయన చేసిన అనన్య కృషి, స్త్రీ విద్యకోసం

శ్రమ. ప్రజాజీవితంలో అవినీతి వ్యతిరేక పోరాటం, నైతికజీవనప్రబోధం నిస్సహాయ స్త్రీలకు రక్షణ, అజ్ఞానంపై మూఢవిశ్వాసాలపై ఎడతెగని అంతులేని దాడి తెలుగు ప్రజల హృదయాలలో ఆయనకు గౌరవస్థానాన్ని పేర్రమాభిమానయుత స్థానాన్ని నెలకొల్పాయి. సంఘసంస్కరణ మహాసభకు అధ్యక్షస్థానం వహించి సంఘసేవాకార్యక్రమంలో తమ భార్యలను, తల్లులను, అక్కచెల్లెండ్రను భాగస్వాములను చేయవలసిందనే పిలుపును ఇచ్చాడు. స్త్రీలకొరకు పత్రికలూ, పాఠశాలలూ స్థాపించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే స్త్రీ జనోద్ధరణే ఆయన జీవిత కృషి సారం. తన విమర్శలకు జవాబు చెప్తూ "సత్యవాది" అనే తనపత్రికలో ఇలా వ్రాశాడు. "ఇకనుండి నా వనరులను, నా శక్తియుక్తులను - అంటే మానసిక భౌతిక శక్తులను, ద్రవ్యాన్ని చివరకు అవసరమైతే నా ప్రాణాన్ని - స్త్రీజన సంక్షేమానికి అందులో ముఖ్యంగా విధవల పరిస్థితిని బాగుచేయటానికి వినియోగిస్తాను"[10] వీరేశలింగం బాలవిధవలకు వివాహాలు చేయించాడు. వారు ఉండటానికి ఇళ్ళు కట్టించిపెట్టాడు. వారి భర్తలకు ఉద్యోగాలు ఇప్పించాడు. వారి బాగోగులను కనిపెట్టి ఉన్నాడు. వారి విద్యావిషయిక సాంస్కృతిక పురోభివృద్ధికి దోహదం చేశాడు. ఆయన తెలుగు పండితుడు. పాఠశాలలో, తరువాత కళాశాలలో అధ్యాపకత్వం నిర్వహించాడు. ఆయన విద్యార్థులు ఆయనకు అండగా నిలిచారు. ఆయన భార్య కంచుకూరి రాజ్యలక్ష్మమ్మ వీరేశలింగంకు పెట్టని కోట. ఆనాటి యువకులు ఆయనకు ఎంతో మద్దతును, బలాన్ని ఇచ్చారు. ఏమైనా స్త్రీలకు ఆయన చేసిన మహోపకారానికి బాధ్యత గౌరవము ముఖ్యంగా ఆయనకే దక్కాలి. "వీరేశలింగం ఆధునికులలో గొప్ప తెలుగు బిడ్డ"[11] అని డి. ఆంజనేయులు చెప్పటం యుక్తియుక్తం. "ఈనాడు ఆధునిక భారతదేశంలో స్త్రీలు పురుషులతో సమవీటుగా తమ న్యాయమైన స్థానాన్ని ఆక్రమించి, చైతన్యవంతమైన నాయకత్వ లక్షణాలు ప్రదర్శిస్తున్నారంటే ఆ గౌరవం వీరేశలింగం లాంటి సంఘసంస్కర్తలకు చెందుతుంది"[12] అని డి. ఆంజనేయులు వీరేశలింగం కృషిని ప్రస్తుతించారు. సంఘసంస్కర్తలలో మహనీయుడైన మహదేవ్ రెనడే వీరేశలింగంను "దక్షిణాది ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌గా పేర్కొన్నాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ గొప్పవాడే. కాదనలేము. కాని వీరే

కలింగం విద్యాసాగర్‌ను అధిగమించాడు. నిజానికి రెనడే సద్భావంతోనే ఆ వ్యాఖ్య చేశారు. పైగా అది గొప్ప ప్రశంసే. అనుమానంలేదు. ధృఢ దీక్షకు, అవిరళ కృషికి సంకేతంగా చరిత్రలో నిలిచిన దుర్గాబాయి దేశ్‌ముఖ్ వాక్యాలను ఉటంకిస్తూ వీరేశలింగ ప్రశంశను ముగించటం సందర్భోచితం. "ఆ రోజులలో, సంఘసంస్కర్తలకు ఒక అడుగు కూడా ముందుకు వేయుటం కష్టతరమైన కాలంలో, కేవలం స్త్రీజనాభ్యుదయానికే కృషిచేసిన మహానాయకుడు వీరేశలింగం. నిరాదరణకు నిరాశ్రయానికి లోనైనవారికి, విధవలకు వారి పరిస్థితికి మెరుగుపరచడంద్వారా అనన్య సహాయ సహకారాలను అందించిన వీరేశలింగానికి భారత స్త్రీలము సర్వదా కృతజ్ఞత కలిగి ఉంటాము."[16]

## కందుకూరి రాజ్యలక్ష్మమ్మ (1851 — 1910)

రాజ్యలక్ష్మమ్మ సనాతన కుటుంబంలో జన్మించింది. వీరేశలింగంతో వివాహం జరిగేనాటికి ఆమెకు పది సంవత్సరాలు. అతనికి పదమూడు సంవత్సరాలు. రాజ్యలక్ష్మి అనేది ఆమె అత్తగారు ఆమెకు పెట్టినపేరు. ఆమె భీకరికాన్ని ఎదిరించి నిలిచింది. భర్తతో జీవితాన్ని పాలుపంచుకుంది. సంఘసంస్కరణకు విశ్వాసంతో పూనుకున్నది. భర్త అడుగుజాడలలో మాత్రమే నడిచే "పతివ్రత" కాదు ఆమె. స్త్రీజనాభ్యుదయంయెడ ఆమె అభిమానం అపారం ఆమె అచంచల దీక్ష అసామాన్యం. విధవా వివాహోద్యమంలో ఆమె చైతన్యవంతంగా పాల్గొన్నది. ఆమె స్త్రీలకు పాఠశాల నెలకొల్పింది. బాలవిధవలలో లనేకమంది జీవితంయెడ ఆసక్తిని, ఆశను కల్పించింది. విధవా వివాహ సందర్భంగా వంటవారు పనివదిలి వెళ్ళిపోయినపుడు, సాంఘిక బహిష్కరణలో భాగంగా పనికిరానపుడు ఆమె ఏటినుండి నీరుతెచ్చి, పెళ్ళివంటచేసి వివాహాన్ని జయప్రదంగా నిర్వహించటానికి సాయపడింది. ఉద్యమ సాఫల్యానికి జరిగే ఏ పనినైనా స్వీకరించమని ఎవరూ ఆమెను అడగవలసిన పనిలేదు. ఎక్కడ ఆమె ప్రమేయం అవసరమైతే, ఎక్కడ ఆమె జోక్యం తప్పనిసరియైతే అక్కడ ఆమె సాక్షాత్కరించేది. ఆ ఉద్యమ జైత్రయాత్రలో గండిని పూడ్చేది. ఆనాడు అంటే 1906 లో నలభై వేల రూపాయల విలువగల తన యావదా

స్థిని వీరేశలింగం హితకారిణీ సమాజానికి ఇస్తుంటే ఊరక చూస్తూ ఉండ
టమేకాదు ఆమె గొప్పతనం; ఆయనను ప్రోత్సహించింది. వీరేశలింగం
ఆమెకు తన కృతజ్ఞత యిలా తెలిపాడు. "నా జీవితంలో నేను సాధించినది
ఆమె సంపూర్ణ సహాయ సహకారాలు లేకున్నచో నేను చేయగలిగి ఉండే
వాడిని కాను". ఈ రచయిత మరో సందర్భంలో వ్రాసిన వ్యాసంలో
పేర్కొన్నట్లు సోక్రటీసుకు లేని అదృష్టం వీరేశలింగానికి లభించింది అవ
గాహన కలస్త్రీ, ఉద్యమానికి అంతకిమైన మహిళ, చైతన్యవంతురాలయిన
వనిత ఆయనకు భార్యగా దొరకడం విశేషం. [15] ఎంతో అవగాహనతో,
ప్రశాంత మనస్కతతో, నిశ్చలత్వంతో, అచంచల ధైర్యంతో, ధృఢ నిశ్చ
యంతో, త్యాగపూరితంగా కందుకూరి దంపతులు సాగించిన పటిమ కలి
పోరాటాల చరిత్ర మన దేశ మహిళోద్యమ చరిత్రలో ధృవతారగా ఉజ్వల
చిహ్నంగా నిలచిపోతుంది.

## గురజాడ అప్పారావు (1862—1915)

తెలుగు స్త్రీలు విస్మరించరాని మరో మహనీయుని పేరు గురజాడ అప్పారావు. దేశభక్తి గేయాలకు, అర్థవంతమైన జీవితాలు గడపమనే సందేశాన్నిచ్చే గీతాలకు, పండితులు, విద్యావంతులు వ్యవహారిక భాషను వాడాలనే ఉద్యమ ప్రోత్సాహానికి, తండ్రులు తమ కుమార్తెలను వివాహం పేరుతో విక్రయించటాన్ని నిరసించే 'కన్యాశుల్కం' నాటక రచనకు, వయోవృద్ధులైన పురుషులకు బాలికలను వివాహం చేసే దురాచారానికి బలి అయిన స్త్రీలపట్ల సానుభూతి ప్రదర్శనకు ఆయనను తెలుగు ప్రజలు గుర్తుంచుకుంటారు. ఆయన రచించిన 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' అనే గేయనాటిక సానుభూతికి పట్టం కట్టుంది; కరుణ రసానికి ప్రతీక. ఒక ముదుసలికి వివాహం చేయబడిన బాలిక దుర్గను పూజించి ప్రాణం విడుస్తుంది. అంతకుముందు ఆమె సోదరులకు, వదినలకు, తల్లికి చేసిన విజ్ఞప్తులు ఎంతటి రాతిగుండెకల పురుష దురహంకారినైనా కదిలిస్తాయి.

సామాజిక జీవితాన్ని సునిశిత దృష్టితో పరిశీలించగల రచయిత గురజాడ. స్త్రీల శోచనీయమైన దుస్థితి చూచి ఆయన వ్యథచెందాడు. ఆయన భావాలు విప్లవాత్మకాలు. ఒకసారి ఆయన ఇలా అన్నాడు. "పురుషుల అధికారానికి లోబడి, పురుషుల పెత్తందారీతనానికి బలియై స్త్రీలు బానిసలుగా ఎలా బాధపడుతున్నారో నేను ఊహించగలను". మరో సందర్భంలో విడాకులు కావాలని ఆయన వాదించాడు. 1897 లో ఈభావం ఎంతటి విప్లవాత్మకమైనదో! జాగృతిపొంది చైతన్యవంతంగా కార్యాచరణకు పూనుకోమని స్త్రీలకూ ఉద్బోధించాడు. తిరుగుబాటు చెయ్యమని పిలుపు ఇచ్చాడు. "స్త్రీ అబల కాదు. పురుషునికన్నా స్త్రీకి మానవతా భావాలు మెండు... స్త్రీ పురుషునికన్నా ఏ విధంగా తక్కువ?"[16] అని గురజాడ గంభీరంగా ప్రశ్నించాడు. స్త్రీ విమోచనపట్ల ఆయనకున్న ఆకాంక్ష మండుతున్న అగ్నిపర్వతంనుండి వెలువడే 'లావా' లాంటిది. ఆయన నిక్కచ్చి మనిషి; నిజాయితీ ఆయన సొమ్ము. అన్యాయం యెక్కడ జరిగినా ఆయన సహించలేడు. అందులో స్త్రీకి జరిగే అన్యాయాన్ని అసలే సహించలేడు.

## రఘుపతి వెంకటరత్నంనాయుడు (1862—1939)

వెంకటరత్నంనాయుడు వీరేశలింగం అనుచరుడు. బ్రహ్మసమాజవాది. అనాదలు, అస్పృశ్యులు, వీరి ఉద్ధరణకై ఆయన శ్రమించాడు. పరిశుద్ధ జీవనం గడపమని ప్రజలకు ఉద్బోధించాడు. కార్యాచరణలో ఆయన వదాన్యుడు. ఉత్సాహమూ పట్టుదలకల సంఘసంస్కర్త. అనాథాశ్రమాలు నెలకొల్పాడు. అస్పృశ్యుల బాలబాలికలకు ఉచిత విద్యను ఏర్పాటు చేశాడు. దేవదాసీల భోగం మేళాలకు వ్యతిరేకంగా ప్రచారం సాగించాడు. ఆయనను ఆనాటి ప్రజలు "బ్రహ్మరుషి" అని పిలవటం యుక్తియుక్తం. అంతేగాక కాకినాడలో కాలేజీ ప్రధానాధ్యాపకుడుగా

విద్యార్థుల మనస్సులలో ఆరోగ్యకరమైన భావబీజాలు నాటాడు; సమాజానికి లాభమూ ప్రయోజనమూ చేకూరేటట్లుగా వారి శీలాన్ని ఆయన సరిదిద్దాడు. ఆయనను ప్రేమగా గౌరవంగా "నాయుడుగారు" అని పిలిచేవారు. దేవదాసీ సమాజంలో సంస్కరణకు ఆయన దోహదంచేశాడు. ఇలా స్త్రీజనోద్ధరణకై సేవ చేసిన మహనీయులలో వీరొకరు.

# మొదటిభాగం మూడవ అధ్యాయం రిఫరెన్సులు

1. 'ఆంధ్రమహిళ' 1953 నవంబరు 45 నుండి 49 పుటలలో కనుపర్తి వరలక్ష్మమ్మగారి 'మహిళోద్యమం' వ్యాసం.
2. సి. రాజగోపాలాచారి : వీరేశలింగం స్మారక సంచికలో వి. ఆర్. నార్లగారి వ్యాసం పుట 3.
3. సి. ఆర్. రెడ్డి: వి. ఆర్. నార్లగారి వ్యాసం పుటలు 8, 9.
4. వి. ఆర్. నార్ల ,, ,, పుట 9.
5. డి. ఆంజనేయులు 'కందుకూరి వీరేశలింగం' (Builders of Modern India 1976) పుట 80
6. వీరేశలింగం స్మారక సంచికలో వి. ఆర్. నార్ల వ్యాసం : పుట 7
7. రఘుపతి వెంకటరత్నంనాయుడు : వీరేశలింగం స్మారక సంచిక పుట 27
8. డి. ఆంజనేయులు "కందుకూరి వీరేశలింగం" పుట 89
9. ,, ,, ,, 91
10. ,, ,, ,, 61
11. ,, ,, ,, 126
12. ,, ,, ,, 126
13. వీరేశలింగం స్మారక సంచిక పుట 9
14. డి. ఆంజనేయులు 'కందుకూరి వీరేశలింగం' పుట 69
15. 'విముక్తి ఉద్యమాలు మహనీయులు' : మల్లాది సుబ్బమ్మ వ్యాసం "కందుకూరి దంపతులు" పుట 28
16. 'మహాకవి గురజాడ' దేవులపల్లి ప్రభాకరరావు (1969) పుట 33

# 4 వ అధ్యాయం : సంఘసంస్కరణ

బాల్యవివాహం రెండు తెఱగులు. 14 సంవత్సరాలలోపు వయస్సు కల బాలికలను వృద్ధ పురుషులకు పెండ్లి చేయుటం మొదటిది. 18 సంవత్స రాలలోపు వయస్సు గల బాలికలకు, 21 సంవత్సరాలలోపు ఉన్న పురుషులకు జరిగే వివాహం రెండవరకం. 19 వ శతాబ్దంలో మొదటి రకపు వివాహాన్నే బాల్యవివాహంగా పరిగణించేవారు.

8, 9 ఏండ్ల బాలికలను 25 లేక 30 ఏండ్లున్న బ్రహ్మచారులకు వివాహాలు చేయడం ఆకాలంలో జరిగేది. అంతకన్నా ఘోరమైనది 50 లేక 60 ఏండ్ల ముసలి వారికి చిన్నారి కన్యలను పెండ్లి చేయుటం. కన్యాదానం చేసినందుకు ప్రతిఫలంగా కన్య తండ్రికి శుల్కం ముట్టేది. అది మామూలుగా ధనరూపంగా ఉండేది. దానిని కన్యాశుల్కమని పిలిచేవారు. వరుని వయస్సు ఎంత ఎక్కువైతే శుల్కం అంత అధికంగా ఉండటం కద్దు. మూడు పర్యాయాలు విధురుడైన ముసలికి తమ కుమార్తెలను విక్రయించేవారు. ఈ దుష్టాచారం మానవతా దృష్టి కోల్పోని వారికి కోపకారణమయ్యేది. ఈ ఆచారానికి విరుద్ధంగా వారు ఎడతెగని ఆందోళన సాగించారు. ఈ విషయంలో గురజాడవారు మార్గదర్శకులు. భార్య వద్దని గోల పెట్టున్నా లుబ్ధావధాన్లు అనే పేరుగల ధనిక విధురుడికి కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని గురజాడ వారి 'కన్యాశుల్కం' నాటకంలోని పాత్ర అగ్నిహోత్రావధాన్లు మాట ఇస్తాడు. చివరకు ఆ కన్య మేనమామ, అతని ప్రియురాలు భోగం కులానికి చెందిన మధురవాణుల కుతంత్రాల వల్ల ఆమెకు ఆ గండం తప్పు తుంది. నాటకం పేరు ప్రఖ్యాతులను పొందింది. విజయవంతం అయింది.

ఈ భయంకర ఆచారంలో ఇమిడి ఉన్న దుర్మార్గం, క్రూరత్వం, నైచ్యం వెల్లడి అయినాయి. 'కన్యాశుల్కం' నాటకం మొదటిసారిగా 1897 లో అచ్చయింది. రెండవ కూర్పు 1909 లో వచ్చింది. కన్యాశుల్కం క్రింద పైకం చెల్లించడానికి అంగీకరించిన ఒప్పందము అవినీతి కరమూ, ప్రజా సంక్షేమ వ్యతిరేకమూ కనుక కంట్రాక్టు ఆక్టు 23 వ సెక్షను క్రింద చెల్లనేరదని మద్రాసు హైకోర్టులో ముగ్గురు న్యాయమూర్తులు-ఆర్నాల్డ్ వైట్, మిల్లరు, మన్రోలు-ఇచ్చిన తీర్పు ఆ ఉద్యమాన్ని బలపరచింది.

బాల్యవివాహాలకు వ్యతిరేకంగా ప్రచారం చేసిన వారిలో బైరాంజీ మలబారి (1853 - 1913) అనే పేరుగల సంఘ సంస్కర్త ఒకరు. 1880 లో రుక్మాబాయి అనే కన్య తన భర్తతో కాపురం చెయ్యనని వాదించింది. ఆమె చిన్న వయసు కన్య. ఫూలమణి దాసి అనే పదకొండేండ్ల కన్యతో ఆమె రజస్వల కాకముందే భర్త దాంపత్య జీవితం సాగించి ఆమెను చంపాడు ఈ రెండు కేసుల ఫలితంగా ఈ సమస్య ప్రజల దృష్టి పథంలో పడింది. బాల్యవివాహాలను నిషేధిస్తూ శాసనం చెయ్యమని 1500 మంది స్త్రీలు విక్టోరియా రాణికి మహజరు పంపారు.[2] 10 ఏండ్ల లోపు భార్యతో సంభోగిస్తే భర్త నేరస్థుడని భారత శిక్షాస్మృతి చెప్పింది. తరువాత 1891 లో వచ్చిన 'అంగీకారపు వయస్సు చట్టం' (Age of Consent Act) ప్రకారం 12 ఏండ్ల లోపు భార్యతో భర్త దాంపత్య జీవితం గడపడం నేరమయింది. కాని శాసనం విధించే శిక్షలు ఆ దురాచారాన్ని ఆపలేక పోయాయి. బాల భార్యలను భర్తలు చెరచడం, హింసించడం సాగిపోయింది.

## రజస్వలానంతర వివాహాలు

ఈ యుగంలో అనేక మంది సంఘ సంస్కరణాభిలాషులు రజస్వలానంతర వివాహాలకు అనుకూలంగా బహుళ ప్రచారం చేశారు. 1876 లో

వీరేశలింగమూ ఆయన స్నేహితులు ఈ విషయంలో కూడా కృషిచేశారు. దాసు మాధవరావు ఆంధ్రపత్రికలో ఈ సంస్కరణకు అనుకూలంగా వ్యాసం రాశాడు.[3] వల్లూరి సూర్యనారాయణ సమర్థించాడు.[4] కాని ఈ పరివారం సమస్యను ఉద్ధృతంగా ప్రజల దృష్టికి తేలేకపోయింది. కాకపోతే ఈ సందర్భంగా ప్రారంభం - అందులో మంచి ప్రారంభం - జరిగింది. అంతవరకు అది ఉపయుక్తం.

## విధవావివాహాలు

ఈ యుగంలో జరిగిన ప్రధాన సంస్కరణ విధవా వివాహాలు, ఇంకా నిక్కచ్చిగా చెప్పాలంటే బాల విధవల పునర్వివాహాలు అవి. ఈ సంస్కరణ గౌరవం కందుకూరి దంపతులకు వారి అనుచరులకు చెందుతుంది. 1875 లో మహా మహోపాధ్యాయ పరవస్తు రంగాచార్య అని మహా పండితుడు బాల విధవల పునర్వివాహాన్ని సమర్థిస్తూ వ్యాసరచనకు చేశాడు. ఆ వ్యాసం కందుకూరి వీరేశలింగం కంటపడింది. ఆయన రాజమండ్రిలో తే 3 - 8 - 1879 న విధవా వివాహాలను సమర్థిస్తూ ప్రథమ ఉపన్యాసం చేశాడు. విధవావివాహ సంఘాన్ని ఆయన స్థాపించాడు. 1881 డిసెంబరులో మొదటి విధవా వివాహం జరిగింది. పైడే రామకృష్ణయ్య, బారు రాజారావు ధనసహాయం చేశారు. న్యాయాధికారులూ, ఇతర ఉన్నతోద్యోగులు కూడా ఆసక్తి కనపరిచారు. 1884 నాటికి పది పెండిండ్లు అయినాయి. హిందూ సంఘంలోని సనాతనులు వీరేశలింగాన్ని అతని స్నేహితులను వెలివేశారు; సంఘ బహిష్కరణ చేశారు; సహాయ నిరాకరణ జరిగింది. వీటికి పంతులుగారు, వారి అనుచరులు చలించలేదు. బాల విధవల తల్లిదండ్రుల అంగీకారం పొందడం మొదటి అడ్డంకి. వరుడు భయకంపితుడు కావడం, పెద్దలు పెండ్లికి రావటానికి సందేహించడం, మేళం వాయించే భజంత్రిలు తటపటాయించటం

తరువాత వరుసగా వచ్చే ఇబ్బందులు. వరునికి ఉద్యోగం ఇప్పించడం, వధూవరులకు గృహవసతి కల్పించడం, వారి బాగోగులను శ్రద్ధాశక్తులతో చూడటం తరువాతి దశలో చేయవలసిన పనులు. అయినా ఈ పను లన్నింటినీ ఆయన సేవాదృష్టితో, పట్టుదలతో సాగించాడు 1884 లో మరో నూతన సంఘం నెలకొల్పబడింది. 1884 నుండి 1891 వరకూ అనగా ఏడేండ్ల కాలంలో మూడు వివాహాలు మాత్రమే జరిగాయి. 1882 లో ఈశ్వరచంద్ర విద్యాసాగరు వీరేశలింగాన్ని అభినందించాడు. 1889 లో పంతులు మద్రాసు వెళ్ళాడు అప్పటికి వివాహాల సంఖ్య 27 కు పెరిగింది. సరోజనీదేవి (సరోజనీ నాయుడుగా ప్రఖ్యాతి నొందిన జాతీయ నాయకురాలు) మేజరు గోవిందరాజుల వివాహాన్ని మదరాసులో ఆయన జరిపించాడు. ఆచార్య డి. కె. కార్వేను (పూనే), బెంగాలుకు చెందిన శివనాథశాస్త్రిని ఆయన కలిశాడు. 1906 లో ఆయన హితకారిణీ సమా జాన్ని స్థాపించాడు. విధవా శరణాలయం ఆ సంస్థ ఆధ్వర్యంలో నడిచేది.

విధవా పునర్వివాహ శాసనం 1856 లో వచ్చిన కొలది మాసాలకే బెంగాలులో ప్రథమ విధవా వివాహం జరిగింది. మహారాష్ట్రంలో ప్రథమ వివాహం 1857 లో జరిగింది. ఆంధ్రప్రాంతం ఈ సంస్కరణకోసం 1881 వరకు వేచి ఉండవలసివచ్చింది. నాయుడు కులంలో మొట్టమొదటి విధవా వివాహం 1901 నాటిది. గుంటూరుజిల్లాలో అలాంటి మొట్టమొదటి పెండ్లి 1902 నాటిది. విశ్వబ్రాహ్మణ కులంలో ఈ సందర్భంగా మొదటి పెండ్లి 1903 లో నిర్వహింపబడింది. వీరేశలింగం బ్రాహ్మణకులం యెడ మాత్రమే శ్రద్ధవహించాడనేది పూర్తిగా నీలాపనింద. కొందరు స్వప్రయో జనపరులు పనికట్టుకొని సాగించే ప్రచారమది. అందులో సందేహంలేదు.

వీరేశలింగంకు స్నేహితులు గవరాజు, బసవరాజు, చల్లా బాపయ్య అండగా నిలిచారు. వారి బలం ఆయనకు మద్దతును ఇచ్చింది.

# భోగం మేళాలు

ఏ పండుగ పబ్బం జరిగినా 19 వ శతాబ్దంలో భోగంమేళం ఉండేది. ఒక కులానికి చెందిన వ్యభిచారం కులవృత్తిగా కొనసాగించేవారు ఇళ్ళల్లో, వీథులలో, బహిరంగ సమావేశాలలో, దేవుని ఊరేగింపుల ముందు, దేవాలయాల్లో సంగీతానికి అనువుగా నాట్యంచేసేవారు. వారు దళాలుగా ఉండి మేళం జరిపేవారు. నాట్యగత్తె పేరునసాని, సంగీతం ఆలాపించే ఆమె పేరుపగాని ఆ దళం పిలువబడేది. అలాంటి మేళాలను సంఘ పెద్దలు పోషించేవారు. ఆ పెద్దల ప్రాపుకోరేవారు ఆ మేళాల నాయకురాండ్రకు ఆ యా సందర్భాలలో బహుమతులు చదివించడం ఆనవాయితీ అయింది. ఈ ఆచారాన్ని పాటించకపోతే ఆ పెద్దలను అవమానించినట్లులెక్క. తన వివాహమప్పుడు భోగంమేళం లేకపోతే దానిని తనకు జరిగిన ఘోరావమానంగా భావించేవాడు వరుడు.

వధూవరులు పవిత్ర దాంపత్య జీవితంలోకి అడుగిడబోయే శుభసమయంలో సందేహాస్పదమైన శీలమూ, అనుమానాస్పదమైన నడత కలిగిన వారిచేత నాట్యం చేయించడానిని వీరేశలింగం పంతులు గర్హించాడు. రాజమండ్రిలో 1881 లో ప్రథమవిధవా వివాహం జరిగినప్పుడు భోగంమేళం నాట్యం చేసింది. ఆయనకు ఇష్టంలేకపోయినా కాదనలేకపోయినాడు. మొదటి పెండ్లి ఘనంగా జరగాలని అందరూ పట్టుబట్టడమే కారణం. ఆయనకు కడుపు మండిపోయింది. కాని తన భావాలను ప్రకటించలేదు. మొదటిపెండ్లి అయిపోగానే ఆయన మేళాలకు అభ్యంతరం తెలిపాడు. వాటి ఏర్పాటును నిషేధించాడు తరువాతి పెళ్ళిళ్ళలో. తన పత్రికలలో తీవ్రంగా నిరసన ఉద్యమాన్ని నడిపాడు. ఆ దుర్మార్గపు ఆచారాన్ని రూపుమాపటానికి తన సునిశిత తర్కశక్తిని, తన రచనా నైపుణ్యాన్ని వినియోగించాడు. సంస్కృతి పేరుతో భోగంమేళాలను, భోగపు స్త్రీలను ఆదరించిన పెద్దలపై తన హాస్యాన్ని కుమ్మరించాడు. వారిని ఎగతాళి చేశాడు; వారిపై జుగుప్స రగుల్కొల్పాడు. వారిశీలాన్ని నడతను ఖండిం

డాడు. నాట్య స్త్రీలను ఉంపుడుగత్తెలుగా ఉంచుకొనడానికి, వారిచేత నృత్యం చేయించడానికి 'పెద్దలు' ఘనుపడేస్థితి - సాంఘిక వాతావరణం ద్వారా కల్పించాడు.

తరువాత రఘుపతి వెంకటరత్నం నాయుడు పంతులుగారు విశ్వాస పాత్రుడైన అనుచరుడిలా ఈ ఆందోళనను ధర్మయుద్ధంలాగా కొనసాగించాడు. ఆయన ప్రయత్నాలు తరువాత ఫలించాయి.

## దేవదాసీ వ్యవస్థ

"కళావంతులు" అని పిలువబడుతున్న ఒక ప్రత్యేక కులానికిచెందిన స్త్రీలను దేవునికి అంకితం చేసేవారు. వారిని 'దేవదాసీలు' అని పిలిచే వారు. దేవుళ్ళముందు నాట్యం చేయడానికి వారికి ఈనాముగా భూములు ఇవ్వడం జరిగేది. వాటి ఫలసాయాన్ని వారు అనుభవించేవారు. అయితే వారు అవివాహితలుగా ఉండాలి. వారు సంగీతం, నాట్యం మొదలగు లలిత కళలలో ఆరితేరిన వారు. అందువలన వారు పరిపాలించే రాజులకు వారి ఉద్యోగులకు ఉంపుడు కత్తెలుగా ఉండేవారు. అలా ఒక కులపు వారు యావన్మందిని వ్యభిచార వృత్తిని స్వీకరించారు. వారి అక్క చెల్లెండ్రు, తల్లులు ఆడిపాడుతుంటే ఆ కులంలోని మగవారు మద్దెలలాంటి వాయిద్యాలను వాయించేవారు. అలా ఒక కులాన్ని మొత్తంగా వ్యభిచారవృత్తి మీద బ్రతకమన్నట్లయింది. వీరేశలింగంలో అంతర్గతంగా ఇమిడివున్న సభ్యత, న్యాయము అనే భావాలకు ఈ పరిస్థితులు రోత కల్గించాయి. తన పత్రికలైన 'వివేకవర్ధని', 'చింతామణి' 'సత్యవాదిని' లలో ఈ ఆచారాన్ని ఖండిస్తూ ఆయన వ్యాసాలు వ్రాశాడు; బహిరంగ సభలలో తీవ్రంగా దుయ్యబట్టాడు.

రఘుపతి వెంకటరత్నం నాయుడు వీరేశలింగం అనుచరులలో ఉద్దండుడు. ఆయన ఈ ఆచార నిర్మూలనాన్ని తన సంఘ సంస్కరణ ప్రయత్నాలకు కేంద్రంగా తీసుకున్నాడు. అవినీతిని అందంగా అలంకరించటం, దానికి సౌలభ్యం కల్పించటం, ఏదో సాకు చెప్పి దానిని సమర్థించటం, దానిని ఆచారంగా పేర్కొనటం, చెడును ఆమోదించటంతో

సమానం; అంతేకాక సమాజాన్ని కరుడు కట్టిన స్వార్థంగా చిత్రించడమే ఆవుతుంది.[5] అని వెంకటరత్నం నాయుడు తన తీవ్రమైన పదజాలంతో నిరసించాడు. ప్రభుత్వ శాసనాల వైఫల్యాన్ని ఆయన గుర్తించాడు. "వ్యభిచారం యెడల ప్రభుత్వం ప్రదర్శించే పట్టీ పట్టని వైఖరి, తరువాత దానిని నియంత్రిం చేయుటానికి ప్రయత్నించటం ఈ రెండూ కూడ దుష్టత్వానికి లైసెన్సు ఇచ్చి క్రమబద్ధం చేయుటమే." అని అన్నాడు. సామాజిక పారిశుద్ధ్య సంఘాన్ని ఆయన ప్రారంభించాడు. సంఘ సభ్యులూ సమాజంలో మనుష్యులూ వీరి నైతిక శీలాన్ని పెంపొందించడమే ఆ సంస్థ ఆదర్శం. భారత శిక్షాస్మృతిలో ఇలాంటి దుర్మార్గాన్ని అరికట్టడానికి అనేక సెక్షనులున్నాయి వాటి ప్రకారం 18 ఏళ్ళలోపు స్త్రీని వ్యభిచారం కోసం ఇతర దేశాలనుండి దిగుమతి చేయుటం, అవినీతి ప్రయోజనాల కోసం విక్రయించడం, కొనడం, వారి దేహాలను ఇతరులకు అరువు ఇవ్వటం, అందుకోసం వారిని ఎత్తుకొని పోవడం, సంరక్షకుల ఆధీనంలో నుండి తప్పించటం, అవినీతికరమైన అవసరాల కొరకు వివాహిత స్త్రీని ప్రలోభ పెట్టటం, లేక ఆమెను ఆధీనంలో ఉంచుకోవటం నేరాలు. స్త్రీల విషయమై బాలికలకు సంబంధించి అవినీతికర వ్యాపారాలు చేయరాదని ప్రకటించిన ఒప్పందాలు 1904 లో, 1910 లో పుట్టాయి. వాటిని బ్రిటిషు సామ్రాజ్యంలో భాగంగా ఉన్న భారతదేశ ప్రభుత్వం ఆమోదించింది. 1912 లో భారతకేంద్ర శాసన సభలో ఈ సందర్భంగా మూడు బిల్లులు ప్రవేశపెట్టబడినాయి. వాటిని మనెక్‌జీదాదాభాయి, మధోల్కరు, మాడెలు ప్రతిపాదించారు. వ్యభిచార నిర్మూలనే వాటిలక్ష్యం. సనాతన మతావలంబియైన పండిత మదన మోహన మాలవ్యా కూడా వాటిని బలపరిచాడు. 1913 సెప్టెంబరులో ఆనాటి ప్రభుత్వం ఒక బిల్లును ప్రవేశ పెట్టింది. దానిని సెలక్టు కమిటీకి పంపారు. సెలెక్టు కమిటీ నివేదిక సమర్పించింది. వ్యభిచార గృహాలనుండి రక్షింపబడే స్త్రీలకు శరణాలయాలు లేవనే సాకుతో ఆ బిల్లుకు అదను రాలేదని ప్రకటించి బిల్లును వదులుకోవడం జరిగింది.[6] వ్యభిచార నిర్మూలనకు జరిగిన ప్రయత్నాలు అలా నిరర్థకంగా ముగిసాయి.

# మూఢవిశ్వాస నిర్మూలన

ఈ విషయంలో కూడ వీరేశలింగం ప్రథమ స్థానం ఆక్రమించాడు. సనాతన హిందూ భావం ప్రకారం అమావాస్య చెడ్డరోజు. కాని అమావాస్య నాడు కోరంగి అనే గ్రామంలో ఒక పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగా ఆయన పదవీ స్వీకారం చేశాడు. మంత్రవేత్తనని తన తల్లిని నమ్మించిన మోసగానిని తరిమికొట్టాడు. దయ్యాలు భూతాలు లేవని వాదించాడు. జ్యోతిషం తప్పని రుజువు చేయటానికి సర్వదా సిద్ధంగా ఉండేవాడు. జ్యోతిర్గణితం మీద పుస్తకం వ్రాసి గ్రహణాలు ఎలా సంభవిస్తాయో వివరించాడు. అన్నిరకాల అన్ని రంగుల మూఢవిశ్వాసాన్ని నిరసించాడు. మోసగాండ్రను, అబద్ధీకులను ఆయన సహించే వాడు కాదు. ఆయన ఆస్తికుడన్నమాట వాస్తవమే. కాని ఆయన దేవుడు నిరాకారుడు కులాలను శాఖలను అతడు పట్టించుకునేవాడు కాదు. బ్రాహ్మణులలో విధవా వివాహాన్ని అందులో శాఖాంతరమైన దానిని చేయించిన ఘనత ఆయనదే. తన యజ్ఞోపవీతాన్ని త్యజించి అనుష్టాన బ్రాహ్మశాఖను అవలంభించాడు. అజ్ఞానజనితమైన అభిమాన దురభిమానాలు, రాగ ద్వేషాలు అతడి జోలికి వచ్చేవి కావు. ఇతరులు అనుకరించటానికి, ఆ మాటకువస్తే పోటీ పడటానికి తగినది ఆయన జీవితం. భావ వికాస యుగానికి అతడు వైతాళికుడు. ఇది ఎందుకు ఇలా ఉన్నది, ఈ సంఘటన ఎందుకిలా జరిగింది, అని ప్రజలు ప్రశ్నించడాన్ని ఆయన ప్రోత్స హించాడు. ఎగతాళి చేయువలసివస్తే ఆ సందర్భంలో అతడు దయా దాక్షిణ్యాలను ప్రదర్శించేవాడు కాదు. అతని కలం పోట్లకు ప్రత్యర్థులు గింగిరాలు తిరిగిపోయ్యేవారు. కపటాన్ని, మోసాన్ని అతడు పారద్రోలాడు. తన ఉనికిని సమర్థించుకోమని అంధవిశ్వాసాన్ని సవాలు చేయడం జరిగేది. ఒకరకంగా ఆస్తిక హేతువాదిగా ఆయనను అభివర్ణించవచ్చు. ఆయన తన కాలంలో ఉద్భవించినవాడు. నాస్తికుడు కాలేక పోయాడని ఆయనను దుయ్యబట్టటం అసంబద్ధం,

వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడులాంటి మహా వ్యక్తు లను ఈ బ్రహ్మసమాజమతం సమాజానికి ప్రసాదించింది.

బ్రాహ్మ మతావలంబులు సంప్రదాయాన్ని ఎదిరించారు. మౌఢ్యానికి అంధవిశ్వాసానికి ఉన్న పునాదులను బదాబదలు చేశారు. వ్యక్తిగత సామాజిక జీవితాలకు సంబంధించిన ఉన్నతోన్నత సత్యాలు ఆవిర్భవించ టానికి వారు దోహదం చేశారు.

# మొదటి భాగం నాలుగవ అధ్యాయం రిఫరెన్సులు

1. కన్యాశుల్కం రెండవ కూర్పు 1909 అక్టోబరు 19 ముద్రణ. (ఎం. శేషాచలం కం పెనీ ప్రచురణ) పుట 9 గురజాడ అప్పారావుగారి పీఠిక.
2. డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి గారి "ఆంధ్రలో స్త్రీల మారుతున్న పరిస్థితి" (ఆంగ్లంలో) పుట 94 లో పేర్కొనబడిన 'ఇండియన్ సోషల్ రిఫార్మరు పుటలు 250 - 251
3. 1913 ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక పుటలు 142 నుండి 148 దాసు మాధవ రావుగారి వ్యాసం
4. 1915 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక పుటలు 78 - 82 వల్లూరు సూర్య నారాయణ గారి వ్యాసం.
5. డా॥ పుతలీ కృష్ణమూర్తి పుస్తకం పుట 205 [రఘుపతి వెంకట రత్నం నాయుడు సందేశము పరిపాలన (1929) పుట 17]
6. ,, ,, పుట 206
7. ,, ,, పుట 207
8. ,, ,, పుటలు 213-214
9. ,, ,, పుట 224

కందుకూరి వీరేశలింగం స్వీయ చరిత్ర.

# 5 వ అధ్యాయం : వోటుహక్కు

పురుషులతో సమానత్వాన్ని వోటు హక్కును భారతస్త్రీలు తమంత తాముగా పోరాడి సాధించుకోలేదు. బ్రిటిషు మహిళోద్యమ విజయ ఫలితంగా అవి భారత మహిళలకు కూడా సంక్రమించాయి. బ్రిటిషువారు భారత దేశంలో కాలిడకముందే భారతస్త్రీ ఒక వ్యక్తిగా పరిగణింప బడిన దనేమాట నిస్సందేహంగా వాస్తవము. కొన్నిరకాల ఆస్థులపై ఆమెకు సర్వహక్కులుండేవి. బ్రిటిషు మహిళలకు మొదట్లో అలాంటి హక్కు ఉండేది కాదు. బ్రిటిషు స్త్రీలకు ఆస్తిహక్కు లేని రోజులలో భారత స్త్రీలకు స్త్రీ ధనపు ఆస్థి ఉండేది.[1] తమ సంపాదనమీద, వేతనాలమీద ఐరోపాస్త్రీలకు యాజమాన్యముగాని ఆధిపత్యం గాని లేని రోజుల్లో తమ శ్రమఫలితం మీద తమ సంపాదన మీద యాజమాన్యపు హక్కు, వినియోగపు హక్కు భారత స్త్రీలకు ఉండేది. సాహసమూ, ధైర్యమూ, పాండిత్యమూ, వివేకమూ, మేధాశక్తి ప్రదర్శించిన స్త్రీలు పరిపాలకులుగా, రాణులుగా ఉన్నట్లు చరిత్రలో మనకు కన్పించినా మొత్తంమీద రాజకీయాలలోనుపరిపాలనా వ్యవహారాలలోనుపురుషులతోపాటు స్త్రీలుసమానహోదాను అనుభవించారని చెప్పటం కష్టం. ధైర్యసాహసాలకు ప్రతీక అయిన పాంకు హర్స్ట్ నాయకత్వ ఫలితంగా బ్రిటిషు స్త్రీలకు వోటుహక్కు వచ్చింది. బ్రిటిషువారి పాలనలో వున్న భారతదేశం బ్రిటిషు సామ్రాజ్యంలో భాగం కనుక భారత స్త్రీలకూ ఆ వోటుహక్కు లభించింది. ఈ సందర్భంలో మనం ఒక అంశాన్ని గుర్తుంచుకోవాలి భారతస్త్రీలకు 1890 - 1918 కాలంలో వోటుహక్కు లేదు.

# 6 వ అధ్యాయం : స్త్రీలకొరకు పత్రికలు

1883 లో వీరేశలింగం స్త్రీలకొరకు ఒక పత్రికను నెలకొల్పాడు. దాని పేరు "సతీహితబోధిని" అది మాసపత్రిక. ఆరోగ్యము, నీతి, భార్యలుగా స్త్రీల విధ్యుక్త ధర్మాలు వీటిపై వ్యాసాలుండేవి అందులో. ఆ పత్రికలో ఎంతో సమాచారం ఉండేది; ప్రబోధకంగా భాసిల్లేది. బలవంతంగా స్త్రీలను ఇళ్ళలో బంధిస్తే స్త్రీలు తమనుతాము రక్షించుకో లేరని వీరేశలింగం అభిప్రాయం. తమను తాము రక్షించుకోగల స్త్రీలకే రక్షణ ఉన్నట్లు లెక్క అని ఆయన భావించేవారు.

1896 లో సంగీతరావు బాపిరాజు 'శ్రీ బాలిక' అనే పేరుతో మాస పత్రికను స్థాపించాడు. ఆయన వృత్తుగ్రీడు ప్లీడరు. స్త్రీలపట్ల జరిగే అనేక అన్యాయాలను ఆ పత్రిక వెలికి తెచ్చినదట.

పత్తిరాజు సీతారామయ్య 1902 లో 'హిందూ సుందరి' పత్రికను మొదటిసారి ప్రకటించాడు. సంఘ సంస్కరణకు ఆ పత్రిక ఎక్కువగా ప్రాధాన్యత ఇచ్చేది. మొసలి కంటి రామబాయమ్మ కొన్ని సంవత్సరాలు ఆ పత్రికకు సంపాదకురాలుగా ఉన్నది. 1913 లో బాలాంత్రపు శేషమ్మ ఆ బాధ్యతను స్వీకరించింది. శక్తిసామర్థ్యాలతో ఆమె పత్రికను నిర్వ హించింది. 1953 వరకు ఆ పత్రిక ప్రకటింపబడుట గమనార్హము. అర్చిబాల్డ్‌పతి సంపాదకత్వాన 1909 లో 'వివేకవతి' పత్రిక వెలువడింది.

పులుగుర్తి లక్ష్మీ నరసమాంబ 'సావిత్రి' అనే మాసపత్రికను ప్రచురించింది. ఆమె మంచివక్త, హిందీ, బెంగాలీ భాషలలో గొప్ప పాండిత్యము కల స్త్రీ. స్త్రీలకు విద్య అవసరమని ఆమె ప్రచారం చేసింది. కాని కందుకూరి సంఘ సంస్కరణోద్యమాన్ని ఆమె దుయ్యబట్టేది.

'అనసూయ' పత్రిక కాకినాడలో పుట్టింది. మహిళోద్యమానికి అది ఎనలేని సేవచేసింది. వింజమూరి వెంకటరత్నమ్మ ఆ పత్రికలలో తరచుగా వ్యాసాలు వ్రాసేది.

అనేక విషయాలపై స్త్రీల దృక్పథాన్ని, అభిప్రాయాలను వ్యక్తం చేయటానికి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో అవకాశం దొరికేది.

# మొదటిభాగం ఆరవ అధ్యాయం అనుబంధం

| వ సం. | వ్యాసపు శీర్షిక | రచయిత | పత్రిక | సం॥ పుట |
|---|---|---|---|---|
| 1. | బాల విధవలు | దామెర్ల సీతమ్మ | ఆంధ్రపత్రిక సం॥ సంచిక | 1911_68 |
| 2. | ఎవరుగొప్ప-పురుషులా లేక స్త్రీ | మాడభూషి చూడమ్మ | ,, | 911_91 |
| 3. | మేనరికం దుష్టం | వంబెరుమాళ్ళు | ,, | 1913_137 |
| 4. | రజస్వలానంతర వివాహాలు వాంఛనీయం | దాసు మాధవరావు | ,, | 1913_142 నుండి 148 |
| 5. | స్త్రీ విద్య | వేమూరి విశ్వనాధ శర్మ | ,, | 1916_80 నుండి 93 |
| 6. | స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం | చట్రాతి లక్ష్మీనారాయణమ్మ | ,, | 1916_191 |
| 7. | స్త్రీలకు విద్య విలువ | జూలూరి తులశమ్మ | ,, | 1916_267 |
| 8. | రజస్వలానంతర వివాహం : అవసరమైన సంఘ సంస్కరణ | వల్లూరి సూర్య నారాయణ | ,, | 1915_78 నుండి 82 |
| 9. | దేశానికి హిందూ స్త్రీల సేవ | ఎం. ఎస్. కమల | ,, | 1917_188 |
| 10. | స్త్రీ విద్యా సంస్కరణ | ద్రోణంరాజు వెంకటలక్ష్మమాంబ | ,, | 1917_192 |
| 11. | స్త్రీలకు ప్రాతినిధ్య స్వాతంత్ర్యం | పొణకా కనకమ్మ | ,, | 1919-67 |

# 7వ అధ్యాయం : మహిళా సంఘాలు

ఉమెన్స్ ఇండియన్ అసోసియేషను అనే పేరుతో అనిబిసెంటు నాయకత్వాన శ్రీమతి మార్గరెట్ కజిన్స్ 1917 లో మహిళా సమాజాన్ని స్థాపించారు. ఆనాటి భారతదేశ సెక్రటరీ ఆఫ్ స్టేటు అయిన మాంటేగ్యూ వద్దకు ఈ సంఘం రాయభారం వెళ్ళింది స్త్రీలకు వోటుహక్కు కావాలని.[1] 1927 లో 'ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు' (అఖిలభారత మహిళా మహాసభ) అనే సంస్థ స్థాపించబడేవరకు ఈ సంస్థ చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహించింది.

గుంటూరుజిల్లా బాపట్లలో చోరగుడి సీతమ్మ 'త్రిపుర సుందరీ సమాజాన్ని' నెలకొల్పింది. ఆ సంఘం బాపట్లలో అనియత పాఠశాల నిర్వహించింది. పక్కనున్న గ్రామంలో రాత్రి పాఠశాల నడిపింది. వివాహమయ్యేవరకు ఆమె తన ఇంట బాల విధవలను పోషించేది. [2]

1880 లో మన్నవ బుచ్చయపంతులు బాలికల పాఠశాల ఏర్పాటు చేశారు. [3] హైదరాబాద్‌లో ఈనాటికి విలసిల్లుతున్న 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం' ను రావిచెట్టు రంగారావు, ఆయన భార్య నెలకొల్పారు. ఈ గ్రంధాలయం స్త్రీ పురుషులందరి కొరకు ఉద్దేశించబడినా స్త్రీలకిది మహోపకారం చేసింది. [4]

ఉన్నవ లక్ష్మీబాయమ్మ, ఆమె భర్త లక్ష్మీనారాయణ విధవా వివాహోద్యమానికి గణనీయమైన సేవ చేశారు. గుంటూరులో తే 11-10-1902న ప్రథమ విధవా వివాహాన్ని వారు నిర్వహించారు. ఆ సంవత్సరమే హిందువులకు ఒక అనాధాశ్రమాన్ని ప్రారంభించారు. 1907 వరకు ఆ దంపతులిద్దరు బాల విధవల స్థితిని మెరుగుపరచటానికి కృషి చేశారు.

ఒక సంవత్సరం కందుకూరి వీరేశలింగంతో కలిసి రాజమండ్రిలో పని చేశారు. మరల గుంటూరు వచ్చారు.

సుప్రసిద్ధ చరిత్రకారుడు విమర్శకుడు కొమర్రాజు లక్ష్మణరావు సోదరి భండారు అచ్చమాంబ 1901 లో మహిళా సంఘానికి ఆవిర్భావం చేసింది. గుంటూరులో 'స్త్రీ నూతన ధర్మమండలి' 'కాకినాడలో'స్త్రీ ప్రార్థనా సమాజం, రాజమండ్రిలో మహిళా సమాజం పుట్టాయి. 6

కందుకూరి వీరేశలింగం భార్య రాజ్యలక్ష్మమ్మ (1852-1910) రాజమండ్రిలోని మహిళాపాఠశాల, మహిళాప్రార్థనాసమాజం, అనాథాశ్రమముల నిర్వహణకు బాధ్యత వహించింది. 7

1913 లో ప్రథమ ఆంధ్రమహాసభ బాపట్లలో జరిగినపుడు మహిళల సమావేశం జరిగింది. చోడగుడి సీతమ్మ ఆ సమావేశాన్ని ఏర్పాటు చేసింది. కొటికలపూడి సీతమ్మ అధ్యక్షత వహించింది. 8

బాపట్లలో ప్లీడరుగావున్న అన్నవరపు పుండరీకాక్షయ్య 1913 లో విద్యాభివర్ధనీ సమాజాన్ని స్థాపించి, దాని ఆధ్వర్యాన బాలికా పాఠశాల ప్రారంభించారు. ఆ పాఠశాల ఇప్పటికీ నడుస్తున్నది.

స్త్రీ జనోద్ధరణకు, స్త్రీ విద్యావ్యాప్తికి కృషిచేసే నిమిత్తం కాకినాడలో 'స్త్రీ విద్యార్థిని సమాజం' తే 27-9-1917 న ఉదయించింది. ఆ సంఘం వారి రజితోత్సవ సమయంలో కార్యదర్శి వేమురంటి పాపాయమ్మ ఈ విషయాన్ని ఎరుకపరిచారు. 9

అనంతపురంలో హట్టి పిల్లిమ్మ 'శారదా సమాజం' ఆవిర్భవించడానికి కారకులు. ఆ జిల్లాలోని ప్రథమ మహిళాసమాజం అదే.

# మొదటిభాగం ఏడవ అధ్యాయం రిఫరెన్సులు


1. జె. వరలక్ష్మి : యుగయుగాల్లో భారతీయమహిళ : పుట 445

2. కనుపర్తి వరలక్ష్మమ్మ స్మారక సంచిక : పుట 2

3. డా॥ ఇల్లాడి పైదేహి "ఆంధ్రప్రదేశ్ : స్త్రీలు" పుట 45

4. 'ఆంధ్రప్రదేశ్' జి. కృష్ణ వ్యాసం పుట 48

5. గృహలక్ష్మి 1948 పుట 1?7

6. 'ఆధునిక ఆంధ్ర నారీవికసన హేతువులు'
మాగంటి బాపినీడు వ్యాసం : గృహలక్ష్మి (1932) పుట 593

7. (1948) గృహలక్ష్మి : పుటలు 225, 226
కందుకూరిపై పాలకోడేటి గురుమూర్తి వ్యాసం.

8. 1953 నవంబరు 'ఆంధ్రమహిళ' పుటలు 45-49
'మహిళోద్యమం' పై కనుపర్తి వరలక్ష్మమ్మ వ్యాసం.

9. ఆంధ్రపత్రిక — 1918

10. ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య 5వ మహాసభ
సంచిక (1977) లో ఐదుకల్లు రాజమ్మ వ్యాసం : పుట 67

# 2 వ భాగం

# జాగృతిశకం [1919-42]

## 1 వ అధ్యాయం : శకలక్షణాలు

1918 రెండవ అర్ధభాగంలో ప్రథమ ప్రపంచ యుద్ధం ముగిసింది. భారత రాజకీయ రంగంలో 1919 లో మహాత్మాగాంధి ప్రవేశించాడు. అప్పటినుండి మహాత్మాగాంధి భారత రాజకీయాలను శాసించాడు. బ్రిటిషు వారిమీద ఆయన అనేక పోరాటాలు చేశాడు. 1921 సహాయనిరాకరణం, 1930, 1932 ల శాసన ధిక్కారం, 1941 వ్యక్తిగత సత్యాగ్రహం, 1942 క్విట్ ఇండియా ఉద్యమం ఇవన్నీ ఆయన నాయకత్వాన ఆయన నడిపిన ఉద్యమాలే. ఈ 24 ఏండ్లలోను పోరాటకాలం ఆరు సంవత్సరాలు మాత్రమే. మిగతా కాలాన్ని పోరాటానికి తయారుకావటానికి, పోరాట ఫలితంగా ఉద్యమాన్ని గట్టిచేసుకోవటానికి వినియోగించాడు. అయినా బ్రిటిషు వారిపై జరిపిన ఉజ్వల పోరాటాలు, సంఘర్షణ సమయంలో వెలువడిన బ్రహ్మాండమైన ప్రజాశక్తి భారత ప్రజల మనస్సులపై చెరగని ముద్రవేశాయి. వివాహమూ, ఆస్తి, వారసత్వం, వోటుహక్కులు వీటికి సంబంధించి హిందూ స్త్రీల పరంగా శాసన పురోగతి గణనీయం. ముస్లిం, పార్శీ స్త్రీలు కూడా ఉన్నత స్థానాన్ని పొందటం, ఎక్కువ హక్కులను సంపాదించుకోవటం కేవలం యాదృచ్ఛికం కాదు. వ్యభిచార వృత్తికి వ్యతిరేకంగా శాసనాల ద్వారా కృషి, తద్వారా సామాజిక సంస్కరణ ఈ శకంలో ప్రారంభమయింది. రాజకీయ రంగంకాక ఇతర రంగాలలో ఇతోధిక పురోగమనం కనిపిస్తున్నప్పుడు, ఎందుకు ఈ శకాన్ని సహాయనిరాకరణ రాజకీయశకం అని పిలవాలి! అని కొందరు ఆశ్చర్య పడవచ్చును. భారత ప్రజానీకాన్ని బ్రిటిషు వారికి వ్యతిరేకంగా మహాత్మా గాంధి పోరాటానికి సన్నద్ధం చేయగలిగాడు. ప్రజలను ఉత్తేజితులను

చేశాడు. భారత సమాజంలో అణగారియున్న స్త్రీ శక్తిని వెలికి తీసిన ఘనత ఆయనదే. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనమని స్త్రీలకు ఆయన ఇచ్చిన శంఖారావం స్త్రీల అమోఘ త్యాగ నిరతికి కారణభూతమైంది. అప్పటివరకు స్త్రీలు తమ భర్తలకోసం, చుట్టపక్కాలకొరకు, కుటుంబాల నిమిత్తం త్యాగం చేసేవారు. ఇప్పుడు తమ శాయశక్తులా దేశానికి సేవ చేయడానికి వారికి అవకాశం లభించింది. అప్పటివరకు ఏ రంగాలనుండి వారు దూరంగా ఉంచబడ్డారో, ఆ రంగాలలోకి వారు ఈ సందర్భంగా అసంఖ్యాకంగా జొరబడ్డారు. సహజంగా ఆ పరిస్థితిలో వారు ఎంతో అనుభవం గడించారు. వారికి ఆత్మవిశ్వాసం ప్రబలింది. ఈ ఆత్మ విశ్వాసం వారికి యితర రంగాలలో ఎంతో ఉపకరించింది. విద్య, సంఘ సంస్కరణ, పౌరహక్కులు మొదలైన రంగాలలో వారు ఎంతో పురోగమించగలిగారు. స్త్రీ శక్తి రాజకీయ రంగంలో ప్రివ్రిధమంగా విడుదల అయింది; విజృంభించింది. అందువలననే గాంధీజీ రాజకీయా లను పురస్కరించుకొన్న జాగృతి శకంగా పరిగణిస్తున్నాం.

# 2వ అధ్యాయం:

## ప్రభావితం చేసిన గాంధీ వ్యక్తిత్వం

భారత రాజకీయాలలోకి నీతిని ప్రవేశ పెట్టిన మహామహుడుగా గాంధీజీని కొందరు ప్రస్తుతించారు. జమీందారీ విధానానికి, పెట్టుబడి దారీ విధానానికి గాంధీ పెట్టని కోట అని పలువురు తీవ్రవాదులు విమర్శించిన విషయం మనకు తెలుసు. గాంధీజీని సమతుల్యంగా పరిశీలించే వర్గం మూడవది. అది ప్రతి సమస్యకు దాని గుణాగుణాలను బట్టి విలువకడుతుంది; అలాగే ప్రతి వ్యక్తిని ఆ మనిషి వాటి పట్ల ప్రదర్శించే వైఖరినిబట్టి మదింపు వేస్తుంది: ఒక సమస్య విషయంగా అతడు విప్లవకారిగా కన్పడుతాడు; మరొక సమస్య పరంగా వెనుక చూపు మనిషిగా దర్శనమిస్తాడు. ఆయన భావాలను కొన్నింటిని పరిశీలిస్తే ఇది సుబోధకమవుతుంది.

"పురుషుడికి లేని ఇబ్బందికి స్త్రీ లోనుకాకూడదని నా అభిప్రాయం. కుమారులను, కుమార్తెలను సమదృష్టితో నేను చూడగలగాలి" 1 అంటాడు అయన, మరో సందర్భంలో ఇలా చెప్పాడు.

"స్త్రీజాతిపట్ల ప్రత్యేకంగా చూపే వివక్షకు కాలంచెల్లింది. కుమారుడు పుట్టితే సంతోషించటానికి, కుమార్తె కలిగితే దుఃఖించటానికి నాకు కారణం కన్పట్టదు. జీవించటానికి ఇద్దరికీ సమానమైన హక్కు ఉన్నది; ప్రపంచం కొనసాగాలంటే ఇద్దరూ సమానంగా అవసరం" 2

వివాహానికి సంబంధించి కొన్ని అంశాలపై ఆయన అభిప్రాయాలు విప్లవాత్మకంగా ఉన్నాయి. ఎప్పుడో 1921 లోనే బాల్యవివాహాలను

నిరసించాడు. కన్యాదానానికి సనాతనులు ఇచ్చిన భాష్యాన్ని త్రోసి పుచ్చాడు. తండ్రి తన పిల్లలను తన ఆస్తిగా పరిగణించరాదన్నాడు. 3 ఆచారమూ మతమూ విధిస్తున్న వైధవ్యాన్ని ఖండించాడు. విధవా వివాహాలకు ఆయన సుముఖుడు. ఆయన దృష్టిలో బాల విధవలు వివాహితులు కాదు. 4 అంటే వాస్తవంగా వారికి వివాహం జరగలేదన్న మాట. బలవంతాన వైధవ్యం స్త్రీలపై రుద్దటం వారిపట్ల శాపంగా పరిణమిస్తుందంటాడు గాంధీ.

విడాకులకు ఆయన వ్యతిరేకి కాదు. మరో ప్రత్యామ్నాయం లేక పోతే దానిని ఆమోదించడానికి ఆయనకు అభ్యంతరం లేదు. 5

మహాత్మాగాంధీకి స్త్రీలయెడ అత్యంత గౌరవము ఉంది. వారి దృష్టిలో స్త్రీ అహింసయొక్క అవతారము. అంతులేని ప్రేమ, అవధిలేని త్యాగశక్తి ఈ రెండూ అహింసా లక్షణాలు. "శాంతి అనే అమృతంకోసం అర్రులు చాస్తున్నవారికి దానిని అందించేది స్త్రీ. సత్యాగ్రహ సాధనకు పాండిత్యంతో పనిలేదు; కావలసినదల్లా విశ్వాసము. సహనశక్తులనుండి ఉద్భవించే ధీరమనస్కత." 6 బలవంతముగా పెండ్లిచేయటం ఆయనకు గిట్టదు. ఒకసారి ఇలా అంటాడు "ఆమె సమ్మతిలేకుండా, లాభాన్ని లేక ద్రవ్యాన్ని ఆశించి ఆమె తల్లిదండ్రులు ఆమెకు వివాహం చేస్తే ఆ పరిస్థితుల్లో ఆమెను వివాహితగా పరిగణించను." 7 రాజకీయాలలో స్త్రీలు పాల్గొనాలని ఆయన అభిలషించేవాడు. "స్వరాజ్య సంపాదనా కృషిలో పురుషులతో సమానంగా స్త్రీలకు భాగస్వామ్యం ఉండాలి. బహుశః ఈ శాంతియుత పోరాటంలో స్త్రీలు పురుషులను అధిగమించగలరు." 8 స్వాతంత్ర్య పోరాటంలో మహాత్మాగాంధి స్త్రీలపై ఎక్కువగా ఆధారపడటంలో ఆశ్చర్యంలేదు.

కుమార్తెలను వివాహం చేసుకోమని తల్లి దండ్రులు బలవంతం చేయడాన్ని ఆయన నిరసించాడు. స్త్రీల సంపాదనా శక్తిని గురించి ఇలా చెప్పాడు మరొక సమయంలో. "తమ జీవనోపాధిని వారు సంపా

దించుకోవడానికి అశక్తులుగా తల్లిదండ్రులు కుమార్తెలను పెంచటం చాలా పెద్దతప్పు." శాపనాల విషయం పరిశీలించిన తదుపరి పాతశాసనా లన్నింటినీ పురుషులేరూపొందించారని ఆయనఅభిప్రాయపడ్డాడు. ఆ శాసన కర్తలు ద్రష్టలైనా రుషులైనా వారికి స్త్రీల విషయం ఆకళింపు అయినట్లు లేదని అన్నాడు.

కల్లు సారాయి దుకాణాలను, విదేశీ వస్త్ర విక్రయశాలలను పికెటింగు చేయమని స్త్రీలను గాంధీజీ కోరాడు. స్త్రీలు ఆ ప్రయత్నం చేస్తే హింసకు అట్టే ఆస్కారముండదని బహుశః దానిని మంచి ఎత్తుగడగా

ఆయన భావించి ఉండవచ్చు. ఈ విషయంలో ఆయన అంతర్గత భావాలు ఎలా ఉన్నా, ఆయన అభిప్రాయాలు, ఉపన్యాసాలు స్త్రీ శక్తిని ప్రజ్వరిల్లి చేశాయి.

బ్రహ్మచర్యం, నిగ్రహం, జన్మనిరోధం మొదలగు అంశాలపై గాంధీజీ అభిప్రాయాలు పురాతనమై కాలం చెల్లినవి. అయినా స్త్రీ జనాభ్యుదయానికి అత్యంత దోహదం చేసిన మహావ్యక్తులలో ఆయనకు ఉన్నత స్థానం ఉన్నది.

## రెండవభాగం రెండవ అధ్యాయం రిఫరెన్సులు

1. "యంగ్ ఇండియా" తే 17-10-29 మహాత్మాగాంధి.
(నవజీవన్ పబ్లిషింగు హౌస్ వారి "స్త్రీలు (వుమెన్)" పుట 5లో ఉటంకించబడినది.)

2. మహాత్మగాంధి: "హరిజన్" 18-5-1935 : పై పుస్తకం పుట 5

3. మహాత్మగాంధి : 'హరిజన్' తే 22-3-42 'సర్వోదయ' (నవజీవన్) పుట 62

" 'యంగ్ ఇండియా' తే 11-11-26 "స్త్రీలు"(నవజీవన్) పుట 63

4. " 'యంగ్ ఇండియా' తే 5-8-26 'సర్వోదయ' పుట 63

5. " " తే 7-10-25 "

6. " 'హరిజన్' తే 29-2-40

7. " 'యంగ్ ఇండియా' తే 18-8-27 'స్త్రీలు' (నవజీవన్) పుట 56

8. " " తే 15-12-21 'స్త్రీలు' పుట 29

. " 'హరిజన్' తే 15-9-46 'స్త్రీలు' పుట 60

10. " 'ఆశ్రమ స్త్రీలకు' (నవజీవన్) పుట 98

# 3 వ అధ్యాయం

## గాంధీజీ ఉద్యమాలు : స్త్రీలు

రాజకీయరంగంలో గాంధీజీ ప్రవేశంతో స్త్రీలకు సంబంధించనంత వరకు భారత రాజకీయరంగ రూపు రేఖలు చాలవరకు మారాయి. అంటే అంతకు క్రితం రాజకీయాలలో ప్రవేశించడానికి స్త్రీలపై నిషేధాలున్నవని కాదు. రాజకీయ జీవితాన్నుండి పూర్తిగా స్త్రీలు వెలి వేయబడలేదని అనిబిసెంటు నాయకత్వాన ప్రారంభింపబడిన 'హోంరూలు' (స్వయం పరిపాలన) ఉద్యమం రుజువు చేస్తున్నది. అంతేకాక వ్యక్తిగత హింసా వాద ఉద్యమంలో కూడ స్త్రీలు గణనీయమైన సంఖ్యలో పాల్గొన్నారు.

పాశ్చాత్య స్త్రీలు అనుభవించిన అసౌకర్యాలు భారత స్త్రీలకు లేవు. కాని, భారత స్త్రీలు అనేక ఇబ్బందులకు లోనైనారన్నది, ఆ ఇబ్బందులు కష్టాలు మరో రకమైన వన్నది వాస్తవము. సామాజిక రంగంలో వారి బాధలు వర్ణనాతీతం. భారత స్త్రీలను భారీ ఎత్తున రాజకీయాలలోకి తెచ్చిన ఘనత గాంధీజీది.

మిత్రమండలి విజయంతో ప్రథమ ప్రపంచ యుద్ధం అంతమయింది. గాంధీజీ వంటివారు బ్రిటిషువారిపై గాఢవిశ్వాసం పెంచుకున్నారు. ఆ యుద్ధం మరల యుద్ధం సంభవించకుండా చేయటానికి అన్న మిత్ర మండలి నినాదాన్ని ఆయన నమ్మాడు. ఆయన, ఆయనలాంటివారు బ్రిటిషువారి యుద్ధయత్నాలకు తోడ్పడ్డారు. విజయం పొందిన బ్రిటిషు పాలకులు చెప్పుకోదగిన రాజ్యాంగ సంస్కరణలను ప్రతిపాదించలేదు. మాంటెగ్యూ-చెమ్స్‌ఫర్డు సంస్కరణలు భారత ప్రజల ఆకాంక్షను తీర్చలేదు; తీర్చలేవుకూడాను. 1919 'గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టు' (భారతదేశ

పరిపాలనా శాసనం 1919) ప్రకారము రాష్ట్రాలలో 'డయార్కీ' (ద్వంద్వ పాలన) ప్రవేశపెట్టబడింది. ఆ పద్ధతి జాతీయ నాయకులకు నచ్చలేదు. సత్యాహింసలపై నొక్కిపెట్టే గాంధీ, నిరాడంబరంగా దుస్తులు వేసుకొనే గాంధీ ప్రజల దృష్టిని ఆకర్షించాడు. నిజానికి ఆయనకోసం భారత ప్రజలు ఎదురు చూస్తున్నారా అనిపిస్తుంది. హింసా వాదులు అశేషంగా త్యాగాలు చేశారు; ధైర్యసాహసాలను ప్రదర్శించారు. వారు అనుసరించిన మార్గం ప్రజలకు అందుబాటులో లేనందున వారికి ప్రజల మద్దతు లభించలేదు. గాంధీజీ తేలికైన మార్గాన్ని సూచించాడు. తన సలహాను పాటిస్తే ఒక సంవత్సరంలో స్వరాజ్యం వస్తుందన్నాడు. ఆయన వాగ్దానం ప్రజలను సమ్మోహితులను చేసింది. ఆయన సూచించిన మార్గం, పద్ధతి భారత ప్రజల శక్తిసామర్థ్యాలను మించిపోయేవి కావు. విదేశీ వస్త్రాన్ని బహిష్కరించమని, ఖద్దరు ధరించమని ఆయన కోరాడు. త్రివిధ బహిష్కారాన్ని ఆయన ప్రబోధించాడు. శాసన సభలను, న్యాయస్థానాలను ఆంగ్లవిద్యాలయాలను బహిష్కరించమన్నాడు. మధ్యతరగతి ప్రజానీకం ఈ పిలుపును అందుకున్నది. స్త్రీలు ఏ మాత్రం వెనుకంజ వేయలేదు.

తెలుగుదేశం అందులో ముఖ్యంగా ఆంధ్రప్రాంతం గమనించదగిన స్థాయిలో ఆయన కేకకు ప్రతిస్పందించింది. ఆయన 'మీటింగు' లకు వేల సంఖ్యలో స్త్రీలు హాజరయినారు. తమ బంగారు ఆభరణాలను ఆయనకు విరాళంగా సమర్పించారు. ఖద్దరు వస్త్రధారణ ప్రారంభించారు. జాతీయ భాష అయిన హిందీ అభ్యసించారు.[1] అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశానికి గాంధీజీ విజయవాడ (ఆనాడు బెజవాడ) 1921 లో విచ్చేసినపుడు మాగంటి అన్నపూర్ణ చేసిన త్యాగం అపూర్వం. ఆమె భర్త అపుడు ఇంగ్లండులో విద్యాభ్యాసం చేస్తున్నాడు కొలది రోజులలో ఆమె తన భర్త వద్దకు వెళ్ళవలసి యుండెను. ఆమె గాంధీజీ మీటింగుకు వచ్చింది. దేశ సేవకు గాంధీజీ పిలుపు విన్నది. ఆమె పులకితురాలయింది. తన శరీరము మీద నున్న నగల నన్నింటిని గాంధీజీకి సమర్పించింది. విలువైన విదేశీవస్త్రాలను దహనంచేసింది. ఖద్దరు ధరిస్తానని ప్రతిన

పూనింది. ఖద్దరు నేత కేంద్రాన్ని నెలకొల్పింది. ఏలూరులో. తన మిగతా ఆభరణాలను గాంధీజీకి ఇచ్చివేసింది. ఆమె గొప్ప వక్త. భర్త భారత దేశంలో అడుగు పెట్టగానే అతనికి ఖద్దరు వస్త్రాలను బహూకరించింది. ఆమె చిన్న వయసులోనే 1927 లో చనిపోతే గాంధీజీ ప్రత్యేకంగా సానుభూతి సందేశం పంపాడు. [2]

ప్రసిద్ధ కవి పుంగవులు బసవరాపు అప్పారావు సతీమణి తన భర్తతో పాటు ఖద్దరు ధారణకు పూనుకున్నది. వారిది విజయవాడ వద్ద ఉన్న పటమట గ్రామం. అస్పృశ్యతపైన, ఖద్దరుపైన ఆమె ఉపన్యసించేది. బెల్గాం కాంగ్రెసు మహాసభకు(1924) ఆమె హాజరయింది. దుర్గాబాయమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ (గుంటూరు) ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, రాయసం రత్నమ్మ, కనుపర్తి వరలక్ష్మమ్మ కాంగ్రెసు సమావేశాలకు వచ్చే వారని ఆమె వ్రాసింది. దుర్గాబాయమ్మ (తరువాత దుర్గాబాయి దేశముఖ్), పొణకా కనకమ్మ కాకినాడ కాంగ్రెసు వలంటీరు దళానికి నాయకత్వం వహించారు. [3]

యామినీ పూర్ణతిలకం 1920 నుండి గాంధీజీ ఉద్యమంలో పని చేసింది. ఆమె అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యురాలయింది. [4]

1920 లో స్వాతంత్ర్య పోరాటంలోకి దూకిన ప్రథమ ఆంధ్రమహిళ దువ్వూరి సుబ్బమ్మ. ప్రథమంగా అరెస్టు అయినదీ ఆమే. తూర్పు గోదావరి జిల్లాలో పాలకోడేటి శ్యామలాంబ ఖద్దరు విక్రయ బాధ్యతను చేపట్టింది. మాగంటి అన్నపూర్ణ తల్లి కలిగా పిచ్చమ్మ, సత్తిరాజు మంగమ్మ (ఏలూరు) గొర్రెపాటి కుటుంబమ్మ (దివితాలూకా కృష్ణాజిల్లా) విదేశ వస్త్రాలను విక్రయించే దుకాణాలను, కల్లు సారా సర్కారు పాటలను పికెటింగు చేయుటంలో ప్రముఖపాత్ర వహించారు [5] విదేశ వస్త్ర బహిష్కరణ, సారాపాటల పికెటింగు పనిని ముఖ్యంగా స్త్రీలు చేపట్టారు. విదేశ వస్త్రాలను గుట్టలు పోసి తగులబెట్టేవారు. విదేశ వస్త్రాలను విక్రయించే దుకాణదారులకు రక్షణ కల్పిస్తామని బ్రిటిషు ప్రభుత్వం ప్రకటిం

చింది. కాని ఆ వక్తృకులు ప్రభుత్వ రక్షణను కోరలేదు; ప్రభుత్వ సహాయాన్ని అర్థించలేదు. దువ్వూరి సుబ్బమ్మ అరెస్టు స్త్రీలలో దేశభక్తిని ప్రేరేపించింది. ఆమె ఉపన్యాసాలు శక్తివంతమైనవి. ఖద్దరు ధారణ గురించి ప్రచారం చేయడంలో ఆమెకు అలుపులేదు విశ్రాంతిలేదు. ఆమెకు 'దేశబాంధవి' బిరుదు ఇచ్చారు ప్రజలు. సుప్రసిద్ధ నవల 'మాలపల్లె' రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ పలనాడు పుల్లరి సత్యాగ్రహంనడిపాడు. గుంటూరుజిల్లా పలనాడు తాలూకా అడవులలో పశువులను మేపుకునేందుకు పుల్లరి పన్ను చెల్లించమని ప్రజలు సత్యాగ్రహం చేశారు. వారు అరెస్టు కాగానే వారి సతీమణి ఉన్నవ లక్ష్మీబాయమ్మ నాయకత్వం స్వీకరించింది.6

సత్యాగ్రహం 1922 లో గాంధీజీ నిలిపివేశాడు. దాంతో 1921 నుండి 24 వరకు పోరాటంలో స్తబ్దత ఆవరించింది. దువ్వూరి సుబ్బమ్మ ఖద్దరు కొరకు నిరంతరాందోళన సాగించింది. స్త్రీలను ఖద్దరు వస్త్రధారణ చెపట్టమని 1926 లో నెల్లూరుజిల్లా మహిళాసభ విజ్ఞప్తి చేసింది. 7 తే 27-11-25న మచిలీపట్నం (ఆనాడు బందరు) లో జరిగిన మహా సభలో ఆహ్వాన సంఘాధ్యక్షురాలు, మహాసభ అధ్యక్షురాలు ఇద్దరూ జాతీయ విద్యాలయాలకు బలాన్ని చేకూర్చమని, సహాయం చేయమని విజ్ఞప్తి చేశారు. 8

1928 లో నీల్ సత్యాగ్రహం మదరాసులో జరిగింది. 1857 లో జరిగిన బ్రహ్మాండమైన తిరుగుబాటును క్రూరంగా అణచివేసినవాడు జనరల్ నీల్. అతని విగ్రహం మదరాసులో నెలకొల్పింది బ్రిటిషు ప్రభుత్వం. దానిని తొలగించడానికి సత్యాగ్రహం జరిగింది. దాంట్లో మొదటి జట్టు సత్యాగ్రహులలో పాల్గొన్న గౌరవము దువ్వూరి సుబ్బమ్మ, బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మలకు దక్కింది.

## శాసనోల్లంఘనోద్యమం

1929 ఏప్రిల్ మే నెలలలో గాంధీజీ ఆంధ్రప్రాంతం పర్యటించారు. ఆ పర్యటనలు ఆంధ్రస్త్రీలలో జాగృతి కలిగించాయి. వారు యుద్ధరంగంలో దుమికారు; మహత్తర త్యాగాలు చేశారు.

మొదట్లో ఉప్పు సత్యాగ్రహానికి స్త్రీలను దూరంగా ఉంచుదామను కున్నాడు గాంధీజీ. 'ఉమెన్స్ ఇండియా అసోసియేషను' కు చెందిన శ్రీమతి మార్గరెట్ కజిన్స్ తీవ్రంగా అభ్యంతరం తెలిపింది. 10 గాంధీజీ తలి ఒగ్గక తప్పలేదు. ఉప్పు సత్యాగ్రహంలో స్త్రీలను పాల్గొననిచ్చాడు గాంధీజీ.

రుక్మిణీలక్ష్మీపతి ఈ సందర్భంగా అరెస్టు అయిన తెలుగు స్త్రీలలో ప్రథమురాలు. ఆమెను వేదారణ్యంలో బందీగా తీసుకున్నారు. నౌపడాలో వేదాంతం కమలాదేవి శాసనోల్లంఘనం చేశారు. ఉప్పు తయారు చేయు డానికి సముద్రతీరానికి ఉన్నవ లక్ష్మీబాయమ్మ వెళుతుంటే ఆమెను మార్గమధ్యంలో అరెస్టుచేశారు. దుర్గాబాయి, వరహాలమ్మ మదరాసులో ఊరేగింపుకు అగ్రభాగాన నిలిచారు. ఆ ఊరేగింపుపై పోలీసులు అమానుషంగా లాఠీచార్జీ చేశారు. ఎప్పటిలాగానే దువ్వూరి సుబ్బమ్మ పోరాటంలో ముందు నిలిచింది; పెద్దాడ కామేశ్వరమ్మ (తూర్పుగోదావరి) జైలు పాలయ్యింది. దిగుమర్తి జానకీ బాయికి (విశాఖపట్నం) ఆరుమాసాల శిక్ష పడింది. పాలకోడేటి శ్యామలాంబకు ఏడు మాసాల శిక్ష వేసింది ప్రభుత్వం. ఆమె కుటుంబంలో అందరూ అరెస్టు అయినారు. అలాంటి వ్యక్తే (ఈనాటి వినయాశ్రమం) తుమ్మల దుర్గాంబ. కలగర పిచ్చమ్మ; కొమ్మూరు వెంకటమ్మలు సారాదుకాణాలను పికెటింగు చేశారు. ప్రభుత్వం వారిని బందీలుగా తీసుకుంది. పెద్దింటి సుందరమ్మను (విజయవాడ) ప్రభుత్వం అరెస్టు చేసింది.

తే 23-7-30 నాటికి ముప్పైమంది ఆంధ్ర మహిళలు అరెస్టు అయినారు. శిక్షకు పాత్రులయినారు. అందులో ఆరుగురికి సంవత్సరం జైలుశిక్ష. ఇరువది నాలుగుమందికి ఆరునెలలలోపు శిక్ష. తే 20-8-1930 న కొండా సత్యవతమ్మకు ఆరునెలల కారాగారవాసం విధించింది ప్రభుత్వం. అలాగే తే 4-9-30 న పిఠాపాటి త్రిపురాంబకూ శిక్ష వేశారు. 11

ఉప్పుసత్యాగ్రహోద్యమంలో అరెస్టు అయిన స్త్రీలసంఖ్య పురుషులతో పోలిస్తే, చాల తక్కువ అయినప్పటికి స్త్రీలు ఆ ఉద్యమంలో పెద్దసంఖ్యలో పాల్గొన్నారు. వారు ఊరేగింపులు లేవదీశారు; ధర్నాలు జరిపారు. సత్యాగ్రహులకు ఆశ్రయం యిచ్చారు. సత్యాగ్రహికి ఆశ్రయం ఇచ్చినందుకు దువ్వూరి సుబ్బమ్మను ప్రభుత్వం బందీగా తీసుకున్నది. 1930 సంవత్సరపు జాతీయ ఉద్యమం బ్రిటిషు ప్రభుత్వం నైతిక ధృతిని చెడగొట్టింది.

## తే 4-1-32 నుండి ప్రారంభమయిన శాసనోల్లంఘనం రెండవ దశ

తే 5-3-1931 దిన గాంధీ ఇర్విన్ సంధి వచ్చింది. సత్యాగ్రహాన్ని ఆపివేశారు. ద్వితీయ 'రౌండుటేబులు' కాన్ఫరెన్సులో (తే 28-12-1931 దిన లండన్‌లో జరిగిన భారతీయ నాయకుల సమావేశం) పాల్గొన్న గాంధీజీ తిరిగి వచ్చిన తరువాత కాంగ్రెసు వర్కింగు కమిటీ శాసనోల్లంఘనాన్ని తిరిగి ప్రారంభించ నిర్ణయించింది. అది తే 4-1-1932 న మొదలిడవలసి వుంది. ప్రభుత్వం అనేక నగరాలలో, పట్టణాలలో నిషేధాజ్ఞలను జారీచేసింది. పెక్కుమంది నాయకులపై ఆంక్షలు విధించింది ప్రభుత్వం. ఊరేగింపులలో, బహిరంగ సభలలోపాల్గొనవద్దని మల్వారిచుక్కమ్మపై నిషేధాజ్ఞను జారీచేశారు సర్కారువారు. అనేక శిక్షా నిబంధనల క్రింద అరెస్టులు విరివిగా సాగాయి. స్త్రీలను అరెస్టుచేసి దూరప్రాంతాలకు తీసుకొని వెళ్ళి వదలివేశారు పోలీసులు. స్త్రీలను అవమానించారు. ఇబ్బందులపాలుచేశారు. మామూలుగా ఖైదీలకిచ్చే సౌకర్యాలను వారికి ఇవ్వలేదు. అయినా స్త్రీలు మొక్కవోనిధైర్యంతో పోరాటంలో పాల్గొన్నారు. పూర్తిగా ఒక సంవత్సరం పోరాటం సాగింది. దేశసేవకు అంకితమైన మార్గంనుండి స్త్రీలు వైదొలగలేదు.

కొన్ని సంఘటనలు ఉదాహరణలు ప్రస్తావించటం అనుచితం కాదు. మంచి ప్రవర్తన కలిగి ఉంటామని హామీ ఇవ్వనందుకు మగ్గురి స్త్రీలను జామీను కేసులో అరెస్టుచేసింది ప్రభుత్వం. తే 7-1-1932 న వాలాజా

పేటలో జగదాంబను అరెస్టు చేసింది. భీమవరంలో కోటమర్తి కనకమ్మకు ఏడాది శిక్షపడింది. తే 9-1-32 ఆచంట రుక్మిణమ్మను నిర్బంధంలోకి తీసుకొని మద్రాసులో వదలివేయుటం జరిగింది. జనవరి 11 న ముగ్గురు స్త్రీలకు 6 నెలల శిక్షవేశారు అధికారులు. 12 జనవరిన మరో ముగ్గురి స్త్రీలకు 8 నెలల కారాగార శిక్ష పడ్డది. ఆ నెల 13 న విజయనగరంలో మూల వెంకమాంబ, జేకుమళ్ళ సీతారామమ్మలు బందీలయినారు. రేపల్లె వద్దనున్న మైనేనివారిపాలెంలో 15 వ తేదీన ముగ్గురి స్త్రీలను అదుపులోకి తీసుకున్నారు పోలీసులు. 18 వ తేదీన బరంపురంలో ఇద్దరు స్త్రీలకు ఆరునెలలు శిక్ష చేసింది ప్రభుత్వం. అదే రోజున కాకినాడలో ఇద్దరు స్త్రీలు కాకినాడలో ప్రభుత్వ నిర్బంధ విధానానికి బలి అయ్యారు. 19 వ తేదీన దుర్గాబాయితో సహా ఇద్దరు స్త్రీలు ప్రభుత్వ చర్యకు గురి అయినారు; అదేరోజున తణుకులో కొవ్వలి కనకమ్మకు ఆరు నెలల శిక్ష పడింది. అలాగే కొమర హాలులో ఆరుగురు స్త్రీలు బందీలుగాకొనిపోబడ్డారు. జనవరి 21 వ తేదీన మంతెనవారిపాలేనికి చెందిన నలుగురు స్త్రీలకు, గోవాడకు చెందిన నల్గురిస్త్రీలకు తలో ఆరునెలల శిక్షపడింది. తే 22-1-32న సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మతో సహా ముగ్గురి స్త్రీలు అరెస్టు అయినారు. జనవరి 24 న కోవేరు అనసూర్యావతికి ఆరు నెలల శిక్ష. అదేనెల 25 న పెదపులివర్రు స్త్రీలు ఇద్దరికి చెరి ఆరు నెలల కారాగారవాసశిక్ష విధించారు. 27 న రాజమండ్రిలో ముగ్గురు స్త్రీలను అదుపులోకి తీసుకొన్నారు. మరో ముగ్గురికి శిక్షలు వేశారు. తే 28-1-32న గుంటూరుజిల్లా చేబ్రోలువాసియైన స్త్రీకి ఒక సంవత్సరం కఠిన కారాగారశిక్ష వేసింది ప్రభుత్వం. ప్రముఖ నాయకుడు ఎన్. జి. రంగా సతీమణి భారతీదేవి రంగాకు ఏడాది జైలుశిక్ష వేశారు 31 జనవరిన. అరెస్టులు విరివిగా జరిగాయి ఫిబ్రవరి 1 వ తేదీన గుంటూరుజిల్లా చేబ్రోలు గ్రామవాసి, తెనాలి తాలూకా అమృతలూరు గ్రామవాసి ఇద్దరు మహిళలను నిర్బంధించారు. ఫిబవరి 3 నుండి మార్చి 24 వరకు అరెస్టుల వివరాలు ఇలా ఉన్నాయి:- గుంటూరు 4, బాపట్ల 4, ఏలూరు 3, మంగళగిరి 3, కృష్ణాజిల్లాలోని అగ్రహారం 8,

నెల్లూరు 3, విశాఖపట్టణం 1, తాడేపల్లిగూడెం 2, కైకలూరు(కృష్ణాజిల్లా)2, మదరాసు 1, 3 ఏళ్ళ పిల్లతో సహా రేపల్లె 7, బెజవాడ 3, గుడివాడ 3, అంగలూరు (కృష్ణాజిల్లా) 5, జైళ్ళలో నలుగురు స్త్రీలు ప్రసవించారు. 12

మొదట్లో నెలలతో మొదలైన శిక్షలు సంవత్సరాలకు పెరిగాయి. ప్రారంభంలో విడిఖైదు వేసేవారు. అది కఠిన నరకానికి పెరిగింది. సత్యాగ్రహులను ఎదిరించడానికి ఇలా మారింది ప్రభుత్వ విధానం. అయినా ధృతిపోగొట్టుకొనక ఉద్యమంలోనికి దూకారు మహిళలు. తే 1-4-1932 న పెరంబుదిరి సుభద్రమ్మకు ఒక సంవత్సరం జైలు శిక్ష వేశారు. తే 14-4-32 న మంత్రాల రామ సీతమ్మకు 6 నెలల జైలు శిక్ష పడింది. 28 ఏప్రిల్ న త్రిపురనేని కౌసల్యకు ఒక సంవత్సరం కారాగార వాసం విధించారు. 26 మే న పొణకా కనకమ్మకు 6 నెలలు, జూనులో గుడివాడ స్త్రీలు 7 గురికి తలా 12 నెలలు, వేదాంతం కమలాదేవి, కొండా సత్యవతమ్మలకు చెరి 6 నెలల విడిఖైదు, 11 మందికి చెరి 10 నెలలు, జూలై 3 న తెనాలి స్త్రీలు ముగ్గురికి 6 నెలలు శిక్షలు పడినాయి.

ఏప్రిల్ 8 న రేపల్లె స్త్రీలు 8 మంది కరపత్రాలు పంచితే నిర్బంధం లోకి తీసుకోబడినారు. అలాగే మే 5 న ఇద్దరు స్త్రీలను అరెస్టు చేశారు. 5 గురు స్త్రీలు మదరాసులో ప్రభాత ఫేరీ లేవదీస్తే ప్రభుత్వ చర్యకు గురి అయినారు. ఊరేగింపులో పోతున్న స్త్రీలను 22 ఏప్రిల్‌లో బెజవాడలోను ఏలూరులోను అదుపులోనికి తీసుకున్నారు అధికారులు. 13

1932 మే, జూన్, జూలై, ఆగస్టు నెలలలో గుడివాడ, తెనాలి, ఏలూరు, గుంటకల్ పట్టణాలలో, విశాఖపట్నం జిల్లాలోని గ్రామాలలో ప్రభుత్వం విపరీతంగా అరెస్టులు సాగించింది. తే 30-10-32 న ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ అరెస్టు చేయబడింది. చివరకు తే 16-1-33 న కూడా ఒక స్త్రీకి 3 నెలల కారాగారవాస శిక్ష, అదనంగా జరిమానా వేశారు. 14

స్త్రీ వలంటీర్లను పోలీసులు దూషించారు. బండబూతులు తిట్టారు. అవమానించారు. ఖద్దరు ధారణే నేరమయింది. మచిలీపట్నంనుండి చల్లపల్లికి బస్సులో వెళ్ళుతున్న ఖద్దరు వస్త్రధారిణిని బస్సులోనుండి దింపివేశారు పోలీసులు.[15] కాకినాడకు చెందిన టి. అండాళమ్మపై జరిమానా విధించిన ప్రభుత్వం ఆమె దూరపు బంధువు ఆస్తిని జప్తుచేసింది.[16] సత్యాగ్రహంచేసే స్త్రీలలో వారి బందుగులలో భయోత్పాతం కలుగజేసే నిమిత్తం వారికి చీకాకు కలిగించటం కర్తవ్యంగా పెట్టుకుంది ప్రభుత్వం. స్వచ్ఛంద సేవికలపై రంగునీటిని మురికి నీటిని చల్లారు పోలీసులు. ఈ సంఘటనలు వాస్తవమైనట్లుగా ప్రభుత్వం అంగీకరించింది.[17]

జైలులో స్త్రీ రాజకీయ ఖైదీలను అనేక ఇబ్బందులకు గురిచేసింది ప్రభుత్వం. వారి భర్తలకు ఒక 'క్లాసు' వారికి మరో క్లాసు ఇవ్వడం జరిగింది. తల్లులను పిల్లలను వేరుచేశారు[18]

జైళ్ళలో 'సి' క్లాసు ఖైదీల పరిస్థితి ఘోరంగా ఉంది. వారి మతాచార ప్రకారం వివాహిత హిందూస్త్రీలు నొసట కుంకుమబొట్టు ధరించ వలసి యుండగా వారిని బొట్టు పెట్టుకోనీయలేదు. వారి సుమంగళీత్వానికి చిహ్నమైన గాజులను పగులగొట్టారు జైలు అధికారులు.[19]

దుర్గాబాయమ్మను విడిగా ఒక కొట్టులో నిర్బంధించారు జైలులో.[20]

దుర్గాబాయి ఉప్పు సత్యాగ్రహం, జాతీయోద్యమాలలో అరెస్టయి మూడు సం॥రాలు జైలుశిక్ష అనుభవించినప్పుడు ఈమెను 'విప్లవకారిణిగా' భావించి మూడవసారి మధుర జైల్లో బంధించినప్పుడు ఆమె ఆహారంలో విషాన్నికూడా కలపేవారని ప్రతీతి ఒళ్ళంతా సన్నని కురుపులు లేచి చీము, నెత్తురు కారేవట. కారం దంపించినప్పుడు ఆ మంటలకు నరక యాతన పడేదట.[21]

స్త్రీలు మహాసభలు నిర్వహించారు. జూను 5న భీమవరంలో జరిగిన సభ, కంభంపాటి మాణిక్యమ్మ అధ్యక్షతన కూచిపూడిలోని మహాసభ చరిత్రాత్మకమైనవి.[22]

అనేక కుటుంబాలలో వయోజనులు జైలుకు వెళ్ళడం గమనార్హం.

దోసంరాజు లక్ష్మీబాయమ్మ నిషేధింపబడిన సారస్వతాన్ని పంచింది. '[illegible]' అనే పేరుగల రహస్య పత్రిక వెలువడడానికి ఆమె ఎంతో సహాయం చేసింది. ఆమె వార్తాహరిగా కూడా పనిచేసింది. ఆమె నాయకత్వాన అనేకమంది బాలికలు, యువతులు నిషిద్ధ సారస్వతాన్ని పంపిణీ చేసేవారు.[23]

విదేశ వస్త్ర బహిష్కరణ సమర్థవంతంగా జరిగింది. దుర్గాబాయి ఆమె తల్లి కృష్ణవేణమ్మ, యామినీ పూర్ణ తిలకం, ఉన్నవ లక్ష్మీబాయి దువ్వూరి సుబ్బమ్మ, వేదాంతం కమలాదేవి, ఆచంట రుక్మిణీ లక్ష్మీదేవి, మంత్రిప్రగడ బంగారమ్మ, దిగుమర్తి జానకీబాయి, ఈ ప్రయత్నంలో విశేషంగా కృషి చేశారు.[24]

## 1940-41 వ్యక్తిగత సత్యాగ్రహం

కొంతమంది ప్రజాస్వామ్య వాదుల దృష్టిలో గాంధీజీ ద్వితీయ ప్రపంచ సంగ్రామ స్వభావాన్ని సరిగా అవగాహన చేసుకోలేదు. గాంధీజీ వైఖరి ఆయన జాతీయతావాద భావన వల్లనూ, సిద్ధాంతం వల్లను ప్రభావిత మయింది. ఫాసిజాన్ని ఆయన అవగతం చేసుకోలేకపోయాడు. ఫాసిజం కన్న సామ్రాజ్యవాదం తక్కువ స్థాయిలో ఉన్న చెడుగు అని ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో సామ్రాజ్యవాదం నశించే అవకాశమున్నదని ఆయన గ్రహించలేకపోయాడు. ఏమైనాసరే, తన దేశానికి స్వరాజ్యం కావాలనే, నికార్సు జాతీయవాదిగా ఆయన ఆకాంక్షించాడు. అందువలన యుద్ధ వ్యతిరేక దృక్పథాన్ని చేపట్టాడు. 1940లో యుద్ధయత్నాలకు వ్యతిరేకంగా వ్యక్తిగత సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించాడు. సత్యాగ్రహుల జాబితాను తనే ఖరారు చేశాడు. కొద్ది మంది ఎంపిక చేయబడినవారినే సత్యాగ్రహం చేయనిచ్చాడు. వారు యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారముచేయాలి. వారు యుద్ధవ్యతిరేక నినాదాలిచ్చేవారు. సైన్యంలోచేరవద్దనీ, యుద్ధనిధికి చందాలివ్వవద్దని, యుద్ధ

యత్నాలకు సహాయము చేయవద్దని వారు ప్రబోధం చేసేవారు. వ్యక్తి సత్యాగ్రహంలో తగినంత సంఖ్యలో స్త్రీలు పాల్గొన్నారు. ఆదుర్తి లక్ష్మీబాయి రెండుసార్లు సత్యాగ్రహం చేసి సుమారు ఒక సంవత్సరం జైలులో వుంది. ఉన్నవ లక్ష్మీబాయమ్మ (గుంటూరు) 1940 లో అరెస్టు కాబడింది. 1941 లో ఎలవర్తి శుభారత్తమ్మ నంద్యాలలో సత్యాగ్రహం చేస్తే జైలుకు తీసుకొని వెళ్ళారు. 25

జాతులక్ష్మీదేవికూడా నంద్యాలలోనే నిర్బంధ చర్యకు గురి అయింది. దిమ్మెల గ్రామస్తురాలు శిష్టాసోదెమ్మ, పాలకోడేటి శ్యామలాంబ, కోటమర్తి కనకమ్మ, వేగేశిన సుభద్రమ్మ, గోకరాజు వెంకాయమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, చుండూరి రత్తమ్మ, కొటికలపూడి సరస్వతమ్మ, ముాల్పూరి చుక్కమ్మ, గంధం అమ్మన్నరాజా, గొర్రెపాటి సరస్వతమ్మ, ఈడుపుగంటి వెంకటరత్నమాంబ, మరికా అనేకమంది స్త్రీలు ఉద్యమంలో పాలు పంచుకున్నారు. కాకపోతే వారి జైలు శిక్షలు వేరువేరుగా ఉన్నాయి. 26

విదేశీ స్త్రీ ఉప్పల షోలింగర్ (ఉప్పల లక్ష్మణరావు భార్య) 1941లో 1942 లో రెండు పర్యాయాలు అరెస్టు అయి జైలులో ఒకటిన్నర సంవత్సరాలు గడిపింది. 27 కోయ వెంకటనరసమ్మ, మద్దాలి వెంకట సుబ్బమ్మ, ఎర్నేని రాధ, ఎర్నేని లీలావతి, ఎర్నేని అమృతం జైలులో ఉన్నారు ఈ సందర్భంగా. 28

## 1942 ఆగస్టు క్విట్ ఇండియా ఉద్యమం; దాని తదుపరి

ఫాసిస్టు జపాను సైన్యాలు అస్సాము సరిహద్దుల దాకా వచ్చినపుడు స్వాతంత్ర్యం కోసం పోరాటం జరపటానికిది తగిన సమయమని గాంధీజీ తలపోశాడు. "కార్యదీక్షను పూను లేక చనిపో" అనే వైఖరిని స్వీకరించమని ఆయన భారత ప్రజలకు విజ్ఞప్తి చేశాడు. తన ఉద్యమ ఫలితంగా అరాజకత్వమూ, సర్వనాశనమూ వచ్చినా ఆయన జంక నన్నాడు. బ్రిటిషువారు దేశాన్ని వదలిపెట్టి వెళ్ళేలా వారిపై వత్తిడి తేవాలని ప్రజలను

కోరాడు. ఆనాటి ఐక్య కమ్యూనిస్టు పార్టీ ఎం. ఎన్. రాయ్ నాయకత్వాన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ యుద్ధానుకూలవైఖరి అవలంబించినందువల్ల గాంధీజీ పిలుపును వ్యతిరేకించాయి యుద్ధాన్ని 1941 డిశంబరు నుండి కమ్యూనిస్టులు ప్రజాయుద్ధమని పిలువసాగారు. 1941 జూను నుండి ప్రజా యుద్ధమని 1941 డిశంబరులో చెప్పారు. హిట్లరుకు వ్యతిరేకంగా బ్రిటిషు ప్రజలు పోరాడ నిశ్చయించిన సమయంనుండి అంటే 1940 జూన్ నుండి యుద్ధయుత్నాలను బలపరిచారు రాడికల్ డెమొక్రాట్లు. గాంధీజీ అహింసాయుత ప్రజా పోరాటాన్ని ఆశించాడు. పూర్తి ప్రతిష్టంభన, సమ్మెలు వగైరా అహింసాయుత సాధనాలద్వారా అహింసా సిద్ధాంతం అనుమతించిన మేరకు ప్రతివ్యక్తీ తన ఇష్టము వచ్చినట్లు పోరాడాలని ఆయన అభిప్రాయం వెలిబుచ్చాడు. ఆ ఉద్వేగపూరిత వాతావరణంలో అహింసాయుత పోరాటం అసాధ్యమని ఆయన గ్రహించలేక పోయాడు. (బహుశః గ్రహించదలచుకో లేదేమో!) కాంగ్రెసు నాయకులందరినీ ప్రభుత్వం తే 8-8-1942 దిన అరెస్టు చేసింది. కొలది రోజులు అరాజకం సాగింది. అది పూర్తిగా జాతీయవాద పోరాటం. అందువలన జాతీయ భావాలు కల స్త్రీలు ఆ ఉద్యమంలో భాగం పంచుకునే విషయంలో వెనుకంజ వేయలేదు. అనేకమంది స్త్రీలు ఉద్యమంలో పనిచేశారు; అరెస్టయి జైళ్ళపాలయ్యారు.

1942 పోరాటంలో రేపల్లె, తెనాలి, చేబ్రోలు, గుడివాడ, గన్నవరం లకు చెందిన స్త్రీలు పెద్ద సంఖ్యలో భాగస్వామ్యంవహించారు. 29 గాంధీజీ ఉద్యమాలలో కష్టనష్టాలకోర్చిన స్త్రీల జాబితా ఇందులో పొందుపరచడ మైనది. 30 పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల స్త్రీలు గాంధీజీ ఉద్యమాలలో అపమానమైన పాత్ర నిర్వహించారు. 31

మహాత్మాగాంధి తెలుగు స్త్రీలపై పెట్టుకున్న ఆశలు అడియాసలు కాలేదు. వారు మహాత్మాగాంధీని బలపరచి ఖ్యాతి సంపాదించుకున్నారు

# రెండవ భాగం మూడవ అధ్యాయం రిఫరెన్సులు

1. 'నా స్వీయచరిత్ర' అయ్యదేవర కాళేశ్వరరావు(1959) పుట 211
2. 'మాగంటి అన్నపూర్ణ' అట్లూరి వెంకట సీత (1929)
3. 'బసవరాజుగారు నేను' బసవరాజు రాజ్యలక్ష్మమ్మ పుట 9
4. 1947 గృహలక్ష్మి పుట 423 : యామినీ పూర్ణతిలకం పై వ్యాసం
5. డా॥ఎస్. పుతలీ కృష్ణమూర్తి : 'ఆంధ్రలో స్త్రీల పరిస్థితి' (ఆంగ్లంలో Changing Coditions of women in Andhra) పుటలు 164, 165
6. ,, ,, పుట 172 లో పేర్కొనబడిన హిందూ తే 23-6-1926
7. ,, ,, 172 పుటలో పేర్కొనబడిన హిందూ తే 17-11-25
8. ,, ,, 173 పుటలో పేర్కొనబడిన హిందూ తే 12-11-1928
9. ,, ,, 179 పుటలో పేర్కొనబడిన
10. నేటి భారత మహిళాలోకం (Indian women have Today) by మార్గరెటు కజిన్సు పుట 37
11. 1930 గృహలక్ష్మి
12. 1932 గృహలక్ష్మి పుట 281
13. 1931 గృహలక్ష్మి పుట 475
14. గృహలక్ష్మి 1932-33

# అనుబంధం "ఏ"

## 1941, 1942 ఉద్యమాలలో పాల్గొన్న స్త్రీల పట్టిక

1. మద్దాలి రాజేశ్వరి, 2. కానూరి రాఘవమ్మ, 3. గోనుగుంట్ల లక్ష్మీ నరసమ్మ, 4 కొల్లిపర లక్ష్మీ శాంతమ్మ, 5 రేచర్ల సామ్రాజ్యం, 6. గోపరాజు మనోరమ, 7. గోపరాజు సరస్వతమ్మ, 8. మరుపిళ్ళ భ్రమరాంబ, 9. సీతారామరాజు సీతారామమ్మ, 10 అన్నదేవర బాలాత్రిపురసుందరమ్మ 11. సూర్యదేవర రాజ్యలక్ష్మి, 12. వాశిరెడ్డి అఖిలాండేశ్వరి, 13. వాశిరెడ్డి రాజ్యలక్ష్మి, 14. దేవభక్తుని తులసీదేవి, 15. సూర్యదేవర హైమావతి, 16. గోళ్ళమూడి రత్నమ్మ, 17. వాశిరెడ్డి హనుమాయమ్మ, 18. దేవభక్తుని సీతారామమ్మ, 19 వాసిరెడ్డి నాగమ్మ, 20. రేవెళ్ళ వెంకాయమ్మ, 21. చుక్కపల్లి మాణిక్యమ్మ, 22. మునునూరి కస్తూరి, 23 పండితారాధ్యుల సత్యవతమ్మ, 24 నాగళ్ళ కృష్ణమ్మ, 25. మాడుగుల కౌసల్య, 26. గణగత్తి రాజు మహాలక్ష్మమ్మ, 27. అన్నె కళ్యాణి, 28. చిత్తూరి అన్నపూర్ణ, 29. కొడాలి కమల, 30. పెనుమానూరి శేషమ్మ, 31. కల్లూరి తులిశమ్మ, 32. ఉప్పల అన్నపూర్ణ, 33. ఎ. ఉష, 34. కాజ సౌభాగ్యమ్మ, 35. రాయవరపు రాఘవమ్మ, 36. శాంతకుమారి, 37 పత్తిపాటి సీతమ్మ, 38. సిద్దాబత్తుని లక్ష్మీకాంతమ్మ, 39. తుమ్మల దుర్గాంబ, 40. సుఖవాసి భ్రమరాంబ, 41. తుమ్మల సీతారామమ్మ, 42. గడ్డిపాటి రాఘవమ్మ, 43. వావిలాల మాణిక్యాంబ, 44. బెజవాడ లక్ష్మీకాంతమ్మ, 45. చీగిరెడ్డి లీలాదేవి, 46. ఎస్. అనవర్తిదేవి, 47. తంబళ్ళపల్లి నల్లపరెడ్డి అనసూయ 48. తంబళ్ళపల్లి నల్లపరెడ్డి శకుంతల.

15. డా॥ఎన్. పుతలీ కృష్ణమూర్తి 'ఆంధ్రలో స్త్రీలపరిస్థితి' పుట 188 లో పేర్కొనబడిన హిందూ తే 12-2-32

16. ,, ,, ,, 189 లో ,, ,, 23-11-32

17. డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి "ఆంధ్రలో
స్త్రీల పరిస్థితి" 190 లో పేర్కొనబడిన
లెజిస్లేటివు కౌన్సిల్ ప్రశ్న నెం. 160

18. ,, ,, ,, 190 లో పేర్కొనబడిన ప్రశ్న
నెం. 971 G. O. 1562 తే 16-4-32

19. ,, ,, ,, 190 లో పేర్కొనబడిన
G. O. 1552 లాజనరల్ తే 16-4-32

20. దుర్గాబాయి దేశముఖ్ : నీతి సీతాదేవి పుట 116

21. "మారుతున్న సమాజం మహిళలు" : మల్లాది సుబ్బమ్మ పుట 36

22. గృహలక్ష్మి 1932-33

23. డా॥ ఎన్. పుతలీకృష్ణమూర్తి : ఆంధ్రలో స్త్రీల పరిస్థితి పుటలు 191, 192

24. ,, ,, ,, 193

25. గృహలక్ష్మి (1947) పుట 484

26 "ఆంధ్ర వీరాంగనలు" : మాగంటి బాపినీడు (1944) పుట 56

27. ,, ,, ,, పుట 97

28. ,, ,, ,, పుటలు 95, 97, 99

29. ,, ,, ,, పుట 63

30. ,, ,, ,, పుటలు 110-112, 156

31 డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి "ఆంధ్రలో స్త్రీలపరిస్థితి" పుట 198

# 4 వ అధ్యాయం : సామాజిక సంస్కరణ

ఈ కాలంలో భోగపుకులం సందర్భంగా చాల సంస్కరణ వచ్చింది. 'కళావంతులు' అనే పేరుగల ప్రత్యేక కులం ఆంధ్రలో వ్యభిచార వృత్తిని అవలంబించేవారు. స్త్రీలు సంప్రదాయ వృత్తిని అనుసరించేవారు. పురుషులు సహాయకులుగా, తోడ్పడుతుండేవారు. వారి తల్లులు, అక్క చెల్లెండ్రు దేవుని ముందుగాని, 'భోగము మేళాలు' అని పిలువబడే నాట్యాలలోగాని పాల్గొంటున్నపుడు పురుషులు మృదంగం, హార్మోనియం, తంబుర మొదలైన వాయిద్యాల సంగీతాన్ని సమకూర్చేవారు. ఈ అసహ్య కరమైన ఆచారం కొనసాగడం దుర్భరంగా ఉండేది. ఆ కులాన్ని సముచితరీతి ఉద్ధరించే ప్రయత్నాలు సాగాయి.

యామినీ పూర్ణతిలకం జాతీయోద్యమాలలో పాల్గొన్నది. కళావంతుల కులానికి చెందిన స్త్రీలకు వివాహమాడే హక్కు కావాలని ఆమె వాదించింది. ఆమె ప్రతిభకల వక్త. తన ఉపన్యాసాలద్వారా అనేకమందిని ఉత్తేజిత లూగించేది. వారి హృదయాలపై చెరగని ముద్ర వేసేది. వ్యభిచార వృత్తిని విడనాడి జీవితంలో నీతిగా స్థిరపడదలచుకున్న స్త్రీల కొరకు మద్రాసులో ఆమె శరణాలయాన్ని స్థాపించింది. ఒక పత్రికను ప్రారంభించింది. దర్శి చెంచయ్య ప్రభృతులు ఆమెకెంతో సాయపడినారు. కళావంతుల కులానికి చెందిన ప్యారెరావు, పి. జె. వెంకయ్య, భాస్కరాల ఈశ్వరుడు వారితో ప్రముఖులు. వారి ప్రయత్నాల ఫలితంగా ఆ నీచ వృత్తిని చాలమంది స్త్రీలు విడనాడారు; అనేకమంది ఆ వృత్తిలో చేరం అని ప్రమాణాలు చేశారు. ఆంధ్రరాష్ట్ర కళావంతుల సంఘ ప్రథమ మహా సభ 1924 లో గుంటూరులో జరిగింది.[1] అలాంటి మహాసభలు ప్రతి సంవత్సరమూ జరిగేవి. 1934 లో గుడివాడలో జరిగిన 11 వ మహాసభ

భోగము మేళాలను బహిష్కరించాలనే తీర్మానాన్ని ఆమోదించింది. వృత్తిని స్వీకరించదలచని యువతులకు వరులను అన్వేషించే నిమిత్తం 1925 లో 'వివాహ సంఘము' (Marriage Board) ఏర్పడింది.[2] వ్యభిచార వృత్తికి వ్యతిరేకంగా ప్రచారం చేసే నిమిత్తం 1926 లో 'కళావంతుల సామాజిక సంస్కరణ ప్రచార కమిటీ' పుట్టింది.[3] ఈ కమిటీ తరఫున అనేక బహిరంగ సభలు జరిగాయి. ఇది మహోన్నతమయిన స్వప్రయత్నం. కళావంతుల కులంలో జాగృతి, చైతన్యమూ కలుగజేయుటానికి ఇది ఎంతగానో తోడ్పడింది. ఆ కాలంలోని స్త్రీ జనాభ్యుదయానికై ఆంధ్రలో ఎంతో కృషి జరిగింది. బాలికలు ఎంతో శ్రద్ధాసక్తులతో విద్యాసముపార్జన చేయపూనారు. స్త్రీలు సంఘాలు నిర్మించుకున్నారు; పత్రికలలో వ్యాసాలు రాశారు. మహాసభలు జరుపుకున్నారు; తమ భావప్రకటన చేశారు. తమ అస్తిత్వాన్ని నిలద్రొక్కుకున్నారు. సామాజిక రాజకీయ రంగాలలో వారి వాణి వినిపించేలా వ్యవహరించారు. వెంటనే వారి ప్రయత్నాలన్నీ ఫలించక పోయినా భవిష్యత్తులో వారి విజయాలకు బాట వేసుకున్నారు.

1881 లో ఆంధ్రలో మన్నవ బుచ్చయ్య పంతులు బాలికల పాఠశాల స్థాపించాడు. ఆయన శిష్యుడు వెంకటరత్నం నాయుడు 1881 లో అనేకుల సమక్షంలో రాజమండ్రిలో రెండు వితంతు వివాహాలు చేశాడు. 30 వేల విరాళమిచ్చి వితంతు శరణాలయాన్ని స్థాపించి సేవ చేశాడు.

## రెండవ భాగం నాలుగవ అధ్యాయం రిఫరెన్సులు

1. డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి 'ఆంధ్రలో స్త్రీల పరిస్థితిలో మార్పులు' పుట 210
2. ,, ,, ,, ,, 211
3. ,, ,, ,, ,, 212
4. డా॥ అల్లాడి వైదేహి – ఆంధ్రదేశము : స్త్రీలు – సామాజిక సంస్కరణ పేజి 43

# 5 వ అధ్యాయం

## హిందూ వారసత్వ శాసనాలకు సవరణ

1928 లో హిందూ వారసత్వ శాసనం (అనర్హతల తొలగింపు) అమలు లోకి వచ్చింది. తద్ఫలితంగా ఏ వ్యాధి, అంగవైకల్యం, మానసికలోపం పుట్టుకనుండి పిచ్చి, వెఱ్ఱి ఉన్నంత మాత్రాన సమష్టి హిందూ కుటుంబ ఆస్తిలో హక్కును గాని, వాటానుగాని అలాగే వారసత్వరీత్యా ఆస్తిని స్వీకరించుటకు గాని ఏ వ్యక్తి అనర్హుడు కాడు. ఈ శాసనం ఎందువల్ల అవసరమయినదంటే అంతకు క్రితం పుట్టు గుడ్డి, మూగ, నపుంసకత్వం, తీవ్రమైన కుష్టు అనర్హతలుగా ఉండేవి. 1929 వరకు అమలులో ఉన్న మితాక్షర శాస్త్రం ప్రకారము కుమారుని కూతురు, కూతురు కూతురు, సోదరి, సోదరి కుమారుడు వారసుల వరుసలో ఎక్కడో దిగువన ఉండేవారు. ఈ కాలంలో బంధుత్వాలను గురించిన భావాలు మారాయి. అందువలన వీరికి తండ్రి తండ్రితరువాత తండ్రి సోదరుని ముందు సవరణ చట్టముద్వారా స్థానం కల్పించబడింది. ఇది పెద్దమార్పు కాకపోయినా హిందూ లా భావానికి అనుగుణమైన మంచి మార్పు.

# 6 వ అధ్యాయం

## బాల్యవివాహ నిరోధ శాసనం 1929

సంఘ సంస్కరణ ఈ దశలో చాల ఎక్కువగా జరిగింది. వివాహం విషయంలో వధువు వయస్సుకు సంబంధించిన బిల్లును ఒక శాసన సభ్యుడు ప్రవేశపెట్టాడు. కేంద్ర శాసన సభ సభ్యుడైన హరవిలాస శారదా ప్రయత్నం ఫలితంగా బాల్య వివాహ నిరోధబిల్లు 1929 లో ఆమోదింపబడింది. అది 1930 లో అమలులోకి వచ్చింది. వధువుకు 14 ఏండ్లు నిండాలనే నియమము ఆ శాసనంవల్ల వచ్చింది. బిల్లుకు సనాతనులనుండి ఎంతో వ్యతిరేకత వచ్చింది. శాసనం అమలులోకి వచ్చే తేదీలోగా 5, 6 మాసాల ఆడపిల్లల నుండి ఏడు ఎనిమిది సం॥ లోపు వారికి వేల వివాహాలు చేశారంటే వ్యతిరేకత యొక్క తీవ్రతను గమనించగలం. ఇది చాల లాభకరమైన శాసనమైనా ఎన్నో సంవత్సరాలు అది అమల్లో వున్నా లేనట్లె. దానిలోని లోపాలు, దాని అసమర్ధతలు ఆశించిన ఫలితాన్ని చేకూర్చుకోడానికి ప్రతి బంధకాలయినాయి. ఈ శాసనం స్వదేశ సంస్థానాలకు వర్తించదు. కేవలం బ్రిటిషు ఇండియా వరకే పరిమితమయింది. ఫిర్యాది చేయాలంటే చాల ఇబ్బందులతోను చిక్కులతోను కూడిన విధానాన్ని (ప్రొసీజరు) అనుసరించవలసి ఉండేది. ఈ శాసనం క్రింద పోలీసులు నేరారోపణ చేయడానికి వీలులేదు. అంతేగాక శాసనానికి వ్యతిరేకంగా చేయబడిన బాల్యవివాహం చెల్లదని ప్రకటించలేదు. అందువల్ల సమాజంలో జాగృతి చైతన్యం కలవారు, పిరికివారు మాత్రమే ఈ శాసనాన్ని గౌరవించి నడుచుకునేవారు.

ఈ బిల్లు సందర్భంగా పేరు ప్రఖ్యాతులు శారదాగారికి లభించినా బిల్లుకు ముందు ప్రాతిపదిక పని అంతా మహిళోద్యమ నాయకులు చేశారు.

మద్రాసు లెజిస్లేచరులో శ్రీమతి ముత్తు లక్ష్మీరెడ్డి ఒక బిల్లును ప్రతిపాదించింది. అది వాయిదాపడింది. భారతదేశ స్త్రీలు బాల్యవివాహ నిషేధాన్ని కోరారు. ఆ దురాచార నిర్మూలనం జరగాలని ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సువారు తీర్మానాన్ని ఆమోదించారు. బాల్యవివాహాలను ఆపమని బరోడా మహారాణి విజ్ఞప్తి చేశారు. ఈ సంస్కరణ కావాలని 'ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు' (అఖిలభారత మహిళా సభ) వారి ఢిల్లీ, హైద్రా మహాసభలు డిమాండు చేశాయి. గాంధీజీ ఈ వాదనను బలపరిచారు. హైకోర్టుకి మహజరులు, విజ్ఞప్తులు అందజేయబడినాయి. వరునికి 21 సంవత్సరాలు, వధువుకు 16 ఏండ్లు నిండాలని మదరాసు లెజిస్లేటివు కవున్సిలు తీర్మానాన్ని ఆమోదించింది. వివాహవిషయంగా వయః పరిమితిని నిర్ణయించే బిల్లును ప్రజాభిప్రాయం కొరకు కేంద్రప్రభుత్వం పంపింది. అందుకై ఒక కమిటీని వేసింది. ప్రజానీకానికి ప్రయోజన కరమైన శాసనాల విషయం ప్రజలకు తెలియదని కమిటీ అభిప్రాయపడింది. అయినా బాల్యవివాహ నిషేధానికి అనుకూలంగా జాగృతి కల స్త్రీలలో బహుజనాభిప్రాయం ఉంది. ఇదంతా హరవిలాస్ శారదాగారి బిల్లుకు బలాన్ని చేకూర్చింది.

బ్రిటిషు ఇండియా పౌరులు ఎక్కడ నివసిస్తున్నా వారందరికీ ఈ శాసనం వర్తించేలా బాల్యవివాహ నిరోధ శాసనాన్ని 1938 లో సవరించారు.

# 7 వ అధ్యాయం

# హిందూస్త్రీల ఆస్తిహక్కు శాసనం 1937

## (HINDU WOMEN'S RIGHTS TO PROPERTY ACT)

సమష్టి హిందూ కుటుంబంలో సభ్యుడైన పురుషుడు చనిపోతే 1937 వరకూ అతని విధవ స్థితి చాల శోచనీయంగా ఉండేది. ఆమె కుమారులు గాని, కుమారులు లేకపోతే ఆమెభర్త వారసులు గాని ఆమెకు మనవర్తి మాత్రం ఇచ్చేవారు. ఏ స్త్రీ అయితే తన భర్త ఆస్తులను భద్రపరచడానికి, పెంచటానికి, నిలపెట్టటానికి కృషిచేసిందో ఆ స్త్రీ, ఆ విధవరాలు, తన తిండి, బట్ట, ఆశ్రియాల కోసం ఇతరులపై ఆధారపడేవి.-ఈ హృదయ విదారక స్థితిని చూచి హిందూస్త్రీలు బాధపడ్డారు; ఆగ్రహించారు. ఆ వ్యవస్థను వారు ఖండించారు; మార్పుకోసం ఆందోళన చేశారు. తత్ఫలితంగా 1937 లో హిందూస్త్రీల ఆస్తిహక్కు శాసనం వచ్చింది. కుమారులు లేకపోతే ఆమెకు భర్తవాటా వచ్చేది. కుమారులు ఉంటే ఒక కుమారునితో సమానమైన వాటా కలిగింది. అయితే అది పరిమిత హక్కులతో కూడిన అనుభవం మాత్రమే. అది జీవిత కాలపు హక్కుకన్న మిన్న. కాని సర్వహక్కులతోటి అనుభవం కన్న తక్కువ. మధ్యస్థంగా ఉంటుంది. కొన్ని పరిస్థితులలో ఆమె ఆస్తిని అమ్మవచ్చును. కాని మామూలుగా ఆస్తిపైవచ్చే ఆదాయాన్ని మాత్రమే అనుభవించవచ్చును. ఈ శాసనము, కేంద్ర శాసన సభవారు చేశారు కనుక, కేంద్ర ప్రభుత్వ హక్కుల పరిధిలో ఉన్నది. అంటే వ్యవసాయ భూములపై కేంద్ర ప్రభుత్వానికి అధికారం లేనందువ పొలాలకు ఇది వర్తించదు. ఇళ్ళు, డబ్బు, నగలు, పాత్రసామాగ్రి, ఇండ్లస్థలాలు, ప్రామిసరీనోట్లు వగైరాలకు మాత్రమే ఇది పరిమిత మయింది. ఏదైనా ఇది చాల అభ్యుదయ కరమైన చర్య.

# 8 వ అధ్యాయం

## ముస్లిం వివాహాల రద్దు చట్టము 1939

ముసల్మాను వివాహం ఒప్పందంపైన, కాంట్రాక్టు పైన ఆధార పడుతున్నది. దానికి వ్రాతపూర్వకమైన దాఖలా ఉంటుంధి. ఆ ఒప్పందాన్ని లిఖితపరం చేస్తారు. 'వలీ' అని పిలవబడే పురుషుడు ఆమెకు ప్రాతి నిధ్యం వహిస్తాడు. మామూలుగా స్త్రీ విడాకులను కోరే హక్కును అందులో పొందుపరచరు. అందువలన మత గ్రంథాలు, ఇతర ప్రామాణిక గ్రంథాలు నిర్ణయించిన మేరకే స్త్రీ విడాకులు కోరనగును. ఉదాహరణకు భర్త నపుంసకుడైతే ఆమె విడాకులను పొందవచ్చును. విడాకులను ఆమె కోరటానికి కల అవకాశాలు తక్కువగా వున్నందున, శాసనాలు ఆమెను అణచి వేసేవిగా ఉన్నందున స్త్రీలు బాధలను అనుభవించనలసి వచ్చేది. వారికి సంతోష సౌభాగ్యాలు కరువయ్యేవి. అందుచేత జాగృతి, చైతన్యం కల ముసల్మానులు ధర్మశాస్త్రంలో మార్పు కోరసాగించారు. 1939 లో వచ్చిన ఈ శాసనంవలన ఎనిమిది పరిస్థితులలో స్త్రీ విడాకులను కోరవచ్చును. భర్త జాడ నాలుగు సంవత్సరాలవరకు తెలియకపోవుట, భర్త భార్యను వదలి వెళ్ళి పోవుట, భార్యను నిరాదరణ చేసి ఆమెను పోషించకుండుట, అతనికి ఏడేండ్లుకాని ఆపైనగాని శిక్ష పడుట, వరుసగా మూడుసంవత్సరాలు భార్యతో దాంపత్య జీవితం సాగించకుండుట, అతనికి పిచ్చి పట్టుట, కుష్టువ్యాధి కలిగి ఉండుట, ఆమె యెడల కూ్రరంగా ప్రవర్తించుట విడాకులు పొందటానికి శాసనం వల్ల ఆమెకు లభించిన అదనపు కారణాలు.

ఆమె విడాకులకొరకు సివిలుకోర్టులో దావా వేయాలి. మామూలుగా అది చిక్కులతో కూడిన పని. కాలహరణమైన చర్య. వివాహమనే బోనులో చిక్కుకొని బాధపడే ముసల్మాను స్త్రీలకు ఇది వరప్రసాదం. భారతీయ ముసల్మానులకు వర్తించే ధర్మశాస్త్ర సవరణగా ఇది మొదటిదిగాను చివరిదిగాను నిలిచిపోయింది. ఇది చాలా విచిత్రకరమైన విచారకరమైన స్థితి [1]

## రెండవ భాగం ఎనిమిదవ అధ్యాయం రిఫరెన్సులు

1. "ఇస్లాం స్త్రీలు" మల్లాది సుబ్బమ్మ పుటలు 36 - 45

# 9 వ అధ్యాయం : పార్శీ వివాహము మరియు విడాకులచట్టం 1936

జొరాష్ట్రియను మతాన్ని అవలంబించే పార్శీల సంఖ్య భారత దేశంలో చాల తక్కువ. కాని వారు విద్యలో ఉద్యోగాలలో ఇతరుల కన్నా ముందడుగు వేశారు. వారికి సంబంధించిన వివాహ సూత్రాలను 1936 లో సంపూర్తీ కరణం చేశారు. అది 'పార్శీ వివాహమూ మరియు విడాకుల చట్టం'గా 1936 లో రూపొందింది. అది చాల సమగ్రమైన శాసనము. వివాహనిబంధనలు, వివాహం రిజిస్టరు చేసుకోవడానికి ఏర్పాట్లు, భార్యా భర్తలు వేరుగా ఉండటానికి నిబంధనలు, విడాకులు పొందడానికి అవకాశాలు, కుటుంబ న్యాయస్థానాలు, మనవర్తి కోరడానికి సౌకర్యాలు, ఇంకా మరెన్నో అందులో పొందుపరచబడినాయి. 1955 లో అమలులోకి వచ్చిన హిందూ వివాహ శాసనంతో, 1954 నాటి ప్రత్యేక వివాహశాసనంతో పోలిస్తే ఈ చట్టం తక్కువ అభ్యుదయకరంగా కన్పించ వచ్చును. కాని అది అమలులోకి వచ్చిన కాలం 1936 సంవత్సరం-పరిగణనలోనికి తీసుకుంటే ఇతర మతస్థుల ధర్మశాస్త్రనిబంధనల కంటె ఎంతో మెరుగైనదని తెలుతుంది. హిందూ, ముసల్మాను ధర్మశాస్త్రాలు బహు భార్యాత్వాన్ని ఆమోదించిన రోజుల్లో అది ఏకభార్యాత్వాన్ని, ఏక భర్తృత్వాన్ని ప్రతిపాదించింది. హిందూ ధర్మశాస్త్రంలో విడాకులకు అవకాశం మృగ్యమయినపుడు, ముసల్మాను ధర్మశాస్త్రంలో విడాకులకు అవకాశం కల్పించబడినా అది తగినంత న్యాయంగా ఉండని స్థితిలో న్యాయదృష్టితో విడాకులకు అవకాశం కల్పించిన ఘనత ఈ శాసనానికి దక్కింది. ఇతర మతస్థుల శాసనాలకు పార్శీల శాసనం నమూనాగా పనికివచ్చిందని చెప్పుకోవచ్చును. పెండ్లి రిజిస్టరు చేయించుకోడానికి వీలు చేకూర్చింది పార్శీ శాసనం. భార్యాభర్తలకు తగవువస్తే వారి సమష్టి ఆస్తిని పంచే విధానాన్ని నిర్ణయించింది. 1930 దశకంలో వచ్చిన ఈ శాసనం ఎంతో పురోగామియని పేర్కొనవచ్చును.

# 10 వ అధ్యాయం : దేవదాసీ చట్టం

మనిషి కామతృష్ణను తీర్చుకోవడానికి కొన్ని కులాలను కేటాయించిన ప్రత్యేకత ఒక్క భారతదేశానికే చెందుతుంది. ఈ కులాల స్త్రీలు దేవునికి అంకితమవుతారు. వారి పోషణకు దేవాలయ భూములను వారికిచ్చి వాటి ఆదాయంతో వారిని బ్రతకమన్నది సమాజం. ఆ భూములను వారు ఇతరులకు విక్రయించరాదు; అన్యాక్రాంతం చేయరాదు. జీవితం సాగించే నిమిత్తం, తమ పోషణ కొరకు ఆ స్త్రీలు దేవుని ముందు పాడి ఆడవలసిన పరిస్థితి ఏర్పడింది. సంగీతం, నృత్యం లాంటి లలిత కళలలో వారికి ప్రవేశముంది. వారితో సంభాషణ, వారి సాంగత్యం ఆనంద దాయకమవటమూ, ఆలోచనా ప్రేరకమూ అయినందువల్ల సమాజంలోని 'సంస్కారులు' వారిపట్ల ఆకర్షితులయ్యారు. అలా ఉంపుడుగత్తెల వ్యవస్థ ప్రారంభమయింది. బ్రతుకు తెరువు సాధించుకోడానికో లేక సుఖజీవనము వెళ్ళబుచ్చుకొనే నిమిత్తమో ఆ స్త్రీలు తరువాత వ్యభిచార వృత్తిని స్వీకరించారు. వారిలో చాలమందికి సంతానం కలగనందున దేవాలయపు భూములను పోగొట్టుకొనకుండా ఉండే నిమిత్తం వారు బాలికలను పెంచుకునేవారు. ఆ ఆచారాన్ని హిందూ ధర్మశాస్త్రం ఆమోదించింది. ధర్మశాస్త్రప్రకారం దేవదాసి కాని ఏ స్త్రీ కూడా తనకు ఒక బాలికను దత్తు చేసుకోడానికి వీలులేదు. సమాజం తన దుష్ట ప్రయోజనాలను, అవసరాలను సాధించుకునే నిమిత్తం వ్యభిచారవృత్తిని పెంచింది, పోషించింది.

దేవదాసీల పాట, ఆటలేకుండా ఏ నాగరికుని ఇంట ఏ వివాహమూ జరిగేది కాదు. కందుకూరికి ఇదంతా అసహ్యకరంగా తోచింది. అయిన ఈ ఆచారంపై ఒక ధర్మయుద్ధాన్ని ప్రకటించాడు. తరువాత రఘుపతి

వెంకటరత్నం నాయుడు ఈ ఉద్యమాన్ని ఉత్సాహంతో పట్టుదలతో చేపట్టాడు. చివరిలో సమాజపరంగా ఈ దుష్ట సంప్రదాయంపై పోరాటం సాగించిన ఘనత వర్కి చెంచయ్యకు దక్కింది. అలాగే శాసన సభ ద్వారా సంస్కరణకు పూనుకున్న గొప్పతనం డా॥ ముత్తు లక్ష్మిరెడ్డిది. [1]

హిందూ దేవాలయాలకు బాలికలను, యువతులను అంకితం చేసే ఆచారాన్ని అరికట్టటానికి శాసనాన్ని రూపొందించమని కేంద్రప్రభుత్వాన్ని కోరేతీర్మానాన్ని హరిసింగ్ గౌర్ కేంద్రశాసనసభలో 1923న ప్రవేశ పెట్టాడు. ఆ తీర్మానాన్ని శాసనసభ ఆమోదించింది. [2] మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలులో డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి అలాంటి తీర్మానాన్ని 1927 లో ప్రతిపాదించింది. [3] కొన్ని సవరణలతో ఆ తీర్మానాన్ని కౌన్సిలు ఆమోదించింది. దేవునిముందు ఆటపాటలకోసం ఇవ్వబడిన భూములపై ఆసక్తి దేవదాసీలకు నశిస్తే తప్ప వారిని వ్యభిచారవృత్తినుండి మరల్చలేమని, వారిని ఆ దుర్మార్గంనుండి తప్పించలేమని డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి మున్ముందుగా అభిప్రాయపడింది అందుకని హిందూ దేవాదాయ ధర్మాదాయ శాసనానికి సవరణ ప్రతిపాదించింది. దేవునిముందు ఆట పాటలు సాగించకుండానే ఆ భూములను శాశ్వతంగా అనుభవించటానికి దేవదాసీలకు అవకాశం లభిస్తుంది ఈ సవరణవల్ల. దాంతో సనాతనులు తబ్బిబ్బయారు. వ్యతిరేకంగా ఆందోళన చేశారు. అయినా ఆమె పట్టుదలవల్ల దేవదాసీ ఈ నాము భూములు దేవదాసీ కుటుంబాలకు సర్వ హక్కులతో చెందాయి. దేవాలయంలో దేవుని ముందుగాని, దేవాలయ ఆవరణలో గాని, వీధిలో ఊరేగింపులో దేవుని ఎదుటగాని ఆడి పాడవలసిన అవసరం లేకుండానే ఆ భూములు దేవదాసీలకు దక్కాయి 1929 లో ఆమోదింపబడిన అయిదవ చట్టంగా పేర్కొనబడిన ఆ శాసనం వలన. [4] ఇది సముచిత చర్య; అభ్యుదయ కృషి.

1930 లోని 5 వ శాసనం మదరాసు వ్యభిచార వృత్తి నిర్మూలన శాసనం వ్యభిచారం కోసం విటులను పిలవడాన్ని నేరం చేసింది. పడుపు

గృహాలను నడపటం, స్త్రీలను పడుపుగృహాలలో బంధించటం నేరాలయినాయి ఈ శాసనాన్ని సదుద్దేశంతో రూపొందించినా, పోలీసులచేతిలో అది అణచి వేత చర్యగా పరిణమించింది. స్త్రీలను మాత్రమే ఈ శాసనం క్రింద శిక్షిస్తున్నారు. వరప్రసాదంగా ఊహించబడిన ఈ శాసనం చివరకు స్త్రీల పట్ల 'శాపం' గా మారింది; తద్వారా స్త్రీలు - వ్యభిచారవృత్తి చేసే స్త్రీలే ననుకోండి - వివక్షకు లోనయి అనేక ఇబ్బందుల పాలవుతున్నారు. కాకినాడలో దేవదాసీలు అనేకమంది వుండేవారు ఆ రోజుల్లో. దుర్గాబాయ్ వారితో ఈ వృత్తి జుగుప్సాకరమైనదని వాదించి చర్చించింది. మాకిదే జీవనోపాధి అని వారు అన్నప్పుడు చేతిపనులతో జీవించమని బోధించి వారిలో కొంతమార్పు తెచ్చింది. 5

దేవదాసీలుగా స్త్రీలను అంకితంచేసే ఆచారాన్ని నిషేధించటానికి 1937 లో అమ్మన్నరాజా మదరాసు శాసన సభలో బిల్లు ప్రవేశపెట్టింది. దానిని ప్రజాభిప్రాయ సేకరణకొరకు పంపారు. ఆ పని పూర్తి అయ్యే లోగా కాంగ్రెసు ప్రభుత్వం రాజీనామా చేసింది. 1947 వరకు అది శాసన రూపం తాల్చలేకపోయింది.

## రెండవ భాగం పదవ అధ్యాయం రిఫరెన్సులు

1. డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి పుస్తకం 'ఆంధ్రలో స్త్రీల పరిస్థితిలో మార్పు' (Changing Condition of women in Andhra) పుట 203 లో పేర్కొనబడిన డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి పుస్తకం 'హిందూ దేవాలయంలోని దేవదాసీ పద్ధతిని ఎందుకు తొలగించాలి?' లో పుట 5
2. డా॥ ఎస్. పుతలీకృష్ణమూర్తి పుస్తకం పుట 214
3 ,, ,, 216
4. ,, ,, 218
5. మల్లాది సుబ్బమ్మ - "మారుతున్న సమాజం : మహిళలు" పుట 34

# 11 వ అధ్యాయం : రాజకీయ హక్కులు

1918 లో ఇ. ఎస్. మాంటేగ్యూ భారతదేశ సెక్రెటరీ ఆఫ్ స్టేట్. చెల్మ్స్ ఫర్డు ఆనాటి వైస్రాయి. మాంటేగ్యూ ఇండియాను దర్శించాడు స్త్రీలకు వోటుహక్కు విషయమై డిమాండు చేయటానికి ఒక ప్రతినిధి వర్గాన్ని స్త్రీల తరఫున ఆయన వద్దకు పంపాలని, విజ్ఞప్తి పత్రాన్ని సమర్పించాలని శ్రీమతి మార్గరెట్ కజిన్సు నాయకత్వాన చైతన్యయుతులైన స్త్రీలు యోచన చేశారు. తమ వాదనను బలపరచమని కోరటానికి శ్రీమతి మాంటేగ్యూను కూడా కలుద్దామని వారు సంకల్పించారు. అఖిల భారత ప్రతినిధి వర్గమొకటి శ్రీమతి సరోజని నాయుడు ఆధ్వర్యాన వైస్రాయితో సమావేశమయి విజ్ఞాపన పత్రాన్ని సమర్పించింది. అధికార యుతంగా నాయకత్వం వహించింది శ్రీమతిసరోజని నాయుడు. అనధికార నాయకులు శ్రీమతి మార్గరెట్ కజిన్సు, 'హోంరూలు' ఉద్యమ స్థాపకురాలు శ్రీమతి అనిబిసెంటు. [1] విజ్ఞాపన పత్రంలో స్త్రీలను ప్రజలుగా గుర్తించాలని, పురుషులతో సమానంగా వోటుహక్కును వారికి ఇవ్వాలని కోరారు. ఇది భారతస్త్రీల ప్రథమ డిమాండు. మాంటేగ్యూ చెల్మ్స్ ఫర్డు రాజ్యాంగ సంస్కరణలో స్త్రీల ప్రసక్తి లేదు. భారతస్త్రీల డిమాండును ప్రభుత్వం వారిచేత నియమింపబడిన సౌత్ బరో కమిటీ తిరస్కరించింది. స్త్రీలకు వోటుహక్కు ఇవ్వడానికి తరుణం ఆసన్నం కాలేదని కమిటీ అభిప్రాయ పడింది. అయినా తర్వాత కొంతకాలానికి ఈ సమస్యను పునరాలోచన చేయాలని సిఫారసు చేసింది. ఆ కమిటీ సభ్యుడైన హగ్ కమిటీ అభిప్రాయానికి అసమ్మతి తెలిపాడు. స్త్రీలకు వోటుహక్కు కావాలని ఆయన బలవత్తరంగా వాదించాడు. [2] 1919 భారత ప్రభుత్వ పరిపాలనా బిల్లు (Government of India Bill) సందర్భంగా బ్రిటిషు పార్లమెంటు

ఒక జాయింటు సెలెక్టు కమిటీని నియమించింది. ఆ కమిటీ వారికి అనేక భారత సంస్థలూ, సంఘాలు విజ్ఞాపన పత్రికలను అందించాయి. వాటిలో పురుషులతో పాటు స్త్రీలకు సమానంగా వోటుహక్కు కావాలని కోరారు. 'హోంరూలు' ఉద్యమం తరఫున వెళ్ళిన ప్రతినిధి వర్గం స్త్రీల డిమాండును బలపరిచింది. శ్రీమతి అనిబిసెంటు, శ్రీమతి సరోజని నాయుడు, శ్రీమతి హిరాబాయి తాతా, మిథాన్ తాతాలతో కూడిన ప్రతినిధి వర్గం జాయింటు సెలెక్టు కమిటీకి నచ్చచెప్పడానికి ఎంతో కృషిచేసింది.[3] చివరకు రాష్ట్ర శాసన సభలు ఈ విషయాన్ని తేల్చాలని నిర్ణయింపబడింది. ప్రముఖులైన మహిళోద్యమ నాయకుల ప్రయత్నఫలితంగా 1921 లో మదరాసు శాసన మండలి పురుషులతో సమానంగా అవే అర్హతలున్న స్త్రీలకువోటుహక్కు ఇవ్వాలని తీర్మానించింది.[4] ఈ తీర్మానాన్ని ఆమోదింప చేయడానికి కృషిచేసిన వారు డా॥ అనిబిసెంటు, శ్రీమతి మార్గరెట్ కజిన్సు, శ్రీమతి డొరోథీ జినరాజదాస, డా॥ ముత్తు లక్ష్మీరెడ్డి, శ్రీమతి ధన్వంతరి రామారావు, శ్రీమతి సదాశివ అయ్యర్. ఇతర రాష్ట్రాలవారు మదరాసును అనుసరించారు. తత్ఫలితంగా ఆస్థి ఉన్న కొద్దిమంది స్త్రీలు వోటుహక్కును పొందగలిగారు.

వోటుహక్కును విస్తృతం చేసే ప్రసక్తి 1932 లో వచ్చింది. మొదటి 'రౌండుటేబుల్' సమావేశం (First Round Table Conference) నియమించిన లోథియన్ కమిటీ నివేదిక సమర్పించింది. ఆ నివేదికలో కమిటీ వారి సిఫారసులున్నాయి. వోటుకు అర్హత పురుషులకూ, స్త్రీలకూ సమానంగా నిర్ణయింపబడాలనేది మొదటిది. అక్షరాస్యులకు వోటుహక్కు ఉండాలనేది రెండవది. పురుష వోటర్లకు స్త్రీ వోటర్లకు నిష్పత్తి 9:2 గా ఉండాలనేది మూడవది. సైమను కమిషను వారు ఆ నిష్పత్తి 2:1 గా ఉండాలని సిఫారసు చేసినవిషయం గమనార్హం. బ్రిటిషు పార్లమెంటుచేత నియమింపబడిన జాయింటు సెలెక్టు కమిటీ ఆ నిష్పత్తి 7:1 గా ఉండాలన్నది ఆస్థి ఉన్న స్త్రీలకు, మిలటరీలో ఉన్న వారి భార్యలకు, సైన్యంలో పని చేసిన వారి తల్లులకు, పెన్షన్ పొందుతున్న విధవలకు, నిర్ణయింపబడిన

విద్యార్హతలున్న మహిళలకు 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా అక్టు వోటును ప్రసాదించింది.

మద్రాసు శాసనసభలో 8 స్థానాలను మహిళలకు కేటాయించారు. ఎన్నికయిన వారిలో ముఖ్యులు ఆమర్తి లక్ష్మీబాయి (బరంపురం), ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి (మదరాసు), అమ్మన్న రాజా (ఏలూరు). అనేక మంది స్త్రీలు స్థానిక సంస్థలకు ఎన్నికయినారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెసు మహిళలు.

## రెండవభాగం పదకొండవ అధ్యాయం రిఫరెన్సులు

1. 'మార్గరెటు కజిన్సు : భారతదేశంలో ఆమెకృషి' అనే ముత్తు లక్ష్మిరెడ్డి పుస్తకంలో పేర్కొనబడిన రాజవాడ రాణి లక్ష్మీభాయి రిమార్కు పుట 5 (డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి పుస్తకం 'ఆంధ్రలో స్త్రీల పరిస్థితి' పుట 150)
2. డా॥ పుతలీ కృష్ణమూర్తి పుస్తకం పుట 151
3. ,, ,, 154
4. ,, ,, 155

# 12 వ అధ్యాయం : స్త్రీల పత్రికలు

1902 లో సీతారామయ్యచే ప్రారంభించబడిన 'హిందూ సుందరి' ప్రచురింపబడుతూనే ఉంది. కళ్ళేపల్లి వెంకట రమణమ్మ సంపాదకత్వాన బరంపురం నుండి 'ఆంధ్రలక్ష్మి' వచ్చింది. కాకినాడలో 1917 లో స్థాపించబడిన 'అనసూయ' పత్రిక క్రమంగా ప్రచురణ అయింది.

1928 లో కవుతా శ్రీరామశాస్త్రి 'శారద' అనే మహిళల పత్రికను నెలకొల్పాడు. ప్రసిద్ధ బ్రహ్మసమాజ మతస్థులు రాయసం వెంకట శివుడు 'జనానా' పత్రికను మొదలిడినారు. 'వివేకవతి' పత్రిక వస్తూండేది.

1920 లో ప్రారంభించి సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధురాలు సంఘ సంస్కర్త యామినీ పూర్ణతిలకం 'హిందూ యువతి' పక్ష పత్రికను నడిపేది. 1920 లో పుట్టిన 'సౌందర్యవతి' పత్రికకు జి. రమాబాయి స్థాపక సంపాదకురాలు.

మహిళోద్యమానికి సంబంధించి 1928 లో చిరస్మరణీయమైన సంఘటన జరిగింది. అదే 'గృహలక్ష్మి' మాసపత్రిక జననం. దాని జనకులు డా. కె. ఎన్. కేసరి. (మద్రాసు). స్త్రీల ఆరోగ్యం, సౌభాగ్యం, అభ్యుదయమూ ఆ పత్రిక లక్ష్యాలు, ఆదర్శాలు. ఆ పత్రిక యొక్క ముద్రణాలయంలో స్త్రీలే అక్షరాలు కూర్చేవారు. స్త్రీలలో జాగృతి కలిగించడంలో ఆ పత్రిక ఎనలేని కృషి చేసింది. విద్యకోసం ఆర్తిని వారిలో ప్రేరేపించింది. తమ ఉద్ధరణకోసం తాము పాటుపడాలనే భావాన్ని రేకెత్తించింది. ప్రయివేటుగా స్త్రీలు విద్యాభ్యాసం చేసి ఉన్నతోన్నత ప్రమాణాలను అందుకున్నారు. కొందరు కవులు అయినారు. మహిళల పురోగతికి ఆ పత్రిక ఎంతో దోహదం చేసింది. స్త్రీల వ్యాసాలు

| క్ర. నెం | వ్యాస శీర్షిక | రచయిత | పత్రిక | సం॥ | పుట |
|---|---|---|---|---|---|
| 19. | బాల్యవివాహ నిషేధచట్టం సవరణ వరుసకి 16, వధువుకు 11 నిండాలి ప్రతిపాదన | సెలెక్టుకమిటీకి పంపబడినవార్త | గృహలక్ష్మి | 1941 జనవరి | |
| 20. | రాధాబాయిసుబ్బారాయన్ బిల్లు బహుభార్యాత్వనిషేధం | చర్చ | ,, | 1938 | 715_722 |
| 21. | స్త్రీలకు వ్యాయామ విద్య | సంపాదకీయం | ,, | 1939 | |
| 22. | స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల విధ్యుక్తధర్మం | పులవర్తి కమలాదేవి | ఆంధ్రపత్రిక సం॥ సంచిక | 1925 | 86,87 |
| 23. | రాజకీయాలలో స్త్రీలు ఎలా పాల్గొనాలి? | అయ్యదేవర బాలత్రిపురసుందరమ్మ | ఆంధ్రపత్రిక సం॥ సంచిక | 1929 | 302_385 |
| 24. | స్త్రీ విద్య | గోపిశెట్టి సూర్యనారాయణమ్మ | అనసూయ | 1919 | నవంబర్-డిశంబరు |
| 25. | స్త్రీలు ఉపాధ్యాయినులయితే లాభాలు | సంపాదకీయం | ,, | 1919 | సెప్టెంబరు అక్టోబరు |
| 26. | స్త్రీలలో ఐక్యత | చదలవాక వరలక్ష్మి | ,, | 1919 | 58 |
| 27. | (సురవరం ప్రతాపరెడ్డి వ్యాసం 'స్త్రీలకు స్వేచ్ఛ అవసరమా' పై విమర్శ) | ఎల్లాప్రగడ సీతాకుమారి | గోల్కొండ పత్రిక | 1925_26 | 40 |

## రెండవ భాగం పన్నెండవ అధ్యాయం రిఫరెన్సులు

1. గృహలక్ష్మి 1948 పుట 211
2. గృహలక్ష్మి 1947 ,, 423
3. ,, 1947 ,, 429

# 13 వ అధ్యాయం : మహిళా సంఘాలు

## I జాతీయ సంస్థలు :

1917 లో స్థాపించబడిన ఉమెన్స్ ఇండియన్ అసోసియేషను మహిళోద్యమానికి బ్రహ్మాండమైన సేవచేసింది. సమస్యలను సంఘటనలను స్త్రీ పరంగా దృష్టి సారించిన అఖిలభారత సంఘాలలో ఇది మొదటిది. శ్రీమతి అనిబిసెంటు ఈ సంస్థ స్థాపక అధ్యక్షురాలు. శ్రీమతి డొరోథీ జినరాజదాసా ఎనిమిది సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేసింది. తరువాత శ్రీమతి మార్గరెట్ కజిన్సు ఆ స్థానాన్ని అలంకరించింది. అనిబిసెంటు మరణానంతరం ముత్తు లక్ష్మిరెడ్డి అధ్యక్షురాలయింది. [1]

1930 నాటికి దానికి 87 శాఖలున్నాయి. బాలికా సమాజాలు, అనాథాశ్రమాలు, స్త్రీలకు శరణాలయాలు, సేవాసదనాలు, వయోజన విద్యాలయాలు నడిపింది. మద్రాసులోని సేవాసదనం వారు 'అవ్వాయి శరణాలయం' నడిపేది. బళ్ళారి, బెజవాడ, చిత్తూరు, శ్రీకాకుళం, మదనపల్లి నరసాపురం, నెల్లూరు, రాజమండ్రి, గుంటూరు, విశాఖపట్టణంలలో దానికి శాఖలుండేవి. స్త్రీలకు సంబంధించిన వివాహ వయః పరిమితి బిల్లులాంటి వాటిపై ఆందోళన సాగించటమే కాక స్త్రీలకు వోటుహక్కు సంపాదించి పెట్టిన ఘనత, విశిష్టత ఈ సంఘానిదే.

స్త్రీల సామాజిక విద్యావిషయిక సంస్కరణలను గురించి ఆలోచించే నిమిత్తం 1929 జనవరిలో పూనేలో అఖిలభారత సభ జరిగింది. శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ స్థాయీ సంఘ సభ్యురాలు. ఆంధ్రప్రాంతంనుండి ముగ్గురు స్త్రీలు ప్రతినిధులుగా ఈ సభకు వెళ్ళారు. దానిని తరువాత విద్యావిషయక సామాజిక సంస్కరణల అఖిలభారత స్త్రీల మహాసభ

అంగీకార యోగ్యమయినాయి. మున్ముందుగా ప్రముఖ స్వాతంత్ర్య వీరాంగన మాగంటి అన్నపూర్ణ మృతికి ప్రగాఢ సంతాపం తెలిపారు. తండ్రి ఆస్తిలో కుమార్తెకు వాటా రావాలని సత్తిరాజు శ్యామలాంబ ప్రతిపాదన చేసింది. యామినీ పూర్ణతిలకమ్మ, బత్తుల కామాక్షమ్మ తీర్మానాన్ని బలపరిచారు. బాల్యవివాహ నిషేధ శాసనం వచ్చినందుకు హర్షామోదాలు తెలిపారు సభికులు. గర్భాదాన వయస్సు పెంచాలన్నారు. ప్రఖ్యాత సంఘ సంస్కర్త దర్శి చెంచయ్య భార్య అన్నపూర్ణమ్మ కూడ సంఘ సంస్కర్తయే. ఆమె, పొణకా కనకమ్మ దేవదాసి పద్ధతి నశింపును కోరారు. హిందూ ముస్లిం సఖ్యత కావాలన్నారు. దానికోసం కృషిచేయమన్నారు తోటిస్త్రీలను. పదిసంవత్సరాలలో సంపూర్ణంగా మద్యపాన నిషేధాన్ని ప్రవేశపెట్టమని ప్రభుత్వాన్ని అడిగారు. స్థానికి మహిళా సంఘాలు మద్రాసులోని 'అమ్మాయి శరణాలయం' లాంటి వాటిని నడపాలని ఉద్బోధించారు. 7

1930 మహాసభకు బందరు (మచిలీపట్నం) కూడలి. 1931 లో గుంటూరులో జరిగిన మహాసభకు ప్రాధాన్యత ఉంది, ఆదిపూడి వసుందరా దేవి అధ్యక్ష స్థానం అలంకరించారు. రాయలసీమనుండి కె. లక్ష్మీదేవి ఒక్కరే ప్రతినిధిగా వచ్చారు. మొత్తం 60 మంది ప్రతినిధులు చేరారు. డా॥ దానమ్మ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు. కోటేశ్వరమ్మ, వాసికొలను పద్మాసనమ్మ, సాధువమ్మ, కళ్యాణిబాయి కార్యకర్తలు. రాయసం రత్తమ్మ సలహాదారు.

చర్చలు వివాదాస్పదంగాను తీవ్రంగాను సాగాయి స్త్రీలకు ప్రత్యేకంగా వైద్య కళాశాలను నెలకొల్పాలనే తీర్మానం నెగ్గింది. వోటింగులో ఆయుర్వేదం వీగిపోయింది. అలోపతి బలాన్ని పుంజుకున్నది. ప్రాథమిక పాఠశాలలో సహవిద్య కావాలని, ఆ పాఠశాలలో స్త్రీలే ఉపాధ్యాయినిలుగా ఉండాలనే అభిప్రాయం వ్యక్తమయింది. స్త్రీలకు ప్రత్యేక కళాశాలను అభిలషించింది మహాసభ. ఉన్నత విద్య ప్రాంతీయ భాషలో గరపమనే

ప్రతిపాదనకు బహు జనాంగీకారం రాలేదు. తండ్రి ఆస్తిలో, భర్త ఆస్తిలో స్త్రీలు వాటాలు కోరడాన్ని కొంతమంది వ్యతిరేకించారు. అయినా ఆ తీర్మానం, రెండుసార్లు వోట్లు లెక్కించినా నెగ్గింది. బాలవిధవలకు వివాహం చేయమని ఆ బాలికల సంరక్షకులకు విజ్ఞప్తి చేసింది మహాసభ. అంతకు క్రితమే వివాహమయిన పురుషులను స్త్రీలు వివాహమాడరాదనే తీర్మానం, విడాకులకు అనుకూలంగా వచ్చిన తీర్మానంపై భేదాభిప్రాయాలు వ్యక్తమయినందున రాజీగా విరమింపబడినయి. పరదా పద్ధతి నిర్మూలన, అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధం, గ్రామపునర్నిర్మాణం వీటిపై తీర్మానాలను మహాసభ అంగీకరించింది. బందరు మహాసభ కన్నా గుంటూరు మహాసభ వెనుకడుగు వేసిందని చెప్పుకోవచ్చు. మహిళా మహాసభకు రాజకీయాల ప్రమేయం అసలే పనికిరాదనే భావం ఈ నడకకు కారణం. కాని మహాసభలో చర్చలు మాత్రం ఆసక్తి దాయకంగా కొనసాగాయి. ప్రతి తీర్మానంపైన కనీసం పదిమంది ప్రతినిధులు మాట్లాడారు. s

రాజమండ్రిలో నవంబరు 1932 లో సమావేశమయిన 6 వ ఆంధ్ర రాష్ట్ర మహిళా మహాసభకు ఆచంట లక్ష్మీదేవి అధ్యక్ష స్థానంలో కూర్చున్నారు. అస్పృశ్యత, విద్య, సాంఘిక దురాచారాలు, పర్దా, గర్భిణీ స్త్రీలకు సాయపడటానికి నిధి వీటిని అధ్యక్షోపన్యాసం స్పృశించింది.

7 వ రాష్ట్ర మహాసభ ఏలూరులో సమావేశమయింది. డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి అధ్యక్షులు. స్వాతంత్ర్య సాధన ఎంత ముఖ్యమో సాంఘిక సంస్కరణ అంతే ముఖ్యమని ఆమె భావప్రకటన చేసింది, విద్య, వైద్యము ఉపాధులను స్త్రీలకు కల్పించమని ఆమె ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. ఆహ్వాన సంఘాధ్యక్షురాలు చుండూరి రత్తమ్మ ఏకభర్తృత్వ ఏకభార్యాత్వ పద్ధతి (Mono Gamy) చాలునని విడాకులకు వెసులుబాటు అక్కరలేదని స్త్రీలు ఉద్యోగాలు చెయ్యనక్కరలేదని అన్నారు. వివాహాల రిజిస్ట్రేషను కావాలని మహాసభ తీర్మానం చేసింది. సహవిద్య, జన్మనిగ్రహం వీటికి అనుకూలంగా వచ్చిన తీర్మానాలు ఓడిపోయాయి. విడాకుల తీర్మానంపై భేదాభిప్రాయాలు

కష్పడినాయి. కడప రామసుబ్బమ్మ ఆ తీర్మానాన్ని గట్టిగా వ్యతిరేకించింది. విడాకులు అసలే అక్కరలేదని వాదించింది. ఆ తీర్మానాన్ని ప్రతిపాదకులు ఉపసంహరించుకున్నారు. ఆంధ్రరాష్ట్రం కావాలనే తీర్మానాన్ని అధ్యక్షులు తోసిపుచ్చారు ఆ సభలో.

11 వ మహాసభ కడపలో సమావేశమయింది. నాటి సభకు బేగం అమీరుద్దీన్ అధ్యక్షురాలు. కడప రామసుబ్బమ్మ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు 200 మంది ప్రతినిధులు హాజరైనారు. జి. అమ్మన్నరాజా (ఎం. ఎల్. ఏ.) కలిగర పిచ్చమ్మ (విజయవాడ), వేములగంటి పాపాయమ్మ ప్రముఖులు. అనేకమంది క్రైస్తవ స్త్రీలు మహాసభ సమావేశాలకు హాజరైనారు. వ్యభిచార నిర్మూలనకు, బహుభార్యాత్వ నిషేధానికి చర్యలు తీసుకోమని కడప రామసుబ్బమ్మ ప్రభుత్వాన్ని డిమాండు చేశారు. కాని ఆమె విడాకుల బిల్లును వ్యతిరేకించింది. స్త్రీలు మంత్రులుగా, పార్లమెంటరీ కార్యదర్శులుగా అసెంబ్లీల ఉపాధ్యక్షులుగా, శాసన మండలి ఉపాధ్యక్షులుగా, జిల్లా బోర్డు అధ్యక్షులుగా ఇలా ఎన్నో బాధ్యతాయుత పదవులను అధిష్టించారని, అది హర్షదాయకమని బేగం అమీరుద్దీన్ అన్నది. వరకట్నాన్ని ఆమె నిరసించింది. స్త్రీలకు వారసత్వ హక్కు కావాలన్నది. స్త్రీలు తమకోసం తామే పత్రికలను నిర్వహించాలని ఆమె ఆశించింది. బొబ్బిలిరాణి, విజయనగరం మహారాణి, చల్లపల్లి రాణి, వెంకటగిరి రాణి, పెద్దాడ కామేశ్వరమ్మ, భారతీదేవిరంగా, డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి మహాసభ జయప్రదంగా జరగాలని సందేశాలు పంపారు.[9]

## తెలంగాణాలో

నిజాంసంస్థానంలోని ప్రజలను రాజకీయసంఘాలను స్థాపించుకోనివ్వలేదు ప్రభుత్వం. కనుక ఆయా ప్రాంత ప్రజలు ప్రాంతీయాభివృద్ధికోసం అభ్యుదయం కొరకు సంఘాలను పెట్టుకున్నారు. అలా ఆ అవసరాన్ని తీర్చటానికి ఆంధ్రమహాసభ పుట్టింది. ఆంధ్రమహాసభ వార్షిక మహాసభలు సందర్భంగా స్త్రీలు అదేచోట స్త్రీల మహాసభలను నిర్వహించుకునేవారు.

ప్రథమ నిజాం సంస్థాన ఆంధ్ర మహాసభ సమావేశాన్ని మెదకు జిల్లా జోగిపేటలో ఏర్పాటుచేశారు. గోల్కొండ పత్రిక స్థాపకుడు సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్ష పీఠాన్ని అధిష్టించారు. విద్య, సాంఘిక సంస్కరణల పై వచ్చిన తీర్మానాలు సభ్యుల దృష్టిని ఆకట్టుకున్నాయి. చర్చలు బాగా సాగాయి. స్త్రీలలో సామాజిక చైతన్యాన్ని పెంపొందించటానికి తర్వాత వారు రాజకీయాలలో ప్రవేశింప వీలు కల్పించటానికి స్త్రీల మహా సభలు జరపాల్సి వచ్చింది. ప్రథమ స్త్రీల మహాసభ ప్రాంత స్థాయిలో జోగిపేటలో సాధ్యమయింది. స్త్రీ విద్య, వివాహం, విధవల శోచనీయ పరిస్థితి, వ్యభిచారం ఈ సమస్యలు చర్చలకు ప్రాతిపదికలయినాయి. [10]

1931 లోని ద్వితీయ ఆంధ్రమహాసభ సమావేశ కేంద్రం దేవరకొండ. మహాసభ పెట్టుకోటానికి అతి కష్టంమీద నిర్వాహకులు అనుమతిని సంపాదించ కలిగారు. ఆనాటి నిజాంలో అధికారుల అనుమతి లేకుండా ఏ సభనూ ఏర్పాటు చేయరాదు. నిజాం ప్రభుత్వం కొన్ని షరతులకు లోను చేసి మరీ అనుమతి ఇచ్చింది. నిజాం సంస్థానానికి వెలుపల నివాసముండే వ్యక్తి అధ్యక్షుడుగా ఉండరాదన్నారు అధికారులు. బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షుడుగా ఎంపిక చేయబడినాడు. స్త్రీల మహా సభలో టి. వరలక్ష్మమ్మ అధ్యక్షోపన్యాసం చేసింది. ఆమె సనాతన వైదిక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఆమె విధవరాలయింది. పునర్వివాహం చేసుకున్నది. మంచి పేరు ప్రఖ్యాతులున్న సంఘ సంస్కర్త. నర్సులు, మంత్రసానులు ఆయాలుగా స్త్రీలు సుశిక్షితులు కావాలని ఆమె కోరిక. తక్షణ వైద్య సహాయం, నర్సింగ్, మంత్రసానితనం, ఆరోగ్య వారాలు, శిశు సంక్షేమ వారాలు వీటి విషయమై అవసరమైన పరిజ్ఞానాన్ని స్త్రీలకు అందజేయాలని ఆమె అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. పర్దాపద్ధతిని ఆమె నిరసించింది, కళావంతుల కులంలోని స్త్రీలు వివాహాలు చేసుకోవాలని ఆమె హితవు చెప్పడం జరిగింది. [11]

ఖమ్మంలో 1934 లో జరిగిన తృతీయ సమావేశానికి సనాతనవాదులు ఎన్నో అడ్డంకులు పెట్టాలని ప్రయత్నం చేశారు. సమావేశాన్ని జరగ

నివ్వరాదని కొంతమంది స్త్రీడర్లు ప్రభుత్వాధికారులకు నచ్చచెప్ప ప్రయత్నించారు. అధ్యక్షోపన్యాసం తమకుముందుగా చూపాలనిప్రభుత్వాధి కారులు షరతు పెట్టారు. స్థానికంగా వచ్చిన వ్యతిరేకత కారణంగా జంతు బలుల నిషేధం, స్త్రీల వివాహ వయస్సును పెంచుట, అస్పృశ్యులను ఉద్ధరించుట వీటిపైన తీర్మానాలను వదులుకున్నారు నాయకులు. యల్లా ప్రగడ సీతాకుమారి అధ్యక్షతన సమావేశమయిన స్త్రీల సభలో ఆ తీర్మా నాలను ప్రవేశపెట్టే ప్రయత్నం జరిగింది. [12] స్థానికుల అభ్యంతరం ఉన్నా మాడపాటి హనుమంతరావు తీసుకున్న దృఢవైఖరి వల్ల తీర్మానాలు నెగ్గాయి. [13] డిశెంబరు 1935 లో 4 వ సమావేశానికి సిరిసిల్ల కేంద్రం. మాడపాటి హనుమంతరావు అధ్యక్షుడు. 13 వేలమంది ప్రజలు వచ్చారు. విద్యారంగ సంస్కరణ, నిర్బంధ ప్రాథమిక విద్య, బాల బాలికలకు మాతృభాషలో విద్య, జాగీరులలోని ప్రజలకు హక్కులు, బాల్య వివాహ నిరసన, తెలంగాణా రైతులకు వెసులు బాట్లు, స్థానిక స్వపరిపాలన, నిమ్న జాత్యుద్ధరణ వీటిపై తీర్మానాలను ఆమోదించారు. 'ఆంధ్రమహాసభ' కు నిబంధనావళిని సమకూర్చుకున్నారు. హనుమంతరావు సతీమణి మాణిక్యాంబ స్త్రీల మహాసభకు అధ్యక్షురాలుగా ఉండుట గమనార్హం. [14]

5 వ సమావేశం 1936 డిసెంబరులో కొండా వెంకటరంగారెడ్డి అధ్యక్షతన షాద్ నగర్‌లో నిర్వహింపబడినది. ఆచార ప్రకారం మహిళా మహాసభ కూడా అక్కడే సమావేశమయింది. బూర్గుల అనంతలక్ష్మి అధ్యక్షస్థానం నుండి సమావేశం యొక్క చర్చలను నడిపారు. [15]

కొండా వెంకటరంగారెడ్డి నిజాం శాసనసభలో హిందూస్త్రీలకు వార సత్వపు హక్కు, వర్ణాంతర వివాహాలు చేసుకున్నవారి సంతానానికి హక్కులు, బాల్య వివాహ నిషేధం, అస్పృశ్యతానివారణం, జాగీరు రైతుల హక్కులు వీటికి అనుకూలంగా బిల్లులు పెట్టారు. బాల్య వివాహ నిషేధపు బిల్లు ప్రజాభిప్రాయ సేకరణకు పంపబడింది. [16]

6 వ సమావేశం 1937 డిసెంబరులో నిజామాబాదులో ఏర్పాటయింది. ముందుముల నరసింగరావు అధ్యక్షోపన్యాసం చేశారు. మొట్టమొదటి సారిగా రాజకీయతీర్మానాన్ని ఆమోదించటం సంభవించింది. [17]

ముసాయిదా రాజ్యాంగ సవరణలను ప్రతిపాదించుటకు కమిటీలను వేశారు. తరువాత కొంతమందిని కమిటీలలో సభ్యులుగా చేర్చుకున్నారు. శ్రీమతి కార్నిలియస్, శ్రీమతి నంది ఆ కమిటీలలో ఉన్న మహిళా సభ్యులు.

1938 లో సంస్థాన వ్యాప్తంగా స్టేటు కాంగ్రెసు ఆధ్వర్యాన సత్యాగ్రహం సాగింది. అందువల్ల, హైదరాబాద్ జిల్లాలోని మలకాపూర్‌లో కూడిన 7 వ సమావేశంలో రాజకీయ సమస్యలు చర్చకు ప్రముఖంగా ముందుకు వచ్చాయి. [18]

విధవా వివాహాన్ని అనుమతించే శాసనం నిజాం సంస్థానంలో 1930లో వచ్చింది. నిజాం సంస్థానంలో శాసనంగా రూపొందిన ప్రప్రథమ సాంఘిక సంస్కరణ ఇది. [1]

నిషేధపుటుత్తరువులను ధిక్కరించి పద్మజానాయుడు, శ్రీమతి మేల్‌కోటే, జ్ఞానకుమారి హెడా సత్యాగ్రహం చేశారు. [20]

రంగమ్మా ఓబుల్‌రెడ్డి అధ్యక్షతన నిజాం రాష్ట్ర మహిళలు 8 వ మహిళా సభ 1940 జూన్‌లో చిలుకూరులో సమావేశమయినారు. విద్యనార్జించమని, నగలపై అలంకారాలపై వీలయినంత తక్కువ ఖర్చు చేయమని, బాల్య వివాహాలను ఆపమని, శిశువులపై శ్రద్ధ వహించమని, వ్యాధిగ్రస్తులకు సేవ చేయమని, పర్దానుండి వెలికి రమ్మని, శరీర వ్యాయామాన్ని అలవర్చుకోమని ఆమె శ్రోతలకు విజ్ఞప్తి చేసింది. ఆదర్శవివాహాన్ని ఆమె అభివర్ణించింది శాశ్వతమైనదీ, కామతృష్ణకు ప్రాధాన్యత ఇవ్వనిదీ, విడాకులకూ వ్యాపార దృష్టికీ చోటు పెట్టనిదీ మాత్రమే అభిలషణీయ దాంపత్యం ఆమె దృష్టిలో. ఆహ్వాన సంఘాధ్యక్షురాలైన పులిజాల కమలాబాయి మహిళోద్యమాన్ని

మహిళలే నిర్వహించాలనే నినాదాన్ని ఇచ్చింది. ఈ దిగువ పేర్కొనబడిన అంశాలపై చర్చల అనంతరం తీర్మానాలు నెగ్గాయి. ఉర్దూభాషను విధిగా నేర్చుకోవాలనే నిబంధన పనికిరాదు. విద్యార్థి ఇష్టాయిష్టాలకు దానిని వదిలివేయాలి. ఉన్నత విద్య మాతృభాషలో నేర్పబడాలి. ప్రయివేటు పాఠశాలలపై ప్రభుత్వ అదుపు ఉండరాదు. బ్రిటిషు ఇండియాలో ఉన్నట్లుగా విధవలకు హక్కులుండాలి. భార్యను భర్త వదిలివేస్తే ఆమెకు పునర్వివాహ యోగ్యత ఉండాలి. బహు భార్యాత్వాన్ని నిషేధించాలి. బాలికలను వయోవృద్ధులైన పురుషులు వివాహమాడే పద్ధతి పోవాలి. వివాహం చేసుకోబొయ్యే స్త్రీ పురుషుల మధ్య వయస్సు తేడా విపరీతంగా, ఘోరంగా ఉండరాదు. ఉచితవైద్య శాలలను గ్రామాలలో నెలకొల్పాలి. గ్రామాలలో పనిచేయడానికి మంత్రసానులను నియమించాలి. జిల్లాలలో అనాథ స్త్రీలకు శరణాలయాలు, స్త్రీల వ్యాయామ కేంద్రాలు స్థాపించబడాలి. అస్పృశ్యతను తొలగించాలి. మద్యపాన నిషేధాన్ని శాసనం ద్వారా అమలు పరచాలి. భూస్వాముల ఇళ్ళల్లో బాలికలను, యువతులను 'ఆడపాప' లుగా ఏర్పాటు చేసుకొని వారిచేత బండచాకిరీ చేయించుకుంటూ సాగించే స్త్రీల బానిసత్వ విధానాన్ని రూపుమాపాలి. పర్దా పద్ధతిని తొలగించాలి. ఇలాంటి అధునిక భావాలతో కూడిన తీర్మానాలు ఆనాటి సభలో ఆమోదింపబడ్డాయి. 21

## జిల్లా మహాసభలు : జిల్లా సంఘాలు

పశ్చిమ గోదావరి జిల్లా మహాసభ 1927 లో జరిగింది. దావులూరి వరలక్ష్మమ్మ నాయకత్వాన తే 14-11-31 న గంజాం జిల్లా మహాసభలో ఆ జిల్లా స్త్రీలు సమావేశమయినారు. మూడవ గంజాం జిల్లా మహాసభ నవంబరు 1933 లోను, నాలుగవది శ్రీకాకుళంలో తే 12-11-34 నను జరిగాయి. శ్రీకాకుళం మహాసభకు 400 మంది ప్రతినిధులు వచ్చారు. 1941 లో ఏడవ మహాసభకు వడ్డాది కమలాదేవి అధ్యక్షురాలు. న్యాయపాటి రంగనాయకమ్మ ప్రతినిధులకు స్వాగతం పలికారు. హిందూధర్మశాస్త్ర

సంస్కరణను అధ్యక్షురాలు బలపరిచింది. స్త్రీ విమోచనను అధ్యయన విషయం చేయాల్సిన అవసరం ఉందని, దానికి వేరే 'కోర్సు' (Coures) ఏర్పరచాలని ఆమె అభిప్రాయ ప్రకటన చేసింది. ప్రతి మాటలో, చేతలో స్త్రీ జాతి గౌరవ ప్రతిష్టలను నిలబెట్టేలా ప్రవర్తించమని స్త్రీలకు ప్రబోధం చేశారు. ఆస్తిహక్కు విషయమై రావు కమిటీ నివేదికను బలపరిచింది మహాసభ. రైళ్ళలో స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు కావాలని, స్త్రీలకు వృత్తులనేర్పే 'పాలిటెక్నిక్' నెలకొల్పాలని తీర్మానాలను ఆమోదించారు ప్రతినిధులు.[22]

1931 లో 1933 లో కృష్ణాజిల్లా మహిళా సభలు నిర్వహింప బడినాయి.

1931 లో ఏలూరులో జరిగిన గోదావరి మహిళాసభలో చర్చకు వచ్చిన ముఖ్యాంశం పెరాకుల సమస్య. 1933 మహాసభలో సారంగ సీతాదేవి అధ్యక్షస్థానంలో కూర్చున్నారు. 20 తీర్మానాలు ప్రతినిధుల సమ్మతిని పొందాయి. హరిసింగ్‌గౌరు, హరవిలాస్ శారదా కేంద్ర శాసన సభలో తమ కృషిద్వారా స్త్రీలకు చేసిన మహోపకారానికి, సేవకు కృతజ్ఞత వెల్లడించారు మహిళలు. జీవితంలోని అన్నిరంగాలలోను స్త్రీ పురుషులకు సమాన ప్రాతిపదికపై హక్కులూ, బాధ్యతలూ ఉండాలని తీర్మానించారు.

తే 28-10-33 న కూడిన గుంటూరు జిల్లా 7 వ మహాసభకు ఆముత్తి భాస్కరమ్మ అధ్యక్షస్థానంలో ఉండి నడిపించింది. ఆమెను అఖిలభారత మహిళా సభవారు (All India women's Conference) సంఘం తరఫున ఆంధ్రలో మహిళోద్యమ కృషిని సాగించమన్నారు. ఆమె అప్పటికి 15 సంవత్సరాలనుండి ఉద్యమంలో పనిచేస్తున్నది. సి. హెచ్. చంద్రమతమ్మ ఆహ్వానసంఘం తరఫున స్వాగతం చెప్పింది. పురుషాధిపత్య సమాజపు నీతులను ఆమె నిరసించారు. పురుషుల ఎదుట నిలిచినందులకు వారిని కలుసుకొని మాట్లాడినందుకు స్త్రీలను నిందించే మనస్తత్వాన్ని ఖండించింది. పురుషుడు వెంటరాకుండ ప్రయాణం చేయలేని స్త్రీల దుఃస్థితికి ఆమె విచారం వెలిబుచ్చింది. చాలమంది స్త్రీలు కనీసం అక్షర

జ్ఞానంకూడా లేకుండా ఉన్నారని ఆమె వ్యధ చెందింది. విద్య, వరకట్నమూ బహు భార్యాత్వమూ, విడాకులూ, వారసత్వమూ, కుటీర పరిశ్రమలూ, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమూ వీటిపై ఆమె ప్రసంగించింది. ఈ దిగువ పేర్కొన బడినతీర్మానాలను ఆమోదించారు. హైస్కూలు విద్యార్థినులకు స్కూలు ఫీజు వసూలు చేయరాదు. బాలికలకు ప్రత్యేక హైస్కూలు ఏర్పాటు చేయాలి. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులుగా స్త్రీలనే నియమించాలి. వృత్తి విద్యాబోధన సాగాలి. బహు భార్యాత్వాన్ని నిషేధించాలి. వరకట్నం, ఓలి వీటిని తీసుకోరాదని శాసించాలి. స్త్రీలకు ప్రత్యేకంగా నిర్దేశించిన రైలుపెట్టెను రైలు మధ్యన తగిలించాలి. స్త్రీలకు ఆస్థివిషయంగా సర్వ హక్కులూ ఏర్పడాలి. ఇలా చాలా విలువైనవి, ముఖ్యమైనవాటిని నాటి సభలో తీర్మానించారు.

వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ 1937 లో తూర్పుకృష్ణాజిల్లా మహిళా సంఘాన్ని నిర్మించారు పామర్రులో. [23] మొదట్లో కార్యకర్తలు ధనిక స్త్రీలకు, బీద స్త్రీలకు వేరువేరుగా సమావేశాలను ఏర్పాటు చేశారు.

1939 లో దుర్గా వెంకటరమణమ్మ మహిళా సేవామండలి బందరులో స్థాపించింది. అది శాఖోపశాఖలుగా పెరిగింది. నిరక్షరకుక్షులకు చైతన్య దీప్తిని కలిగించుటకు సేవ చేస్తోంది ఆ మండలి నేటికి [24]

అప్పట్లో వారు మధ్యతరగతి స్త్రీలపై వారి దృష్టిని నిగిడ్చారు. తరువాత వ్యవసాయ కూలీ కుటుంబాలకు చెందిన స్త్రీల విషయమై శ్రద్ధ తీసుకున్నారు. పాటలు వ్రాయించారు. పూలదండల పెళ్ళిళ్ళు చేశారు, చేయించారు. 1940 లో డా॥ కొమర్రాజు అచ్చమాంబ మార్గదర్శకత్వంక్రింద కృష్ణాజిల్లాస్త్రీలు రాష్ట్ర మహిళా మహాసభను నిర్వహించారు. మహిళా కార్య కర్తలకు శిక్షణ ఇచ్చే నిమిత్తం మాసం రోజులపాటు శిక్షణ శిబిరాన్ని నడిపారు. [25]

# స్థానిక సంఘాలు

స్త్రీలకు విద్యావకాశాలు కల్పించాలని 1925 లో ముత్తా వెంకట సుబ్బారావు, ఆయన సతీమణి కలిసి సేవాసదనాన్ని ప్రారంభించారు మదరాసులో. డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి స్త్రీలకు శిశువులకు శరణాలయంగా 'అవ్వాయిహోం' ను 1930లో స్థాపించారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మినారాయణ, ఉన్నవ లక్ష్మిబాయమ్మ గుంటూరులో 'శారదా నికేతనా'న్ని నెలకొల్పారు. కొన్ని స్థానిక సంఘాల జాబితా అనుబంధంగా ఇవ్వబడింది.

## అనుబంధం

| వ. నెం. | సంఘంపేరు | స్థాపించిన ప్రదేశం | సం॥ | సంఘానికి నాయకులు, మార్గదర్శకులు | ముఖ్య కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 1. | శారదా నికేతనం | గుంటూరు | 1922 | ఉన్నవ లక్ష్మి బాయమ్మ | విధవలకు ఆశ్రయం; విద్య |
| 2. | అవ్వాయిహోం | మదరాసు | 1930 | డా॥ ముత్తు లక్ష్మిరెడ్డి | శిశురక్షణ |
| 3. | సేవాసదనం | ,, | 1925 | ముత్తా వెంకట సుబ్బారావు, అండాళమ్మ | విద్య |
| 4. | కస్తూరి విద్యాలయం | నెల్లూరు | 1923 | పొణకా కనకమ్మ | విద్య |
| 5. | ఇందిరా శరణాలయం | విజయవాడ | 1927 | తుర్లపాటి రాజేశ్వరి | శరణాలయాలు |
| 6. | హిందూ విధవా పునర్వివాహ సంఘం | నరసాపురం | 1934 | ఎ. ఎస్. చెట్టి | విధవా వివాహాలు |

| వ. నెం. | సంఘంపేరు | స్థాపించిన ప్రదేశం | సం॥ | సంఘానికి నాయకులు, మార్గదర్శకులు | ముఖ్య కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 7. | ఆంధ్రమహిళా సభ | మదరాసు | 1938 | గుమ్మిడిదల దుర్గాబాయమ్మ | విద్య; వృత్తి శిక్షణ |
| 8. | మహిళాసభ | బరంపురం | 1914 | బుర్రా బంగారమ్మ | |
| 9. | తాటికొండ మహిళా సంఘం | తాటికొండ గుంటూరు | 1942 | | |
| 10. | పశ్చిమ గోదావరి మహిళా సంఘం | ఏలూరు | 1938 | | పతనమంది రాలు సంస్క రణ వివాహాలు మంచినీరు సరఫరా |
| 11. | ఆంధ్రమహిళాసభ | రాజమండ్రి | 1932 | | సంగీతం |
| 12. | మహిళా విద్యాలయం | కాకినాడ | 1923 | | విద్య |
| 13. | శారదా సమాజం | అమలాపురం | 1918 | | మహిళాభ్యు దయం |
| 14. | సతీహిత గ్రంథాలయం | తాడేపల్లి గూడెం | 1929 | | గ్రంథాలయం |
| 15. | భారత మహిళా మండలి | విజయవాడ | 1928 | | క్లబ్, ఆటలు, మీటింగులు |
| 16. | గూడూరు స్త్రీల సహకార కుటీర పరిశ్రమల సంఘం | గూడూరు | 1939 | | కుటీర పరిశ్రమలు |
| 17. | స్త్రీ హితైషిణీమండలి | బాపట్ల | 1931 | కనుపర్తి వరలక్ష్మమ్మ | మహిళాభ్యు దయం |
| 18. | మహిళా సమాజం | మదనపల్లి | 1942 | | ,, |

| వ. సెం. | సంఘంపేరు | స్థాపించిన ప్రదేశం | సం॥ | సంఘానికి నాయకులు, మార్గదర్శకులు | ముఖ్య కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 19. | మాగంటి అన్నపూర్ణ బాలికా పాఠశాల | ఏలూరు | 1927 | | విద్య |
| 20. | మహిళా జాతీయ విద్యాలయం | కాకినాడ | 1924 | బాలాంత్రపు శేషమ్మ | విద్య |
| 21. | వైశ్య యువతీ విద్యాలయం | గుంటూరు | 1927 | కాళంగి శేషమాంబ | ,, |
| 22. | వైశ్య సేవాసదనం | రాజమండ్రి | 1920 | బత్తుల కామాక్షమ్మ | ,, |
| 23. | స్త్రీ విద్యాసమాజం | నరసారావుపేట (గుంటూరుజిల్లా) | 1938 | | ,, |
| 24. | మహాలక్ష్మి పఠనమందిరం | గుంటూరు | 1940/41 | | పఠన మందిరం |
| 25. | శ్రీ లక్ష్మి సేవాసదనం | ఏలూరు | 1934 | | |
| 26. | సాధువమ్మ సేవా సదనం | సత్తెనపల్లి | 1942 | సాధువమ్మ | వయోజన విద్య |
| 27. | మహిళా సేవా మండలి | మచిలీపట్నం | 1939 | దుళ్ళా వెంకట రమణమ్మ | |
| 28. | మాతృ మండలి | | 1938 | కామేశ్వరమ్మ కుప్పుస్వామి | కుట్టుపని |
| 29. | బాలసరస్వతి స్త్రీ సమాజం | తణుకు | 1932 | | |
| 30 | యువతీ విద్యాలయం | బాపట్ల | 1933 | వెలగపూడి సరస్వతమ్మ | విద్య |
| 31. | స్త్రీ సేవాసదనం | (ఉమ్మడి రాష్ట్రం) మదరాసు | 1949 | ఆచంట చెన్నుఘంటమ్మ | స్త్రీ జనాభ్యుదయం |

| వ. నెం. | సంఘంపేరు | స్థాపించిన ప్రదేశం | సం॥ | సంఘానికి నాయకులు, మార్గదర్శకులు | ముఖ్య కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 22. | మహిళా సేవా మండలి | మచిలీపట్నం | 1939 | దుర్గి వెంకట రమణమ్మ | విద్య |
| 23. | సీతాపుస్తక సదనం | బాపట్ల | 1935 | స్త్రీ హితైషిణీ మండలి ఆధ్వర్యంలో | విద్య |
| 24. | కూలీ రక్షణ సమితి | నెల్లూరు | 1933 | గోవిందమ్మ | స్త్రీల హక్కులు |
| 25. | శారదా గ్రంధాలయం | తాడేపల్లి గూడెం | 1948 | తేతలి సావిత్రమ్మ దామోజాపురపు లక్ష్మీనరసమ్మలు | విద్య |

## రెండవ భాగం పదమూడవ అధ్యాయం రిఫరెన్సులు


1. డా॥ ఎన్. పుతలీ కృష్ణమూర్తి పుస్తకం : 'ఆంధ్రలో స్త్రీల స్థితిగతుల మార్పు' లో పుట 286 లో పేర్కొన బడిన ముత్తు లక్ష్మీరెడ్డి స్వీయ చరిత్ర పుట 163
2. గృహలక్ష్మి 1929 పుట 1020
3. ,, 1935 ,, 921
4. ,, 1938 ,, 881
5. ,, 1940 ,, 372
6. ,, 1941 ,, 695
7. ,, 1941 ,, 901-909
8. ,, 1929 ,, 1049-53
9. ,, 1939 ,, 750
10. ముందుముల నరసింగరావు : ఏబది సంవత్సరాల హైదరాబాదు చరిత్ర. పుట 113

11. రావి నారాయణరెడ్డి 'వీరతెలంగాణా' పుట - 16

12. ,, ,, ,,

13. ముందుముల నరసింగరావు '50 సంవత్సరాల హైదరాబాదు చరిత్ర' పుట 126

14. ,, ,, ,, 135, 136

15. ,, ,, ,, 158

16. ,, ,, ,, 160

17. ,, ,, ,, 169-171

18. ,, ,, ,, 285

19. ,, ,, ,, 216, 217

20. ,, ,, ,, 319

21. గృహలక్ష్మి 1941 పుట 274

22. ,, ,, ,, 549-551

23. (1977) ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య సావనీరు. పుట 7
గుజ్జుల సరళాదేవి వ్యాసం

24. (1977) ఆం. ప్ర. మహిళా సమాఖ్య సావనీరు పుట 35
చండ్ర సరస్వతీదేవి వ్యాసం

25. ఆంధ్రమహిళా దర్శిని. పుట 32 (వనితా జ్యోతి ప్రచురణ)

# 3 వ భాగం

# ఆందోళన, తిరుగుబాటుల కాలం [1943-52]

## 1 వ అధ్యాయం :

### ఈ కాలపు విలక్షణ స్వభావం

బ్రిటను, ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, రష్యా కలసి మిత్రరాజ్యాలుగా ఒకవైపున, జర్మనీ, ఇటలీ, జపానులు అక్షరాజ్యాలుగా పేర్కొనబడి మరియొకవైపున ఘోరంగా యుద్ధం చేస్తున్నపుడు, ఆ యుద్ధాన్ని, ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమంగా అభివర్ణించారు. 1942 లో జపాను సైన్యాలు అస్సాం సరిహద్దుల దాకా వచ్చాయి. ప్రజాస్వామ్య వాదులు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని బలపరచదలిస్తే, మహాత్మగాంధీ నాయకత్వాన జాతీయ వాదులు, బ్రిటిషు వారినుండి స్వాతంత్ర్యం సంపాదించటానికి అనువైన సమయంగా భావించారు. 'నా శత్రువుయొక్క శత్రువు నా స్నేహితుడు' అనే సూత్రాన్ని ఆమోదించారు జాతీయవాదులు. మహాత్మా గాంధీ క్విట్ ఇండియా ఉద్యమం ఆ భావం వల్ల ప్రభావితమయింది. ఏదైనా, మహారాష్ట్రలో సతారా జిల్లా తప్ప తతిమ్మా చోట్ల ఆ ఉద్యమం నీరు కారిపోయింది. భారత ప్రజానీకంలో భావ ప్రకటనా శక్తి కల వారు దరహంమీద తీవ్రమైన అసంతృప్తితో కుమిలిపోయారు. ఇది జీవితంలోని అన్ని రంగాలకు పాకింది. కార్యాచరణకు ఉద్యమించే కాంగ్రెసు వారు రహస్యంగా వ్యవహరించసాగారు. తతిమ్మా కాంగ్రెసువారు శాంతియుత చర్య మొదలగాని ఏ విధమైన నిర్మాణంపై కాని ఉత్సాహం ప్రదర్శించలేదు. తెలుగు దేశంలో కమ్యూనిస్టులు మాత్రమే కాంగ్రెసు తరువాత పెద్ద రాజకీయ శక్తిగా ఉండేవారు. వారికి ఈ పరిస్థితిలో ఎదురులేకపోయింది. 1941 డిశంబరు నుండి వారు యుద్ధానికి అనుకూలమైన వైఖరిని ప్రదర్శించారు.

అయినా జాతీయ స్రవంతి నుండి వారు వేరువడ తలచలేదు. కనుకనే "కాంగ్రెసు - లీగు ఐక్యత", "జాతీయ ప్రభుత్వము" లాంటి నినాదాలను ఇచ్చారు. జాతీయ వాదానికి ప్రజలలో ఉన్న అనుకూల్యతను వాడుకోదలిచారు. కొంతవరకు కృత కృత్యులయినారు. కాని పరిస్థితులు జాతీయ వాదులకు అనుకూలంగా పరిణమించాయి. కేంద్రంలో 1946 లో కాంగ్రెసు-లీగు ప్రభుత్వం ఏర్పడింది. తే 15-8-47 న ఇండియా, పాకిస్థానులు స్వతంత్ర దేశాలుగా అవతరించాయి. 1948 సంవత్సరంలో కమ్యూనిష్టు ఉద్యమంలో పెద్ద మలుపు వచ్చింది. వారి కలకత్తా మహాసభలో రుడనావ్ పాలసీని కమ్యూనిష్టులు ఆమోదించారు. వారు తిరుగుబాటుకు పూనుకున్నారు. 'తెలంగాణా పోరాటము' నే దానిని చేపట్టారు. మరల 1952 ఎన్నికలలో పాల్గొన దలిచేవరకు ఆ పోరాటాన్ని కొనసాగించారు. అలా 1948 - 52 మధ్యకాలపు స్వభావము ఆందోళన, తిరుగుబాటులు.

ఆ కాలంలోని ముఖ్య శక్తి కమ్యూనిస్టులని చెప్పినంత మాత్రాన తతిమ్మావారు అంటే జాతీయ వాదులు, ప్రజాస్వామ్య వాదులు రంగంలో లేరనికాదు. వారుకూడ కార్యరంగంలోనే ఉన్నారు. అయినా తెలంగాణా పోరాట భావన తెలుగు ప్రాంతాన్ని ఆవరించిందని చెప్పటంలో అతిశయోక్తి లేదు. ఖమ్మం, వరంగల్, నల్గొండ, మెదకు, కరీంనగరు జిల్లాలకు మాత్రమే 4 వేల గ్రామాలకు మాత్రమే అది పరిమితమయి ఉండవచ్చును. కాని ఆ పోరాట ప్రతిధ్వనులు ఇరవైకి పైగా ఉన్న తెలుగు జిల్లాలలో వినిపించాయి.

# 2 వ అధ్యాయం : కమ్యూనిస్టు ఉద్యమం

ఆ కాలపు భావనను కమ్యూనిస్టు ఉద్యమం ముఖ్యంగా ప్రభావితం చేసిందని అంగీకరిస్తే ఆ ఉద్యమం యొక్క బలాన్ని మదింపు వేయటం అవసరం. తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా,గుంటూరు, నెల్లూరు జిల్లాలు ఉద్యమానికి బలమైన కేంద్రాలు. అలాగే ప్రక్కప్రక్కన ఉన్న ఖమ్మం, వరంగల్, నల్గొండ, కరీంనగర్ జిల్లాలు దానికి పెట్టని కోటలు.

రావి నారాయణరెడ్డి నాయకత్వాన తెలంగాణా కమ్యూనిస్టులు 'ఆంధ్ర మహాసభ' లో 1941 నుండి పనిచేస్తుండేవారు. ప్రజానీకంలో వారు గ్రామస్థాయిలో పనిచేసి బలపడ్డారు. రైతుసంఘం ద్వారా రైతులను సంఘటితం చేశారు. ఆ రైతు సంఘాన్ని ప్రజలు 'సంఘం' అని పిలిచే వారు. ఆనాడు తెలంగాణాలో దేశముఖులు, భూస్వాములు ('దొరలు') ఉండేవారు. వెట్టిచాకిరీ, బలవంతపు చాకిరి సర్వసామాన్యం. బీద రైతాంగం భూస్వాముల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతికే వారు. క్షణంలో వారి భూములను భూస్వాములు ఆక్రమించుకొని వారిని వ్యవసాయ కూలీలుగా మార్చివేయుటం కద్దు. ఆ బీద ప్రజల స్త్రీల మానమర్యాదలకు ఎప్పుడూ ప్రమాదమే.

కమ్యూనిస్టుల నాయకత్వాన సంఘం రైతుల సమస్యలను చేపట్టింది. ప్రభుత్వ బంజరు భూములను ఆక్రమించి దున్నేవారికి ఇవ్వాలని, కవులు దార్ల ను భూములనుండి భూస్వాములు తొలగించరాదని, రైతుల భూములను భూస్వాములు ఆక్రమించరాదని ఆనాడు ఇచ్చిన నినాదాలు. వాటి ప్రాతిపదిక మీద ప్రజలను సమీకృతం చేయడం సంభవించింది.[1]

ముండ్రాయి, పాలకుర్తి గ్రామాల పోరాటాలు, చరిత్రాత్మకమైనవి. వాటిలో ప్రజలు భూస్వాముల జంట్లనూ, పోలీసులనూ ఇద్దరినీ ఎదిరించారు. 1000 మంది కార్యకర్తలపై క్రిమినలు కేసులు పెట్టబడినయి; ఇది గమనార్హము. [2]

కడవెండి గ్రామంలో భూస్వాముల గూండాలు తే 4-7-1946 న కొమరయ్య అనే ప్రజానాయకుని హత్యచేశారు. ఆ సంఘటన ప్రజలను ఉద్రిక్తపరిచింది. జమీందారును ప్రజలు సాంఘికంగా వెలివేశారు. అతని వ్యవసాయపనులను స్తంభింపచేశారు. బాలేముల, పాత సూర్యాపేట పోరాటాలు ప్రసిద్ధి చెందాయి. ప్రజలు నిజాం ప్రభుత్వ పోలీసులను ఎదిరించి నిలిచారు. 1946 డిసెంబరులో మల్లారెడ్డి గూడెం ప్రజల పోరాటం ప్రాముఖ్యత కలది. అందులో ప్రజలు నిజాంమిలిటరీని ప్రతిఘటించారు. [3]

1946 నవంబరులో కమ్యూనిస్టు పార్టీని నిజాం నిషేధించాడు. 1947 నుండి ప్రజలు ఆయుధాలు చేపట్టారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన విముక్తి పోరాటం సాగించారు. ప్రజాబలాలు మూడు రకాలుగా ఉండేవి. గెరిల్లా దళాలతో కూడినది మొదటివి. గ్రామరక్షణ దళాలతో ఏర్పడింది రెండవది. విధ్వంసక దళాలు మూడవ కోవకు చెందినవి. 100 మంది వరకు ఉండే 'కంపెనీ' ల స్థాయివరకు వచ్చింది గెరిల్లా దళం నిర్మాణం. [4] నాలుగువేలమంది గెరిల్లాలు, 1500 మందితో కూడిన గ్రామరక్షకదళం, 15 వేల మంది విధ్వంసకదళ సభ్యులు సాయుధపోరాటంలో పాల్గొన్నారు. [5]

నాలుగువేల గ్రామ కమిటీల నిర్మాణం జరిగింది. వేల ఎకరాల ప్రభుత్వ బంజరు భూములను, భూస్వాముల మిగులు భూములు ప్రజలకు పంపిణీ చేయబడినయి. ఋణపత్రాలు అగ్నికి ఆహుతి అయినయి. ప్రజా శత్రువుల భూమిని, వ్యవసాయ పనిముట్లను, గొడ్లను, ధాన్యపు కొట్లను ప్రజలు స్వాధీన పరచుకున్నారు. [6] ఎక్కడ చూచిన సంఘ పరిపాలనే; సంఘ రాజ్యమే.

కేంద్రంలో పరిపాలిస్తున్న కాంగ్రెసు ప్రభుత్వం పోలీసు చర్య ద్వారా నిజాం సంస్థానాన్ని ఆక్రమించుకున్నది. దీంతో కమ్యూనిస్టు

పార్టీలో భేదాభిప్రాయాలు ఉద్భవించాయి. రావి నారాయణరెడ్డి నాయకత్వాన ఒకవర్గం పోరాటాన్ని ఆపుదామంటే సుందరయ్య నాయకత్వాన మరో వర్గం పోరాటాన్ని కొనసాగించ దలిచింది. రజాకర్లతో, నిజాం పోలీసు పటాలాలతో పోరాటం సాగించిన 'సంఘం' భారత ప్రభుత్వ సైన్యపు దెబ్బను తట్టుకోలేక పోయింది. చివరకు 1951 సెప్టెంబరులో సాయుధ పోరాటం విరమింపబడింది. రావి నారాయణరెడ్డి అంచనా ప్రకారం పోలీసు చర్య (Police Action) తర్వాత ప్రజలు పోరాటంలో పాల్గొనడం మానివేశారు. 7

రావి నారాయణరెడ్డి కథనం ప్రకారం తెలంగాణా పోరాటం ఫలితాలు ఇలా ఉన్నాయి :-

భూమి దున్నేవారు భూమికి యజమానులు అయినారు. ప్రభుత్వ పోరంబోకులు, బంజరు భూములు లక్షల కొలదీ ఎకరాలు ఆక్రమించిన వారికి దక్కాయి. జాగీరుదారీ పద్ధతి పోయింది. కవులు దార్లకు అనుకూలంగా కవులు చట్టం వచ్చింది. వేల ఎకరాలను భూస్వాములు నామ మాత్రపు ధరలకు కవులు దార్లకువిక్రయించారు. భూస్వాముల చేతులలో భూమి కేంద్రీకృతం కావడం ఆగింది. వెట్టిచాకిరీ పద్ధతి పోయింది. భూస్వాములకు చేసే నిర్బంధ ఉచిత చాకిరీని రద్దుచేశారు. నిజాం పరిపాలన అంతరించింది. తెలంగాణా పోరాటమే లేకుంటే నిజాం సంస్థానం స్వతంత్ర రాజ్యంగా కొనసాగేది. భూసంస్కరణల అంశాన్ని ఈ పోరాటం ఎజెండా మీదికి తెచ్చింది. భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణానికి బలం చేకూర్చింది. 8

సుందరయ్య అంచనా వేరు. తమ స్వాధీనంలో ఉన్న భూములను నిలబెట్టుకోవటం, ప్రభుత్వ బంజరు భూములను ఆక్రమించుకోవడానికి హక్కు సంపాదించుకోవటం ఈ రెంటిపరకే ప్రజలు ఎదగ గలిగారు. 1953 లో అమలులోకి వచ్చిన కనీస కూలిరేట్లను డిమాండు చేసే స్థితికి వచ్చారు. 1973 లో కూడా పరిస్థితి ఇలాగే ఉంది. 9

పోలీసు చర్య తరువాత కూడా సుందరయ్య, ఆయన సహచర వర్గం విముక్తి కోసం సాయుధ పోరాటాన్ని కొనసాగించారు. ప్రజలు సాధించిన విజయాలను నిలబెట్టుకునే నిమిత్తం మాత్రమే పోరాటాన్ని కొనసాగించి ఉండవలసిందని తరువాత - అంటే - పోరాటం విరమించి సమీక్ష చేసుకున్న తరువాత - చెప్పారు. అయితే రష్యా కమ్యూనిస్టు పార్టీ అధినేత స్టాలినుతోను ఆదేశ ఇతర పార్టీ నాయకులతోను సంప్రదించిన తరువాతనే పోరాటాన్ని విరమించారు. [10]

ఎన్నికలలోకి కమ్యూనిస్టులు దిగిన తరువాత హైదరాబాదు శాసన సభలో మూడింటిలో వారు వారి మిత్రులు 50 స్థానాలను గెలుచుకున్నారు. 14 లోక్ సభ స్థానాలలో ఏడు వారి వశమయినాయి. కేంద్రంలో పార్ల మెంటులో 29 మంది కమ్యూనిస్టులు ఉంటే అందులో 19 మంది తెలుగు దేశం నుండి ఎన్నికయినారు. ఇది నిజంగా కమ్యూనిస్టు పార్టీపై అభిమానానికి నిదర్శనం కాదు. ప్రజలలో ఉన్న కాంగ్రెసు వ్యతిరేక భావ ఫలితం. ఏదైనా 1952 లో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ శక్తిగా కమ్యూనిస్టు పార్టీ రూపొందినదనేది సత్యం.

## మూడవబాగం రెండవ అధ్యాయం రిఫరెన్సులు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | వీర తెలంగాణా : రావినారాయణరెడ్డి (1972) | | పుట | 47 |
| 2. | ,, | ,, | ,, | 47 |
| 3. | ,, | ,, | ,, | 52 |
| 4. | ,, | ,, | ,, | 58 |
| 5. | ,, | ,, | ,, | 62 |
| 6. | ,, | ,, | ,, | 65 |
| 7. | ,, | ,, | ,, | 75 |
| 8. | ,, | ,, | ,, | 78 |
| 9. | 'వీర తెలంగాణా : విప్లవ పోరాటం' సుందరయ్య | | పుట | 503 |
| 10. | ,, | ,, | ,, | 501, 502 |

# 3 వ అధ్యాయం : పోరాడే స్త్రీలు

స్త్రీలు తెలంగాణా పోరాటంలో పెద్దఎత్తున పాల్గొన్నారు. ఊరేగింపులలో వారు అగ్రభాగాన ఉండేవారు.[1] వారు భూమికోసం పోరాడారు. భూస్వాముల భూములను గొర్లను పంపిణీ చేసుకోవటంలో పాల్గొన్నారు. పురుషులతోపాటు సమాన వేతనాల కోసం పోరాడారు.

ఐలమ్మ పేరు తిరుగుబాటుకు మారుపేరయింది. ధనవంతులూ సంపన్నులూ అయిన భూస్వాములపై పేదల పోరాటానికి ఆమె ప్రతీకగా నిలిచింది. భూస్వామి ఆమె భూమిని లాగుకొన ప్రయత్నిస్తే ఆమె దానిని నిలుపుకోవటానికి ప్రయత్నించింది. గట్టిగా ప్రతిఘటించి నిలిచింది. ఆమె విజయం సాధించింది. బీదరైతులను ఆమె కథ ఉత్సాహపరిచింది. వారి ప్రతిఘటనా శక్తిని రేకెత్తించింది. ఆమె ధైర్యం ఇతర స్త్రీలలో ఉత్సాహాన్ని పురికొల్పింది; వారు ఆమె మార్గాన్ని అనుసరించారు. కష్టజీవుల అందరి ఇండ్లలోనూ ఆమెపై వ్రాయబడిన పాటలు మార్మోగేవి.[2] అలాగే మిరియాలగూడా తాలూకా ముకుందాపురపు కుమ్మరి మట్టయ్య భార్య, వాదపల్లి లంబాడి స్త్రీ, కొండ్రపోలులో భూస్వాముల ఏజంట్ల చేత ఖూనీ చేయబడిన లంబాడీల భార్యలు తమ భర్తల స్థానాలను ఆక్రమించి తమ భూములను కాపాడుకున్నారు. ముద్దులకుంట, వీరవరంలలో కొందరు స్త్రీలు అలాగే చేశారు; వీరవరంలోని స్త్రీని పోలీసులు బూటు కాళ్ళతో త్రొక్కి చంపారు.[3] మల్లారెడ్డి గూడెంలో పోలీసులు లెవీధాన్యాన్ని బలవంతంగా వసూలు చేయటానికి వస్తే వరదాస్త్రీలు ప్రతిఘటించారు.[4] ఇల్లెందు, పిండిప్రోలు తాలూకాలలో 90 గ్రామాలలో ఎక్కువ వేతనాల కోసం వ్యవసాయ కార్మికులు సాగించిన పోరాటంలో స్త్రీలు ముందు పీఠిన నిల్చారు.[5]

## పురుషులను నిర్బంధంనుండి వదిలించుకొనుట

పోలీసులు మిలటరీ పురుషులను అరెస్టు చేసినపుడల్లా వారిని నిర్బంధంనుండి వదిలించుకోవటానికి స్త్రీలు ముందుకు ఉరికేవారు. పోలీసు 'వ్యాను' మిలటరీ 'ట్రక్కును' చుట్టుముట్టి గ్రామస్థులతో నిండివున్న వాటిని గ్రామంనుండి స్త్రీలు కదలనిచ్చేవారు కాదు.

ప్రతి ఘటనకు పూనుకునే స్త్రీల సంఖ్య అనేక వందలలో ఉండేది. పైగా పట్టుదల వారిసొమ్ము. అందువలన వారికి విజయాలు లభించేవి. అలాంటి సంఘటనలు హుజూర్ నగరం తాలూకా విజయనగరంలోను, 6 మిర్యాలగూడెం తాలూకాలోను జరిగాయి. 7

## పోరాటంలో పురుషులకు సహాయం

పురుషులు తమ పాతకాలపు ఆయుధాలతో (వడిసెలలు, బరిసెలు) పోలీసులతో, మిలటరీతో పోరాటానికి దిగినపుడు స్త్రీలు పురుషుల సరసన నిల్చొని వారికి సహాయం చేశారు. పాత సూర్యాపేటలో పురుషులకు వడిసెలలోకి రాళ్ళను అందించారు మిలటరీమీద విసరటానికి. అప్పుడు అనేకమంది స్త్రీలు అరెస్టు చేయబడ్డారు. 8 దేవరుప్పుల గ్రామంలో భర్తకు రాళ్ళు అందిస్తున్న స్త్రీ మిలటరీ తుపాకి గుండ్లకు బలి అయి నేల కొరిగింది. 9 బాలెంపల్లి, మల్లారెడ్డిగూడెం పోరాటాలలో స్త్రీలు ఉద్యమానికి ఎనలేని సేవచేశారు. 10

## మాన సంరక్షణలో

రజాకర్లతో, నిజాం పోలీసులతో, మిలటరీతో పోరాటాలు సాగినపుడు దుష్టశక్తులు అణచివేతకు, పైశాచికానికి స్త్రీలను ఎంపిక చేసుకునేవి. స్త్రీల మాన సంరక్షణ కష్టమయ్యేది. స్త్రీలను అవమాన పరుస్తారని, ఎత్తుకొని వెళ్తారని, చెరుస్తారని స్త్రీలు భయపడేవారు. తమ మాన సంరక్షణార్థం స్త్రీలు అనేక చర్యలను తీసుకోవలసి వచ్చేది. వరిపొలాను

ఇరవై మంది స్త్రీలు కలిసి రాత్రిళ్ళు ఒకచోట వరుండేవారు. [11] ప్రొద్దుటూరు గ్రామంలో మిలటరీవారు స్త్రీలను ఎత్తుకొని పోవటానికి ప్రయత్నించారు. గ్రామంలోని స్త్రీలందరూ మిలటరీ వ్యానును చుట్టుముట్టి కదలనీయక వారి అక్కచెల్లెండ్రను రక్షించుకున్నారు. మానుకోట తాలూకా మల్లాపురం గ్రామంలో అలాంటి సంఘటనే జరిగింది. మిర్యాలగూడెం తాలూకా మధురా గూడెం గ్రామంలో స్థానిక కార్యకర్త భార్యను పోలీసులు ఎత్తుకొని పోతే ఆమె తనను బంధించిన వారిని గోళ్ళతో గీరి, పళ్ళతో కొరికి తప్పించుకొని పారిపోయి వచ్చింది. [12] భట్టు వెంకన్న బావితండాలో మిలటరీ దుర్మార్గ చర్యలను స్త్రీలు సమష్టిగా ఎదిరించారు. జలాల్‌పురం, [13] తిరుమలగిరి, కోయగూడెం, సెరిజాల, మానుకోట తాలూకాలోని చెట్ల ముప్పారం, ఖమ్మం తాలూకా పమ్మి గ్రామాదులలో ఇలాంటి వీరోచిత చర్యలను స్త్రీలు చేశారు. [14]

## వార్తాహరులు (COURIERS)

రాజకీయ చైతన్యం కల చాలమంది స్త్రీలు 'కొరియర్లు' గా పని చేశారు; వెనుకబడిన వారుగా పరిగణింపబడే షెడ్యూలు జాతుల స్త్రీలు కూడా వార్తాహరులుగా (కొరియర్లు) పనిచేసి తెలంగాణా ఉద్యమానికి ఎనలేని సేవచేశారు. [15] ఆ సందర్భంగా రాములమ్మ పేరు విస్మరించరానిది. [16] సావిత్రమ్మ ఒక దళనాయకునికి 'కొరియరు' గా పనిచేసింది. ఆమెను అనేక పర్యాయాలు అరెస్టు చేశారు పోలీసులు. ఒకసారి ఆమెను ఘోరంగా చిత్రహింస చేశారు. ఆమె దళ నాయకుని ఉనికిని నివాసాన్ని తెలియ జేయలేదు. అలా ఆమె దళ నాయకునే కాక పార్టీ ప్రాంతీయ కార్యాలయాన్ని కాపాడింది. [17] పూసలవల్లి తండాకు చెందిన లచ్చక్క క్రమ శిక్షణతో పని చేసిన 'కొరియరు' తరువాత ఆమె ఒక దళ నాయకుని వివాహమాడింది. [18]

## కాపలావార్లుగా

పోలీసువారు, మిలటరీ వారు గ్రామాలపై దాడులు చేసేవారు. ముందుగా తెలిస్తే జాగ్రత్త పడతారు ప్రజలు. అందువలన ప్రతిఘటన దళాలు ప్రత్యేకంగా కాపలా దళాలను నిర్మించవలసి వచ్చింది. ఆ పనిలో స్త్రీలు ప్రముఖమైన పాత్ర నిర్వహించారు. అడవులలో పురుషులతో కలిసి నివసించేవారు. కేంద్రాల భద్రతకు బాధ్యత వహించేవారు. ముఖ్య కార్యకర్త కేంద్రానికి తిరిగి రాకపోతే ప్రమాద సూచిగా సంకేతాన్ని నెలకొల్పేవారు. [19]

## రక్షణ ఇచ్చేవారుగా

దళాల నాయకులకు, ప్రాంతీయ నాయకులకు కేంద్ర కమిటీ సభ్యులకు రక్షణ ఇచ్చే బాధ్యతను ఐచ్ఛికంగా స్త్రీలు చేపట్టారు తమ తమ ధన మాన ప్రాణాలకు ప్రమాదమున్నప్పటికీ. ధైర్య సాహసాలు ప్రదర్శించి, కొన్ని సందర్భాలలో యుక్తియుక్తంగా ప్రవర్తించి నాయకులను స్త్రీలు రక్షించుకున్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. [20]
నేరెడ గ్రామంలో వెంకయ్య, అనంతయ్య, సీతయ్య వారి కుటుంబ స్త్రీలు రోశమ్మ, లచ్చమ్మ, నాంచారమ్మలను పోలీసులు ఇలాంటి సందర్భాలలో అమానుషంగా కొట్టారు; హింసించారు. అలా జరిగినా, వారు రక్షణ ఇచ్చిన దళ నాయకుని రహస్యం బయట పెట్టలేదు. [21] మట్టికొంప ఇళ్లు పార్టీ కార్యకర్తలకు రక్షణ కేంద్రంగా ఉండేవి. [22] ఒక గ్రామంలో దళ నాయకునికి స్త్రీ వేషం వేయించి ఆ గ్రామస్త్రీలు అతనిని కాపాడారు. సూర్యాపేట తాలూకా వల్లభాపురం గ్రామంలో రక్షణ ఇచ్చిన పురుషులను మిలటరీ చంపివేసింది. అయినా వారి స్త్రీలు పార్టీని వదలిపెట్టలేదు. [23] సుందరయ్యను కాపాడే నిమిత్తం ఒక గర్భిణీ స్త్రీ తెల్లవార్లూ కాపలా కాసింది. [24]

## ఆహారాన్ని సమకూర్చేవారుగా

ఆహారవస్తువుల సరఫరా, రవాణా సౌకర్యాలు లేనిది ఏ సైన్యమూ పోరాడలేదు. గెరిల్లా సైన్యానికీ ఈ సూత్రం వర్తిస్తుంది. ధైర్య సాహసాలతో స్త్రీలు ఆహార సముపార్జన చేసి దళాలకు తిండి పెట్టకుంటే పోరాటం పూర్తి 5 సంవత్సరాలు సాగివుండేది కాదు. ఈ విషయంలో వారి పాత్ర చిరస్మరణీయం. ఆ విధ్యుక్త ధర్మ నిర్వాహణలో స్త్రీలు అవమానాలకు గురి అయినారు. చిత్రహింసలకు సిద్ధపడ్డారు. చివరకు మరణానికి వెరవలేదు. అపూర్వమైన ధైర్యాన్ని అనితరమైన మహత్తర త్యాగాన్ని ప్రదర్శించిన సంఘటనలు ఉన్నాయి. జైనాబీ రాజారాం గ్రామంలో ఒక కార్మిక స్త్రీ దళానికి ఆమె ఆహారాన్ని అందించేది. మిలటరీ వారి చిత్రహింసలను భరించింది కాని దళ నాయకుని రహస్య స్థావరాన్ని తెలియజేయలేదు.[25] నందిగామ తాలూకాలోని చొప్పకొండ్ల గ్రామంలోని ధనిక రైతుభార్య వెంకమ్మ గెరిల్లాలకు ఆహారము, మందులు అందించేది. ఆమెను మిలటరీ వారు చెరిచారు. ఆమె విషం తిని ఆత్మహత్య చేసుకున్నది.[26] మేళ్ళ చెరువు గ్రామవాసి వడెగపాటి నాగమ్మ గెరిల్లా దళాలకు ఆహారం అందించే బాధ్యతను తనంత తాను తీసుకున్నది. మిలటరీ ఆమెను పట్టుకుంది. మూడురోజులు ఆమెను చిత్రహింస చేసింది. ఆమె ఒక్క రహస్యాన్ని కూడా బయట పెట్టలేదు. చివరకు గడ్డివాములో వడవేసి ఆమెను కాల్చి చంపారు.[27] బెండలపూడికి చెందిన బూదెమ్మ గెరిల్లా దళానికి వస్తు సరఫరా చేసేది. ఆమెను బందీగా పట్టుకున్నారు శత్రువులు. ఆమెను ఘోరంగా హింసించారు, చెరిచారు. చివరకు ఆమెను తుపాకితో కాల్చి చంపారు.[28]

## గెరిల్లాలుగా

స్త్రీలను గెరిల్లా దళాలలో చేర్చుకోవటానికి కమ్యూనిస్టు పార్టీ పాలసీ వ్యతిరేకంగా ఉండి. ధైర్య సాహసాలను ప్రదర్శించిన కొందరు స్త్రీలను దళాలలో చేర్చుకోక తప్పలేదు. అలాంటి వారికి మిలటరీ శిక్షణ ఇవ్వ

బడింది. వారికి రాజకీయ ప్రబోధం అందించడమైనది. కొన్ని సందర్భాలలో వారు కార్యరంగంలోకి దుమికారు. గోదావరి నది ప్రక్క నున్న అడవులలో స్త్రీలు అనేక బాధ్యతలు నిర్వర్తించారు. వారిలో 3 మంది గెరిల్లాలు, 15 మంది కొరియర్లు, ఇద్దరు దళ ఉపనాయకులు, ఇద్దరు ఆర్గనైజర్లు, మరి పదిమంది దళ సభ్యులుగా ఉన్నారు.[29] వీరిలో ఎక్కువమంది కోయస్త్రీలు. కోయలచ్చక్క స్టెన్ గన్‌తో నలుగురు పోలీసులను చంపింది. పోరాటంలో ఆమె చనిపోయింది. నల్గొండ తాలూకా చెరుకుపల్లికి చెందిన రామలక్ష్మి,[30] లింగమ్మ, తిరుపతమ్మ, నరసమ్మ, వెంకటమ్మ అలాంటి గెరిల్లాలలో ముఖ్యులు.[31]

## గ్రామకమిటీల సభ్యులుగా

పోరాట సందర్భంగా స్త్రీ పురుష సమానత్వ భావాలు వ్యాప్తి చెందాయి. అదీగాక స్త్రీలు పురుషుల సరసన పోరాడుతున్నారు. కష్టాలలో నష్టాలలో, త్యాగాలలో వారు పురుషులకు అండగా నిలిచారు. అందువలన వారికి గ్రామకమిటీలలో సమాన హోదా లభించుట విశేషం కాదు. తగినంత సంఖ్యలో స్త్రీలు గ్రామకమిటీలకు ఎన్నుకోబడేవారు.[32] విడాకులు, బలవంతపు పెళ్ళిళ్ళను ఆపుచేయటం, ఒక పురుషుడు మరొకని భార్యతో లేచిపోవటం లాంటి సమస్యలను ఈ గ్రామ కమిటీలు పరిష్కరించేవి.

## రహస్య స్థావరాలలో

ప్రాంతీయ, కేంద్ర నాయకుల నివాసాలుగా ఉన్న రహస్య స్థావరాలనే తమ నివాసాలుగా చేసుకున్నారు కొంతమంది స్త్రీలు. ఆ స్థావరాల నుండే పార్టీ కార్యాలయాలు పనిచేసేవి. కార్యాలయాలు నడపటానికి, సర్క్యులర్లు, నివేదికలు, దస్త్రావేజులు, కరపత్రాలు వీటికి కాపీలు రాయటానికి వారు కష్టపడి విధి నిర్వహణ చేసేవారు. ఉత్తర ప్రత్యుత్తరాల పని అంతా వారిదే. ఆయుధ కర్మాగారంలో పనిచేసి తుపాకి మందు తయారు చేసేవారు. అరెస్టు, చిత్రహింసలు, ప్రాణహాని వీటికి సిద్ధపడి కృషి చేసేవారు.[33]

నాయకులుగా

మళ్లి స్వరాజ్యం ఆయుధం పట్టింది. కోయవారిని సంఘటిత పరిచింది. ఆమె ప్రాంతీయ కమిటీ సభ్యురాలయింది.[34] ఇద్దరు ముగ్గురు స్త్రీలు దళాలకు ఉపనాయకులయినారు. తిరుపతమ్మ అనే స్త్రీ రాజకీయ పక్షంలో పని చేసింది.[35]

## మొక్కవోని త్యాగంతో, పట్టువిడని పార్టీయెడ విశ్వాసంతో

వేలమంది స్త్రీలు పోలీసులచేత దెబ్బలు తిన్నారు. వారిని పోలీసులు మిలటరీ వారు చిత్రహింసల పాలు చేశారు; దూషించారు, అవమానించారు. స్త్రీలను బెదిరించి లొంగదీసుకోవటానికి పోలీసులు, మిలటరీ వారు పాల్పడిన చర్యలు ఘోరాతి ఘోరమైనవి; దుర్మార్గమైనవి. అంతకుమించి క్రూరాతి క్రూరమైనవి. నేరెడలో 70 మంది స్త్రీలను పేముబెత్తాలతో కొట్టారు. స్త్రీలకు లాగులు తొడిగించి వారి లాగులలోకి తొండలను వదలిపెట్టి లాగుల మూయకట్టించి వాటిచేత కరిపించారు. స్త్రీలకు దెబ్బల వల్ల గాయాలయితే గాయాలపై కారం చల్లారు.[36] రంగపూర్‌కు చెందిన ఎర్రమ్మను, ఆమె కుమార్తెను మంగళ్ళ చేత తలలు గొరిగించి అవమానించారు. తరువాత వారిని కొట్టారు.[37] చాకలి అచ్చమ్మను దిగంబరం చేసి తల్లి క్రిందుగా చెట్టుకు వ్రేలాడతీసి దుర్భరంగా కొట్టారు పోలీసులు.[38] పిల్లలకు పాలివ్వనీయలేదు తల్లులను.[39]

## మానభంగాలకు లోనయి

పురుషాధిపత్యానికి ప్రతీకగా చెరచటం తరతరాలుగా నిలిచిపోయింది. అంతేగాక స్త్రీలను లొంగదీసుకోవటానికి ఆయుధంగా యుగయుగాలుగా వాడబడింది. ఈ వ్యాధిగత మనస్తత్వాన్ని పోలీసులూ, మిలటరీ వారూ అలవరచుకున్నారు. అదే జరిగింది తెలంగాణా పోరాట కాలంలో. ఈనాటి మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, ఆనాటి తెలంగాణా పోరాట నాయకుడు సుందరయ్య లెక్కప్రకారం 1948 నుండి

1951 వరకు వేలమంది స్త్రీలు మిలటరీ వారిచేత చెరచబడ్డారు. 1946-48 లో ఒక వెయ్యిమంది స్త్రీలు మానభంగాలకు గురి అయినారు.[40] 1947 నుండి 1948 వరకు ఒక వెయ్యిమంది స్త్రీలు ఈ దుశ్చర్యకు బలి అయినారు. ఈ దుర్మార్గ భయానక కథను సుందరయ్య పుస్తకంలో వివరంగా రాయబడింది.[41] గర్భిణీ స్త్రీలు, 10 ఏండ్ల బాలికలు, రెండు మూడు రోజుల క్రింద ప్రసవించిన స్త్రీలు వీరందరూ ఆ దుష్ట ప్రవర్తనవల్ల అమానుషంగా హింసించబడినారు. మూక ఉమ్మడి మానభంగాలు కూడా జరిగాయి.[42] ఒక గ్రామంలో మానభంగం చేయబడిన స్త్రీల సంఖ్య 70 కి చేరింది.[43]

అనేకమంది స్త్రీలను కాల్చి చంపారు పోలీసులు, మిలటరీ వారు. చాలామంది చనిపోయారు పోలీసుల చేతుల్లో. అనేకమంది లాఠీ ఛార్జికి గురి అయినారు. వరంగల్ జైలులో స్త్రీ ఖైదీలపై లాఠీఛార్జి చేస్తే రామబాయమ్మకు దెబ్బలు తగిలినందున ఆమె చనిపోయింది.[44]

ఎన్నో ఇళ్ళను నేలకు కూల్చారు రజాకరులు, పోలీసులు, మిలటరీ. పంటలను ధ్వంసం చేశారు. స్త్రీ పురుషులు గ్రామాలను వదిలిపెట్టి భద్రత కోసం పారిపోయారు. కాని పోరాట పటిమ సడలించనందువలన స్త్రీలు ధైర్యంగా నిలబడ్డారు. వారు భయపడలేదు. పోలీసుల, మిలటరీ వారి బెదిరింపులకు లొంగలేదు. మొదట్లో 'సంఘానికి' తరువాత పార్టీకి అండగా నిలిచారు. పోరాటపు మొదటి రోజుల్లో శత్రువుల కళ్ళల్లో కారం చల్లేవారు; వారికి కళ్ళు కనపడకుండా చేసేవారు. తరువాత ఎత్తుగడలు మారాయి. కొన్ని పేర్లను ఉటంకించవచ్చు. ఆడివమ్మ, అల్లుడితో సంబంధాలు తెగతెంపులు చేసుకున్న లింగమ్మ, తన ఇల్లును రక్షణ నిలయంగా మార్చిన సూరేపల్లి (ఖమ్మం జిల్లా) కి చెందిన మల్లికాంబ, కుమారులను మనుమలను పార్టీసేవకు పంపించిన మంగ్గ వీరవనితలు. ముదుసలి స్త్రీలు కరపత్రాలు పంచేవారు. పోరాటాలలో పాల్గొనమని యువకులను హెచ్చరించేవారు. తెలంగాణాలో ఆనాడు తిరుగుబాటు, ప్రతిఘటన భావాలు విజృంభించాయి.

# మూడవభాగం మూడవ అధ్యాయం రిఫరెన్సులు

1. 'వీర తెలంగాణ విప్లవ పోరాటం' సుందరయ్య పుట - 47

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2. | పుట | 43, 44 | 24. | పుట | 408 |
| 3. | ,, | 405, 408 | 25. | ,, | 409 |
| 4. | ,, | 40 | 26. | ,, | 413 |
| 5. | ,, | 313 | 27. | ,, | 425 |
| 6. | ,, | 354 | 28 | ,, | 423 |
| 7. | ,, | 404, 405 | 29. | ,, | 423 |
| 8. | ,, | 55, 58 | 30. | ,, | 425, 426 |
| 9. | ,, | 59 | 31. | ,, | 420-424 |
| 10. | ,, | 404 | 32. | ,, | 149 |
| 11. | ,, | 60 | 33. | ,, | 426 |
| 12. | ,, | 417 | 34. | ,, | 420 |
| 13. | ,, | 418 | 35. | ,, | 421 |
| 14. | ,, | 101 | 36. | ,, | 407 |
| 15. | ,, | 425 | 37. | ,, | 412 |
| 16. | ,, | 420 | 38. | ,, | 408 |
| 17. | ,, | 421, 422 | 39. | ,, | 407 |
| 18. | ,, | 424, 425 | 40. | ,, | 416 |
| 19. | ,, | 428 | 41. | ,, | 415-417 |
| 20. | ,, | 408 | 42. | ,, | 418 |
| 21. | ,, | 411 | 43. | ,, | 415 |
| 22. | ,, | 411, 412 | 44. | ,, | 413 |
| 23. | ,, | 407 | | | |

# 4 వ అధ్యాయం : సామాజిక సంస్కరణ

ఈకాలంలో స్త్రీలు ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు ఆధ్వర్యాన, కమ్యూనిస్టుల ఆధ్వర్యాన సంఘటిత మయినారు. హిందూ లా ప్రకారం కుటుంబాస్తిలో స్త్రీలకు హక్కులుండాలనే ఆందోళనకు మద్దతుగా 40 వేల దస్కతులను కమ్యూనిస్టు ప్రభావం క్రింద పనిచేసిన మహిళా సంఘాలు పోగుచేసాయి. 1944 లో బి. ఎన్. రావు కమిటీ హిందూ ధర్మశాస్త్ర సవరణకు నివేదికను సమర్పించిన విషయం సర్వులకూ విదితమే. 38 బహిరంగ సభలలో 48 వేలమంది స్త్రీలు ఆ సంస్కరణ ప్రతిపాదనలను బలపరిచారు. కోస్తా జిల్లాలోని మహిళా సంఘాలు స్త్రీలలో జాగృతి కల్పించడానికి కార్యక్రమాలు చేపట్టాయి. 1944 నాటికే డా॥ కొమర్రాజు అచ్చమాంబ (విజయవాడ) నాయకత్వాన ఆమెవల్ల ఉత్తేజితులైన స్త్రీలు కుటుంబ నియంత్రణ ప్రచారం చేశారు. పురుషాధిపత్యంగల జమిందారీ సమాజపు ప్రాతిపదికనే అనేక మంది స్త్రీలు ప్రశ్నించసాగారు. స్త్రీలలో స్వాతంత్ర్యేచ్ఛ, స్వావలంబనభావం పెరిగాయి. తెలుగు దేశపు చరిత్రలో మొదటి సారిగా 'కాకీ' దుస్తులు ధరించిన 150 మంది స్వచ్ఛంద సేవికులు విజయవాడలో విన్యాసాలు చేశారు.

సనాతన భావాలపై సంప్రదాయంపై తిరుగుబాటు, సత్యాన్వేషణా శక్తి, తిరుగుబాటు మనస్తత్వము తెలంగాణా పోరాట కాలంలో పెరగడం సహజమైన పరిణామమే. ఈ కాలంలో వివాహం, విడాకులు, పునర్వివాహం వీటి తాలూకు సమస్యలు ప్రజల దృష్టికి వచ్చాయి. భార్యాభర్తల తగాదాలు అనేకం ప్రజల పంచాయితీల ముందుకు వచ్చేవి. భార్య భర్తతో కలసి కాపురం చేయ దలచక పోతే ఆమె తల్లిదండ్రులకు భర్తచే చెల్లింపబడిన ఓలిని తిరిగి ఇవ్వాలి సంప్రదాయ ప్రకారం. కొన్ని కేసులలో

కొన్ని సందర్భాలలో ఓలి తిరిగి చెల్లించడానికి భార్యలు నిరాకరించేవారు. కొన్ని సందర్భాలలో సమస్య చిక్కులతో కూడి ఉండేది. స్త్రీ పురుషులు సమానులని, తగాదాలను ఆ సూత్ర ప్రాతిపదికపై పరిష్కరించుకోవాలని పార్టీ - కమ్యూనిస్టు పార్టీ - పంచాయితీలు తగవులోని ఇరుపక్షాలవారికి తెలియజెప్పేవి. ఏదైనా ప్రజలను పార్టీకి ఎదురు తిరిగేటట్లు చేసే తీర్పు మాత్రం ఇవ్వబడేది కాదు.[1]

ఒక ధనిక రైతుభార్య భర్తతో కాపురం చెయ్యనన్నది. వ్యవసాయ కార్మిక కుటుంబానికి చెందిన పురుషునితో కాపురం చేస్తానన్నది. కమ్యూనిస్టు పార్టీ వారి కోర్టు ఆమెకు విడాకులు ఇచ్చి ఆమె పునర్వివాహం చేసుకోవడానికి అనుమతి ఇచ్చింది. పోలీసులకు మిలటరీకి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన పురుషుల భార్యలను తిరిగి పెండ్లాడమని పార్టీ ప్రోత్సహించింది. పునర్వివాహం పాపం కాదని, మొదటి భర్త మీద విశ్వాసం లేకుండుట కానే కాదని పార్టీ ప్రచారం చేసింది.[2]

ఇంతగా పార్టీ కృషి చేస్తున్నా వికృతికి మారుపేరైన నరసమ్మ అనే వీరాంగన పార్టీకి లేఖ రాసింది. ఆ లేఖలో ఈ ప్రశ్నలను లేవనెత్తింది :-

స్త్రీలను దళాలలో ఎందుకు చేర్చుకోరు?

పొరపాట్లు - చిన్న చిన్న పొరపాట్లు - చేసిన స్త్రీలపట్ల పురుష కామ్రేడ్లు ఎందుకు చులకనగా నీచంగా మాట్లాడుతారు?

స్త్రీ పురుషునికన్న తక్కువ అనే భావం మగ కామ్రేడ్లకు పోలేదని ఆమె ఫిర్యాదు చేసింది.[3]

పోరాట కాలంలోఎంతో మార్పు వచ్చినా పోరాటపు వ్యూహం, ఎత్తుగడలు కమ్యూనిస్టుల కార్యక్రమాలపై విశేష ప్రభావం కలిగి ఉండేవని

తెలుపుతున్నది. అంటే పరిస్థితులను బట్టి సామాజిక సంస్కరణ కార్యక్రమాన్ని వాయిదా వేయడం జరిగిందని, ప్రజల మానసిక స్థాయికి ప్రాధాన్యత ఇచ్చినట్లు కన్పడుతున్నది.

## మూడవ భాగం నాలుగవ అధ్యాయం రిఫరెన్సులు

1. తెలంగాణా విప్లవ పోరాటం : కామ్రేడ్ సుందరయ్య (1972) పుట 427
2. ,, ,, ,, 427
3. ,, ,, ,, 428

# 5 వ అధ్యాయం : సామాజిక శాసనాలు

హిందూ ధర్మశాస్త్రాన్ని పూర్తిగా మార్చాలని కేంద్ర ప్రభుత్వం తలచింది. అందుకొరకు ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ 'హిందూకోడ్ బిల్లు' అనే పేర బిల్లును సమర్పించింది. కేంద్రంలో ఏర్పడిన కాంగ్రెసు- లీగు ప్రభుత్వం ఆ బిల్లుకు శాసన రూపం ఇవ్వాలని భావించింది. హిందూ సంఘంలోని సనాతన సంప్రదాయ శక్తులు భారీ ఎత్తున వ్యతిరేక ప్రచారం సాగించాయి. అందువల్ల హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ జరుగలేదు. అయినప్పటికీ ముక్కలు ముక్కలుగా 'హిందూ లా' ను సవరించుటకు చర్యలు తీసుకో బడ్డాయి.

## హిందూ వివాహిత స్త్రీల ప్రత్యేక నివాసం మరియు మనవర్తి శాసనం - 1946

1946 ఏప్రిల్ లో హిందూ వివాహిత స్త్రీల ప్రత్యేక నివాస మరియు మనవర్తి శాసనం (1946 లోని 19 వ కేంద్ర శాసనం) అమలులోకి వచ్చింది. ఏ పరిస్థితులలో హిందూ స్త్రీ భర్తకు దూరంగా వేరుగా కాపురముండ వచ్చునో, మనవర్తి కోరవచ్చునో అందులో ఉటంకించ బడినాయి. అప్పుడప్పుడు మారే స్వభావంకల కోర్టు తీర్పులపై ఆధారపడవలసిన అవసరాన్ని తొలగించిన ఈ శాసనము స్త్రీలకు శుభప్రదం; ప్రయోజనకరం. ఆమెకు ఆ హక్కును కల్పించే పరిస్థితులు ఏమంటే :-

1) భార్యవల్ల సంక్రమింపబడక భర్త అసహ్యకరమైన వ్యాధి వల్ల బాధపడుతుంటే,

2) ఆమె అతనితో కాపురం చేయటము వాంఛనీయం కాకుండుట లేక ఆమె భద్రతకు భంగకరంగా ఉండుట అనే పరిస్థితి అతని క్రూర పరిస్థితి వల్ల సంభవించినపుడు,

3) ఆమె సమ్మతి లేకుండా, ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా ఆమెను వదలివేసినపుడు, ఆమెను పోషించనపుడు,

4) భర్త మరల వివాహమాడితే

5) భర్త మరో మతాన్ని స్వీకరిస్తే

6) అతడు అలవాటుగా ఉంపుడుకత్తెతో కాపురముంటుంటే లేక ఉంపుడు గత్తెను తన ఇంట్లోనే అట్టే పెట్టుకుంటే

7) ఇతర న్యాయమైన కారణమున్నపుడు

భార్య మతాంతరురాలైనా, వ్యభిచారి అయినా, లేక భర్తతో కాపురం చేయుమని కోర్టువారు ఉత్తరువులిచ్చినా వాటిని ఆమె నిరాదరణ చేస్తే ఆమెకు మనవర్తి లభించదు. మనవర్తి ఏ సూత్రాల ప్రకారం ఇవ్వాలో శాసనంలో పొందుపరచ బడింది. దంపతుల జీవనస్థాయి, భర్త సంపాదన లెక్కకు వస్తాయి మనవర్తిని లెక్కకట్టడంలో.

## హిందూ వివాహ సంబంధ అనర్హతల తొలగింపు చట్టం 1946 (కేంద్రశాసనం : 1946 లోని 28)

ఈ శాసనం 1946 నవంబరు 22 న అమలులోకి వచ్చింది. సగోత్ర వివాహాలు, ఒకే ప్రవరకు చెందిన వారి మధ్య పెండ్లిండ్లు, ఒకే కులానికి చెంది, వివిధ శాఖలకు వధూవరులు చెందిన వివాహాలు చెల్లుతాయని ఈ చట్టపు సారాంశం. ఇది పెద్ద ముందడుగు కాదు కాని మొత్తంమీద కొంతవరకు వాంఛనీయమే.

## 1949 లోని 21 వ కేంద్రశాసనం

ఈ శాసనం, హిందువులు, శిక్కులు, జైనులు, వారి వర్ణాలు, ఉప వర్ణాలు, కులాలు, శాఖలు మధ్య జరిగే వివాహాలు చెల్లుతాయని ప్రకటిస్తుంది.

అంతవరకూ కోర్టులు ప్రకటించిన ప్రకారము 'పై' కులపు మగవానికి 'క్రింది' కులపు ఆడవానికీ మధ్య జరిగే వివాహం మాత్రమే చెల్లేది. 'అగ్ర' వర్ణానికి చెందిన స్త్రీకి 'హీన' వర్ణానికి చెందిన పురుషునికి జరిగే వివాహం ధర్మశాస్త్ర విరుద్ధమని న్యాయస్థానాలు తీర్పులు చెప్పాయి. ఆ పరిస్థితి నింద్యమయినందున దానిని అంతం చేయడానికి ఈ శాసనం వచ్చింది. ఇది కులతత్వానికి దెబ్బగా పరిగణించాలి. ఎందుకంటే వివాహంపై ఆంక్షలు విధించడం కులతత్వ లక్షణం కనుక. ప్రత్యేక వివాహ శాసనం (1872 సంవత్సరపు 3 వ శాసనం) చాల వరకు సహాయకారిగా ఉన్నది. వివాహానికి పార్టీలైన ఇద్దరూ హిందూ పార్శీ బౌద్ధ జైన మతాలకు చెందక పోయినా, లేక అందులో ప్రతి ఒక్కరు ఏదీ పైన ఉటంకించబడిన మతాలకు చెందినా ఈ శాసనం వర్తిస్తుంది. రిజిష్ట్రారుకు ముందుగా నోటీసు ఇచ్చి వివాహం చేసుకోవాలి. గడువు 14 రోజులు. కనీస వయః పరిమితి వరునికి 18, వధువుకు 14 సంవత్సరాలు. 21 సంవత్సరాలలోపు వారికి తండ్రిలేక సంరక్షకుని అనుమతి కావాలి. కాని బాల విధవకు తండ్రి అనుమతితో పనిలేదు.

అలా 1872 లోని ప్రత్యేక వివాహ శాసనం వలన, 1949 లోని 21 వ శాసనం వలన అంతర్వర్ణ వివాహాలు శాసన బద్ధం చేయబడినాయి. వివాహ విషయంలో అమలులో వున్న దుష్టమైన ఆంక్షలను అతిక్రమించడానికి అభ్యుదయగాములైన స్త్రీ పురుషులకు అలా అవకాశం, వెసులు బాటు కలిగాయి.

## 1937 నాటి హిందూస్త్రీల ఆస్తిహక్కు చట్టపరిధి సవరణ (1947)

ఫెడరలు కోర్టు తీర్పు దృష్ట్యా హిందూస్త్రీల ఆస్తిహక్కు చట్టపు పరిధి కేంద్ర ప్రభుత్వానికి కేటాయించబడిన అంశాలకే పరిమితమయింది. అంటే వ్యవసాయం రాష్ట్రాల అధికారులకు చెందినది కనుక ఆ శాసనం వ్యవసాయ భూములకు వర్తించదు. అంటే పొలాలలో స్త్రీలకు వాటాలు

రాలేదు. కనుక సమష్టి మదరాసు రాష్ట్ర శాసనసభ ఈ శాసనాన్ని చేయువలసి వచ్చింది. ఈ చట్టం 1948 నుండి అమలు లోకి వస్తుందని దానిలో వ్రాశారు.

## మదరాసు హిందూ బహుభార్యాత్వ నిషేధశాసనం 1949 (1949 లోని 6 వ శాసనం)

హిందువులలో బహు భార్యాత్వాన్ని నిషేధించటానికి, హిందువులకు విడాకుల సౌకర్యం కలుగ జేయుటానికి ఈ శాసనం ఉద్దేశింప బడింది. ఈ శాసనానికి పూర్వం హిందూ పురుషుడు ఎంతమంది నైనా స్త్రీలను భార్యలుగా కలిగి యుండవచ్చును. ముస్లిం ధర్మశాస్త్ర ప్రకారం ఒక ముసల్మాను పురుషుడు ఏక కాలంలో నల్గురు భార్యలను కలిగి యుండ వచ్చును. హిందూ పురుషునికి అలాంటి ఆంక్ష లేనందున అది చాల వైపరీత్యాలకు అన్యాయాలకు దారితీసింది. స్వాతంత్ర్య సమరయోధుడూ, సంఘ సంస్కర్తా అయిన అయ్యదేవర కాళేశ్వరరావు సమష్టి మదరాసు రాష్ట్ర శాసన సభలో ఈ బిల్లును ప్రతిపాదించాడు. 2 వ సెక్షను 2 వ క్లాజులో ఒక వివరణ ఇచ్చారు. దాని ప్రకారము మతరీత్యా ముసల్మాను, క్రైస్తవుడు, పార్శీ, యూదుకానివాడు హిందువే. ఇది గమనార్హం. మొట్టమొదటిసారిగా తొమ్మిది సందర్భాలలో హిందూ స్త్రీకి విడాకులు పొందే అవకాశం లభించింది.

వివాహితులలో ఏ ఒక్కరైనా ఈ దిగువ పరిస్థితులలో విడాకులను కోరవచ్చును.

I) భర్త మరో స్త్రీని ఉంపుడుగత్తెగా ఉంచుకుంటే,

II) భార్య మరో పురుషుని ఉంపుడు గత్తెగా ఉంటుంటే, లేక ఆమె వ్యభిచార జీవితం గడుపుతుంటే,

III) పిటీషను పెట్టేనాటికి మూడు సంవత్సరాలు ముందుగా అవిచ్ఛిన్నంగా రెండోవారిని వదిలి పెట్టే,

IV) రెండవ వారు పిటీషనరు యెడల క్రూరంగా ప్రవర్తించినపుడు పిటీషనరు కాపురం కొనసాగించుట జీవితానికి ప్రమాదకారి అయినపుడు,

V) పిటీషను పెట్టే నాటికి వరుసగా 5 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా రెండవ వారు మనశ్చాంచల్యం కలిగి ఉంటే,

VI) పిటీషను పెట్టేనాటికి వరుసగా 5 సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా రెండవ వారు తీవ్రమయిన, నయముకు కానటువంటి కుష్టువ్యాధితో బాధ పడుతుంటే,

VII) పిటీషను పెట్టే నాటికి వరుసగా 5 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా రెండవవారు అంటువ్యాధిగా ఉండే సుఖవ్యాధితో బాధపడుతుంటే, (ఆ వ్యాధి పిటీషనరు వల్ల రెస్పాండెంటుకు అంటియుండరాదు)

VIII) పెండ్లినాటికి నపుంసకత్వంతో ఉండి పిటీషను పెట్టేనాటికి కూడా ఆ స్థితి కొనసాగుతుంటే,

IX) మరో మతంలోకి మారినందున హిందువుగా లేకపోతే, విడాకులకు అవకాశం ఇవ్వబడింది. (Note : anotherline) భర్త ఈ శాసనానికి ముందు మరో స్త్రీని వివాహమాడి యున్నాడని, ఆ సవితి ఇంకా జీవించి యున్నదని భార్య రుజువుచేస్తే ఆమెకు విడాకులు లభిస్తాయి.

1955 లో దేశం మొత్తానికి వర్తించే శాసనం అంటే "హిందూ వివాహ శాసనం 1955" అమలులోకి వచ్చే వరకు సమష్టి మదరాసు శాసనం అమలులో ఉంది. రాష్ట్రంలోని హిందూ కుటుంబ జీవితం కూలిపోతుందని సనాతనులు ప్రచారం చేశారు. కాని అలాంటిది సంభవించలేదు. విడాకుల కొరకు దరఖాస్తుల సంఖ్య సంవత్సరానికి కొన్ని వందలలోనే ఉండేది. శాసనం ముందడు వేసింది. కాని సామాజిక వ్యవస్థ వెనకకు లాగు తున్నందున స్త్రీలు ఈ శాసనం వల్ల కలిగిన లాభాలను, వెసులుబాట్లను అనుభవించలేక పోయారు.

# 6 వ అధ్యాయం : వోటు

అక్షరాస్యత ప్రాతిపదికగా 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్ట ప్రకారం 1946 లో కేంద్ర శాసనసభకు ఎన్నికలు జరిగాయి. ఆస్తితో కాని మరే ఇతర అర్హతతో కాని సంబంధం లేకుండా ఇంగ్లీషు లేక మరే భారతీయ భాషలోనైనా సరే సంతకం పెట్టగలవారికి వోటుహక్కు ఇచ్చారు. ఈ చర్య ఫలితంగా లక్షలాది స్త్రీలు వోటర్లు అయినారు. జాతీయ సమస్యపైన తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి వారికి అవకాశం లభించింది 1946 ఎన్నికలలో స్త్రీ పురుష వివక్ష లేదు. జాతీయ వాద భావాలు కల అభ్యర్థులు, వారి లింగ భేదాలతో నిమిత్తం లేకుండా, ఎన్నికయినారు. ఎక్కువమంది స్త్రీలు ప్రాధాన్యతమనే అంశంపై తప్ప ఎన్నికలు స్త్రీలకు సంబంధించి లేవు. ఎందుకంటే స్త్రీల సమస్యలు, లేక అభ్యర్థులు స్త్రీల శ్రేయస్సుకు అనుకూలురు లేక ప్రతికూలురనిగాని ఎన్నికలలో సమస్యలుగా పరిణమించలేదు. రాజకుమారి అమృతకౌర్ లాంటి మహిళోద్యమాభిమానులు ఎన్నికయారు. ఇది తృప్తిని కలిగించే విషయం. 1950 నాటికి రాజ్యాంగం ప్రకారం పురుషులతో పాటు 21 సంవత్సరాలు దాటిన స్త్రీలకు వోటు వచ్చింది 1952 లో. కాని దాని వల్ల పరిస్థితిలో ఏమీ మార్పులేదు. స్త్రీలకు సంబంధించి 1946 ఎన్నికలకు 1952 ఎన్నికలకు తేడా లేదు.

# 7 వ అధ్యాయం :

## మహిళా పత్రికా ప్రపంచం

1948 లో జోస్యభట్ల వెంకట సుబ్బమ్మ 'ఆంధ్రవనిత' పత్రికను స్థాపించింది. ఆమె ఒక కార్మిక నాయకుని భార్య. ఆమె స్వతహాగా కమ్యూనిస్టు.

1947 లో మదరాసులో ప్రారంభింపబడిన 'మాతృభూమి' పత్రికకు కేలూరి సహజానంద, శ్రీ రాజ్యం సిన్హా సహాయ సంపాదకులు. ఈ పత్రిక స్త్రీల సమస్యలకు ఎంతో ప్రాముఖ్యత ఇచ్చేది. [1]

1947 లో సమష్టి మదరాసు రాష్ట్ర సంక్షేమ శాఖవారు 'సౌభాగ్య' పత్రిక ప్రచురణ మొదలిడినారు. న్యాయపతి కామేశ్వరి (ఆమె రేడియో అక్కయ్యగా ప్రసిద్ధి కాంచింది) 1947 లో 'బాల' అనే పిల్లల పత్రికా ప్రచురణ ఆరంభించారు. [2]

1942 లో గుమ్మిడిదల దుర్గాబాయమ్మ 'ఆంధ్రమహిళ' ను నెలకొల్పారు. [3] 1964 వరకు అది ప్రచురిత మయింది. లక్ష్మీరఘురాం, చెన్నపుంటమ్మ, మాలతీ చందూర్, కె. రామలక్ష్మి ఆ పత్రికకు వేరు వేరు కాలాల్లో సంపాదకులుగా పని చేశారు. స్త్రీ స్వాతంత్ర్య యోధులు కమవర్తి వరలక్ష్మమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ ఆ పత్రికలో వ్యాసాలు రాసేవారు. 'ఆంధ్ర మహిళాసభ' అనే గుమ్మిడిదల దుర్గాబాయమ్మచే స్థాపించబడిన సంస్థ కార్యకలాపాల ప్రచురణయే కాక ఆ పత్రిక స్త్రీలలో జాగృతికి ఎంతో ఉపకరించింది. ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు వారు చేపట్టిన కార్యాల విషయంగా ప్రజల సహకారం లోపిస్తున్నదని ప్రభుత్వ సహకారం

లభించటంలేదని ఆ పత్రిక వ్యథ వెలిబుచ్చింది. మహిళోద్యమ వ్యాప్తికి సమర్థవంతులైన కార్యకర్తలు దొరకడం లేదని ఆ పత్రిక గమనించింది. శాసన సభలోని స్త్రీ సభ్యులు స్త్రీలకు సంబంధించిన ఉపయోగకర కార్య కలాపాలను ప్రభుత్వానికి ఎందుకు సిఫారసు చేయుటం లేదని పత్రిక ప్రశ్నించింది.

అంతర్జాతీయ కార్మిక మహాసభలో సమానమైన పనికి సమానమైన వేతనం ఇవ్వాలనే విషయం చర్చకు వచ్చింది. అది స్త్రీలకు లాభకరం. ఆ సమస్య చర్చకు వచ్చినపుడు భారత దేశ ప్రతినిధి తటస్థంగా ఉండడం జరిగింది. 1951 డిసెంబరు సంచికలో 'ఆంధ్ర మహిళ' ఈ అంశాన్ని ప్రస్తావించి ప్రభుత్వ ప్రతినిధి చర్యను నిరసించింది. పార్లమెంటుకు, రాష్ట్ర శాసనసభలకు జరిగే ఎన్నికలలో స్త్రీ అభ్యర్థుల సంఖ్య చాల తక్కువగా ఉన్నదని ఆ పత్రిక వ్యాఖ్యానించింది. 4 వేల మంది అభ్యర్థులలో స్త్రీలు 60 మంది మాత్రమే. పత్రిక స్త్రీల మహాసభలను గురించి నివేదికలను ప్రచురించేది. స్వాతంత్ర్యానికి పూర్వం స్త్రీలకు 'గృహలక్ష్మి' పత్రిక చేసిన సేవను స్వాతంత్ర్యానంతరం 'ఆంధ్ర మహిళ' కొనసాగించింది.

## మూడవ భాగం ఏడవ అధ్యాయం రిఫరెన్సులు

1. గృహలక్ష్మి 1947 పుట 112
2. ,, ,, ,, 118
3. 'దుర్గాబాయి దేశముఖ్ జీవితచరిత్ర' : నేతి సీతాదేవి : పుట 175

# 8 వ అధ్యాయం : మహిళా సంఘాలు

## జాతీయస్థాయి

ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్ వారి 18 వ మహాసభ తే 28-12-45 నుండి తే 1-1-46 వరకు సికిందరాబాద్‌లో జరిగింది. 177 మంది ప్రతినిధులు వచ్చారు. హన్సా మెహతా అధ్యక్షత వహించింది. ఆదుర్తి భాస్కరమ్మ, నేత చంద్రిమతమ్మ, కొండా పార్వతీ దేవి ఆంధ్ర ప్రతినిధులలో ముఖ్యులు. గర్భిణీ స్త్రీలతో సహా స్త్రీ పురుషులకు సామాజిక జీవిత భీమా విధానం, వయోజనులకు వోటుహక్కు, హిందూ 'లా' సవరణ, ఉద్యోగాలు చేసే స్త్రీలకు వసతి గృహాలు, గృహ విజ్ఞానంపై పాఠ్యవిషయం ఇవన్నీ కావాలని మహాసభ తీర్మానాలను ఆమోదించింది. [1]

కాంగ్రెసు మహిళలకు మద్రాసులో శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. [2]

ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్ 21 వ మహా సభకు గ్వాలియరు కేంద్రమయింది 1949 లో. ఊర్మిళా మెహతా అధ్యక్షోపన్యాసం చేసింది. మహారాణి మాయారాజ్ సింధియా ఆహ్వాన సంఘాధ్యక్షురాలు. మహా సభలో మొత్తం ముఫై తీర్మానాలు అంగీకార యోగ్యత పొందాయి. వాటిలో అధిక సంఖ్య కలవి సామాజిక అంశాలకు సంబంధించినవే. మహా సభ ఎక్కువగా సామాజిక అంశాలపై దృష్టిని సారించింది. రాజకీయ సమస్యలు కూడా చర్చకు రాకపోలేదు. అయితే వాటిపై భిన్నాభిప్రాయ ప్రకటన జరిగింది. [3]

వివాహం, విడాకులపైన దేశం మొత్తానికి వర్తించేలాగున ఒక శాసనం రూపొందాలని డిమాండు చేస్తూ 1952 లో ఒక మహా విజ్ఞాపన

పత్రాన్ని తయారు చేశారు. దానిని కేంద్ర ప్రభుత్వానికి సమర్పించారు. దానిపైన సుచేతాకృపలానీ, ఉమా నెహ్రూ, తారకేశ్వరిసిన్హా, గంగాదేవి, ఇందిరా మాయాదేవి, అన్నా మె స్కార్ఫ్, రేణూ చక్రవర్తి ప్రభృతులు పదకొండుమంది పార్లమెంటు సభ్యులు సంతకాలు చేశారు. 4

## రాష్ట్రస్థాయి

17 వ ఆంధ్రరాష్ట్ర మహిళాసభ రాజమండ్రిలో నిర్వహించబడింది. 1945 వ సంవత్సరపు నివేదికను ఆమోదించారు. గనులలో స్త్రీ కార్మికులు పని చేయరాదనే ఆంక్షను ప్రభుత్వం తొలగించినందుకు నిరసనగా బెజవాడ, (విజయవాడ) గుంటూరులలో నిరసనసభలు జరిగాయి. నివేదిక ఉత్సాహ జనకంగా లేదు. గుంటూరు, బాపట్ల తాడేపల్లి గూడెంలలోని సంఘాల కార్య కలాపాల వివరణ మాత్రం ఉంది. రాజమండ్రి సభ రాష్ట్ర సంఘ నిబంధనావళిని మార్చింది. ఎన్నికలు ప్రతి సంవత్సరం కాక మూడు సంవత్సరాల కొకసారి జరగాలన్నారు. రాష్ట్ర శాఖకు ఎక్కువ స్వాతంత్రం ఇవ్వాలని సభికులు అభిప్రాయపడ్డారు. ఈ మహాసభను విమర్శిస్తూ 'ఆంధ్రమహిళ' లో ఓ. కామేశ్వరమ్మ ఒక వ్యాసం రాశింది. 5 దాని సారాంశం ఆసక్తిదాయకం. క్రీడలకు, వినోద కార్యక్రమాలకు ఎక్కువ కాలం కేటాయించారు. వాతావరణ స్వరూపం మారిపోయింది. అంతకు క్రితం ఒక భార్యను కలిగియున్న పురుషుని పెండ్లాడిన స్త్రీకి సభ్యత్వం నిరాకరించడం (ఈ మార్పు డా॥ కొమర్రాజు అచ్చమాంబను సంస్థలోనికి రానీయకుండ చేసే నిమిత్తం సూచింపబడి ఉండవచ్చును ॥ రచయిత) మంచి పని కాదు. అన్ని రాజకీయ అభిప్రాయాలు కలవారికి సంఘంలో స్థానం ఉండాలి.

ఆంధ్రలోని కాంగ్రెసు మహిళలు నెల్లూరులో 1946 సెప్టెంబరులో సమావేశమయ్యారు. రుక్మిణీ లక్ష్మీపతి అధ్యక్షపీఠం అలంకరించింది. మద్యపాననిషేధాన్ని, అస్పృశ్యతానివారణాన్ని, హిందూ ముస్లిం ఐక్యతను కోరుతూ తీర్మానాలు ఆమోదం పొందాయి. 6 18 వ నిజాం రాష్ట్ర మహిళా

మహాసభ 1946 లో జరిగింది. ఆంధ్రలోని కమ్యూనిస్టు స్త్రీలు 1947 వరకు ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సులో పనిచేశారు. బహుశః 1946 రాజమండ్రి మహాసభ తీర్మానం (అంతకు క్రితం ఒక భార్యను కలిగి ఉన్న పురుషుని వివాహమాడిన స్త్రీకి సభ్యత్వం లేదని ఆ తీర్మాన సారాంశం) తెగతెంపులకు కారణభూతమయి ఉండవచ్చును. నిస్సందేహంగా కమ్యూనిస్టు మహిళల నాయకురాలు డా॥ కొమర్రాజు అచ్చమాంబయే. ఆమెకు సభ్యత్వం లేకుండా చేసే పరిస్థితి వచ్చింది. (ఆమె భార్య ఉన్న పురుషుని వివాహమాడింది). కమ్యూనిస్టు మహిళలు ప్రథమరాష్ట్ర మహాసభను గుంటూరు జిల్లా చిలువూరులో నిర్వహించుకున్నారు. వారి లెక్కప్రకారం 450 మంది ప్రతినిధులు 7 జిల్లాలనుండి హాజరయినారు. 6 వేల మంది స్త్రీలు బహిరంగ సభలకు వచ్చారు. 6 జిల్లాశాఖలు, 100 గ్రామ శాఖలు ఉన్నాయి. 250 మంది కార్యకర్తలు ఉన్నారు. సభ్యుల సంఖ్య 25000.

ద్వితీయ మహాసభ విజయవాడలో 1948 లో జరిగింది. సభ్యుల సంఖ్య 40, 000 పెరిగిందని నివేదిక ఇచ్చారు. ప్రతినిధుల సంఖ్య 500, జిల్లాకలెక్టరు వద్దకు ఊరేగింపు తీశారు. 75 మంది మహిళలను అరెస్టు చేశారు అధికారులు.

కమ్యూనిస్టు మహిళలు ఇచ్చిన లెక్కల ప్రకారం. 800 మంది కార్యకర్తలకు 1948 లో శిక్షణ ఇవ్వబడింది. 150 మంది స్వచ్ఛంద సేవికలు నిక్కరులు చొక్కాలు ధరించి ఊరేగారు. బెంగాలు క్షామనిధికి విరాళాలు పోగుచేశారు. బియ్యం, కిరసనాయిలు సక్రమంగా పంపిణీ కావటానికి దోహదం చేశారు. అఖిలభారత రైతు మహాసభ బెజవాడలో జరిగితే 20, 000 మంది స్త్రీలు హాజరయినారు. స్త్రీల హక్కులను బలపరిచారు కమ్యూనిస్టు మహిళలు. వెయ్యిమంది స్త్రీలు, చంకలో పిల్లలను వేసుకొని, ఊరేగారు. బి. ఎన్. రావు కమిటీ నివేదికను బలపరుస్తూ 50 వేల దస్కతులు సేకరించారు. 1946 లో జరిగిన 66 బహిరంగ సభలలో 46 వేలమంది స్త్రీలు పాల్గొన్నారు. గుంటూరులో 10 వేలమంది పొగాకు

కంపెనీలలో పనిచేసే స్త్రీ కార్మికులు సమ్మె చేశారు. వెయ్యిమంది కార్మిక స్త్రీలు పికెటింగులో పాల్గొన్నారు. 80 మంది అరెస్టయారు. ఇవి మహత్తర కార్య కలాపాలు. కమ్యూనిస్టు మహిళలలో చైతన్యవంతులు కుటుంబ నియంత్రణ ప్రచారం చేశారు. అఖిల భారత రైతు మహాసభ సందర్భంగా ఏర్పాటైన ప్రదర్శన శాలలో కుటుంబ నియంత్రణ ప్రదర్శన శాల పెట్టారు. 1948 లో మాత్రమే విజయవాడలో కార్యాలయాన్ని నెలకొల్పుకోగలిగారు. వీరేశలింగం రాసిన ప్రహసనాలను ప్రదర్శించారు. గ్రామాలలో స్త్రీలకు మరుగుదొడ్ల నిర్మాణం కొరకు ఆందోళన చేశారు. “ప్రసూతి : శిశుపోషణ” అనే అచ్చమాంబగారి గ్రంథం వేలసంఖ్యలో అమ్మారు. వట్టికొండ విశాలాక్షి రాసిన పాటలు పాడారు. విజయవాడలో ‘భారత మహిళా మండలి’ లో చేరి ఆ సంఘం ద్వారా పనిచేశారు. ప్రచారం కోసం బుర్రకథలను నాటకాలను వినియోగించారు. శ్రామిక మహిళలకు చేరువయ్యారు.

1951 లో ఆంధ్రరాష్ట్ర మహిళాసభ జరిగింది. పొణకా కనకమ్మ అధ్యక్ష స్థానంలో కూర్చున్నది. అప్పటి అనేక అభిప్రాయాలు వెల్లడి అయినాయి. శాంతిని సహకారాన్ని మహిళోద్యమం మాత్రమే రక్షించగలదు. మహిళా సంఘాలు అన్నీ కలిసి ఒక ఫెడరేషనుగానో కాన్ ఫెడరేషనుగానో నిర్మించుకోవాలి. స్త్రీలకు ప్రయోజనకరంగా ఉండే శాసనాలకు సనాతనులు, మతమౌఢ్య శక్తులు ప్రతిబంధకాలుగా తయారయినారు. హిందూ కోడ్ బిల్లు కూడా ఆశించినంతగా అభ్యుదయకరంగా లేదు. స్త్రీ విద్యను వయోజన విద్యలో భాగంగా కూడ పరిగణించాలి. [9]

## జిల్లాస్థాయి:

జిల్లా కమిటీలు, జిల్లా మహాసభల చర్చల సరళిని గమనిస్తే జిల్లా స్థాయిలో మహిళల ఆలోచనా రీతి తెలుస్తుంది.

పశ్చిమ గోదావరి జిల్లా కార్య నిర్వాహక వర్గం బి. ఎస్. రావు కమిటీ నివేదికను బలపరిచింది. వ్యవసాయ భూములకు హిందూస్త్రీల ఆస్తి హక్కు చట్టాన్ని వర్తింపచేయాలని కోరింది. ప్రతి తాలూకాకు ఒక హైస్కూలును, ప్రతి జిల్లాకు ఒక కాలేజీని మహిళలకు ప్రత్యేకంగా నెలకొల్పాలి. సంగీతము, గృహవిజ్ఞానం పాఠ్య విషయాలుగా ఏర్పరచాలి. ప్రాథమిక విద్యను నిర్బంధంగా ఉచితంగా నేర్పాలి. 5 వేల జనాభా కలిగిన ప్రతి ప్రాంతానికి ఒక మంత్రసాని ఉండాలి. ప్రతి ఫిర్కాకు ఒక మాతా శిశు సంక్షేమ కేంద్రాన్ని స్థాపించాలి. స్త్రీలకు ప్రత్యేకమైన పాయిఖానాలను ఆటస్థలాలను కేటాయించాలి. ఇవీ వారి డిమాండ్లు.[10]

అనంతపురం జిల్లా మహాసభ తే 4-11-48 న జరిగింది. తే 30-12-48 న కృష్ణాజిల్లా 7 వ మహాసభను సమావేశపరిచారు. శ్రీ రాజ్యం సిన్హా అధ్యక్షస్థానం నుండి సభను నిర్వహించి చర్చలను నడిపింది.

అలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సువారి హైదరాబాద్ శాఖ 1952 లో సాంవత్సరిక సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నది. బిక్షకవృత్తిని నిషేధించమని, నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టమని తీర్మానించారు.[11]

## స్థానిక సంఘాలు

అన్నింటిలో అగ్రగణ్యంగా నిలిచింది దుర్గాబాయి గారిచే నెలకొల్పబడిన ఆంధ్ర మహిళా సభ (మదరాసు). ముమ్మొందుగా వయోజనతరగతులతో కార్యక్రమం ప్రారంభమయింది. తరుత హిందీ తరగతులు నడిపారు. స్త్రీలకు పారిశ్రామిక శిక్షణాలయం ఏర్పాటయింది. 1942 లో దానికి అయిదు వందలమంది సభ్యులున్నారు. కాశీలోని వారణాసి విశ్వవిద్యాలయంపు మెట్రిక్యులేషను పరీక్షకు విద్యార్థినులకు తయారు చేశారు. 1942 లో 'ఆంధ్రమహిళ' పత్రిక స్థాపన జరిగింది. 1943 లో విద్యార్థినీ వసతిగృహ నిర్మాణం, 1951 లో ఆస్పత్రిలో ప్రసూతి విభాగం నెలకొల్పారు.

మహిళోద్యమ వ్యాప్తిని దిఙ్మాత్రంగా దర్శించటానికి అనువుగా స్థానిక సంఘాల జాబితాను (అది సమగ్రం కాదు) ఇక్కడ ఇస్తున్నాం.

1946 లో గుడివాడ స్త్రీల మహా సభకు ఊద్పుగంటి రత్నమాంబ అధ్యక్షపీఠం అధిష్ఠించింది. స్త్రీల హక్కులు దయాధర్మ భిక్షగా ఇచ్చేవి, వచ్చేవి కావని ఎలుగెత్తి చాటింది ఆమె. శాసన సభలలోను స్థానిక సంస్థలలోను స్త్రీల సంఖ్యకు అనుగుణంగా ఇతోధిక ప్రాతినిధ్యం కావాలని అట్లూరి అనసూయాదేవి డిమాండు చేసింది. [12]

1948 లో గుడివాడ స్త్రీలు తమ రెండవ మహాసభను సమావేశ పరచుకున్నారు. బరంపురం మహిళా సమాజం 1946 లో 31 వ వార్షికోత్సవం జరుపుకున్నది.

బాపట్ల లో కనువర్తి వరలక్ష్మమ్మ చేత నడపబడే స్త్రీ హితైషిణీ మండలి తే 30-7-51 న 20 వ వార్షికోత్సవము జరుపుకున్నది. మండలి సభ్యులు బాలికలు యువతులకు వాగ్వాద పోటీలు, వక్తృత్వ పోటీలు, వ్యాసరచనా వ్యాసంగాలు, నాటకాలు, జరిపించేవారు. స్త్రీల సమస్యలపై చర్చలు జాతీయోద్యమాలపై అభిమానం, జాతీయనాయకుల జయంతులు, వర్ధంతులు, స్వాతంత్ర్యాదినోత్సవాలు ఆ సంస్థ అభిమాన విషయాలు.

మదనపల్లి మహిళా సమాజం 1951 లో పదవ వార్షికోత్సవాన్ని చేసుకున్నది.

## శాసన సభలో స్త్రీల ప్రాతినిధ్యం

ప్రతి జిల్లాలోను కనీసం ఆరు స్థానాలను స్త్రీలకు కేటాయించాలని ఇరవై మంది ఆంధ్రమహిళోద్యమ నాయకులు కాంగ్రెసు కేంద్ర పార్లమెంటరీ బోర్డుకు 1946 లో ఒక విజ్ఞాపన పత్రం సమర్పించారు. తరువాత కనీసం జిల్లాకు మూడు స్థానాలనయినా ఇమ్మని అడిగారు. తమ చర్య ద్వారా రాష్ట్ర కాంగ్రెసు కమిటీ వారి కోరికను త్రోసిపుచ్చింది. అందువలన

మహిళల కేంద్ర పార్లమెంటరీ బోర్డుకు 'అపీలు' చేశారు. ముప్పైమూడు మంది స్త్రీలు తమను అభ్యర్థులుగా నిర్ణయించమని దరఖాస్తులు పెట్టుకున్నారు. ఇద్దరిని మాత్రమే ఎంపిక చేశారు. వారు ఏలూరుకు చెందిన సి. అమ్మన్నరాజా మరియు కృష్ణాజిల్లాకు చెందిన వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ. సంప్రతింపులలో మహిళా నాయకులు 5, 6 స్థానాలకు తమ డిమాండును తగ్గించుకున్నారు. ప్రస్తావన పత్రంపై సంతకాలు చేసిన వారంతా స్వాతంత్ర్యోద్యమంలో వీరాంగనలుగా నిలిచిన ఉద్దండులే. వారు పొణకా కనకమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, ద్రోణం రాజు లక్ష్మీబాయమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, కలగర పిచ్చమ్మ, మూల్పూరి చుక్కమ్మ, ఈడుపుగంటి వెంకట రత్నమాంబ, గోగినేని కాంతిదేవి, ఎం. రుక్మిణమ్మ, ఎం. కమలమ్మ, దేవరపల్లి సత్యవతమ్మ, ఎం. వరలక్ష్మమ్మ, ఎ. బాలాత్రిపుర సుందరమ్మ, పి. కామేశ్వరమ్మ, చుండూరి రత్నమ్మ, బత్తుల కామాక్షమ్మ సి. హెచ్. సరస్వతమ్మ, కె. ఎస్. మాణిక్యాంబ, పి. సీతారావమ్మ, పి. వసుంధరాదేవి.[16] కాంగ్రెసు దృష్టిలో స్త్రీలు త్యాగాలు చేయటానికి పనికివస్తారు కాని అధికారాన్ని పొందటానికీ, పదవులు నిర్వహించటానికి తగినవారు కాదని నిస్సందేహంగా రుజువయింది.

## అనుబంధం
## కొన్ని స్థానిక మహిళా సంఘాలు

| వ. సం. | పేరు | ప్రదేశం | స్థాపక సం॥ | ప్రేరకశక్తి | కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 1. | బేగం మౌలానా అబుల్ కలాం అజాద్ మెమోరియల్ బాలికా పాఠశాల | షమ్షీర్ గూడెం (ప. గోదావరి) | 1949 | | బాలికలకు అనాథాశ్రయం, యువతులకు శరణాలయం, మాతా శిశు కేంద్రం. |
| 2. | కస్తూరిబా మహిళా పాఠశాల | పెద్దాపురం | 1947 | | విద్య |

| క. సం. | పేరు | ప్రదేశం | స్థాపక సం॥ | ప్రేరకశక్తి | కార్యక్రమాలు |
|---|---|---|---|---|---|
| 3. | మహిళా సమాజం | నిడదవోలు | 1930 | | మహిళాభ్యుదయం హింది, కుట్టుపని |
| 4. | ,, | సంగం జాగర్లమూడి | 1945 | ఎం. వేదవతి | ,, |
| 5. | ,, | కొవ్వూరు | 1944 | గావె మాతమ్మ | స్త్రీ సంక్షేమం |
| 6. | ఆంధ్ర మహిళా సమాజం | బరంపురం | 1930 | వేముగంటి పాపాయమ్మ | |
| 7. | కృష్ణాజిల్లా సంఘం | బెజవాడ | 1947 | ఎర్నేని దమయంతి | |

## మూడవభాగం ఎనిమిదవ అధ్యాయం రిఫరెన్సులు

| | | | |
|---|---|---|---|
| 1. | 'ఆంధ్ర మహిళ' | 1948 | పుట 48 |
| 2. | ,, | 1948 డిసెంబరు | |
| 3. | ,, | 1949 | ,, 14-18 |
| 4. | ,, | 1952 | ,, 11 |
| 5. | ,, | 1948 | ,, 5 |
| 6. | ,, | 1948 | ,, 36 |
| 7. | ఆం. ప్ర. మహిళా సమాఖ్య సావనీరు (1977) గుజ్జుల సరళాదేవి వ్యాసం | | పుటలు 9 - 13 |
| 8. | ,, సావనీరు (1977) చంద్ర సంపూర్ణమ్మ వ్యాసం | | పుట 37 |
| 9. | 'ఆంధ్ర మహిళ' | 1951 | పుట 49 |
| 10. | ,, | 1948 సెప్టెంబరు | |
| 11. | ,, | 1952 | ,, 11 |
| 12. | ,, | 1948 | ,, 36 |
| 13. | ,, | 1948 | ,, 405 |

# 4 వ భాగం

# స్థిరీకరణ దశ [1953-74]

## 1 వ అధ్యాయం : ఈదశ ప్రబల లక్షణాలు

ఆంధ్రరాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్టులు ప్రతిపక్ష పార్టీగా రూపొందటం, నిజాం సంస్థానం భారతదేశంలో 'బి' తరగతి రాష్ట్రంగా ఏర్పడడం, 1954 లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం, 1956 లో నిజాంరాష్ట్రం రద్దుకావటం తత్ఫలితంగా 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరణ ఈ దశయొక్క రాజకీయాంశాలు. ఆర్థిక రంగంలో దేశం మొత్తాన్ని లెక్కకు తీసుకుంటే 1956 - 60 లలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక, 1961 - 65 లలో తృతీయ పంచవర్ష ప్రణాళిక గమనించదగిన 'ప్రాజక్టులు'. 1955, 1956 సంవత్సరాలలో హిందూ ధర్మశాస్త్ర సవరణ, ప్రత్యేక వివాహశాసనం (1954) చట్టపరమైన మార్పులు. స్త్రీ విద్య పెరుగుదల చూపింది.

సామాజిక రంగంలో స్త్రీలు పెక్కు సదుపాయాలను హక్కులను పొందారు. వారి సంఘాలలో పటిష్టత పెరిగింది. వాటికి వనరులు సమకూరాయి. ఇంతకాలంగా విద్యకు నోచుకోని స్త్రీలకు దుర్గాబాయి ప్రయత్నఫలితంగా వచ్చిన వయోజన స్త్రీల విద్య లాభించింది. వారిలో విద్యావ్యాప్తి జరిగింది. దుర్గాబాయి చూపిన బాటను అనుసరించిన మహిళాసంఘాలు వృత్తివిద్య గరపటానికి పూనుకున్నాయి. తద్వారా స్త్రీలు స్వావలంబులయారు. వయోజనులకు అంటే 21 సంవత్సరాల వయస్సు నిండిన స్త్రీ పురుషులకు రాజ్యాంగం వోటుహక్కు ఇచ్చినందు వలన బ్రహ్మాండమైన స్త్రీ శక్తి పెల్లుబికింది. అలా భారత ప్రజానీకంలో సగం అంటే భారత స్త్రీలు దేశ రాజకీయ పరిణామంలో పాత్ర వహించగల స్తోమతు, హక్కూ సంపాదించుకున్నారు.

స్త్రీల ప్రగతిని పరిశీలించిన మీదట ఈ దశకు "స్థిరీకరణదశ" అని పేరు పెట్టడం సముచిత మవుతుంది. గాంధేయకంలోని జాగృతి, 1943-52 కాలంనాటి ఆందోళన, తిరుగుబాటు భావాలు తమ స్థానాన్ని స్థిరీకరించు కోడానికి అవసరమైన శక్తిని స్త్రీలకు ఇచ్చాయి. అనేక రాజకీయ పార్టీలకు చెందిన స్త్రీలు తమ సమస్యలకు సంబంధించి ఐక్యతను, సంఘీ భావాన్ని ప్రదర్శించటం ముదావహం.

# 2 వ అధ్యాయం : సాధించిన ప్రయోజనాలు

ఈ దశలో భారతదేశ స్త్రీలు గట్టి ఫలితాలను సాధించారు. స్త్రీల ఆందోళన వల్లను, పరిపాలకుల వివేకం వల్లనూ అది ఒనకూడింది. వివేకమూ, విజ్ఞానమూ, విద్యుత్తూ ఉన్న స్త్రీలు తమ తమ రంగాలలో గుర్తింపును పొందారు. స్త్రీని తక్కువస్థాయి మనిషిగా పరిగణించటం, ద్వితీయ శ్రేణి వ్యక్తిగా లెక్క కట్టడం భారతీయ సంప్రదాయం. దాని వలన ప్రభావితమైనది భారత ప్రజల ధోరణి. అది అలా ఉన్నా, భారత ప్రజలలో వీరపూజ చేసే మనస్తత్వం ప్రబలంగా ఉన్నందున ఉన్నత శ్రేణిని అందుకున్న స్త్రీలను పొగడడం చూస్తున్నాం. ఈ భారతదేశ ప్రజల మనస్తత్వాన్ని సరిగా అవగాహన చేసుకోకపోతే మనము గందర గోళంలో పడిపోతాము. తద్వారా దేనినీ మనము సరిగా మదింపు వేయలేము. అది కష్టసాధ్యమే కాక అసాధ్యమవుతుంది.

# 3 వ అధ్యాయం : సామాజికం

## ఈ దశ తొలిభాగంలో శాసనాల విషయంలో జరిగిన పురోగతి గర్హనీకారణం

1872 నాటి ప్రత్యేక వివాహ శాసనానికి బదులుగా 1954 లో మరొక ప్రత్యేక వివాహ శాసనం అమలులోకి వచ్చింది. క్రొత్త చట్టం ప్రకారం 21 సంవత్సరాలు నిండిన పురుషుడు, 18 ఏండ్లు నిండిన స్త్రీ ఏదో ఒకమతానికి చెందినవారైనా లేక ఏ మతానికి చెందకపోయినా రిజిష్ట్రారు ఎదుట వివాహమాడవచ్చు. అంతేగాక స్త్రీ పురుషులకు 21 ఏండ్లు నిండిఉంటే అంతకుముందు వివాహమాడి ఆ నాటికి కూడా భార్యా భర్తలుగా కాపురం చేస్తూ ఉంటే రిజిష్ట్రారు ముందు తమ పెండ్లిని రిజిష్టరు చేయించుకోవచ్చును. పూర్వపు చట్టం కన్నా ఇది పెద్ద ముందడుగు. విడాకులకు కుడా ఈ శాసనంలోనే ఏర్పాటున్నది. ఈ శాసనం క్రింద వివాహమాడిన స్త్రీ పురుషులకు వారసత్వాన్ని భారత వారసత్వ శాసనం నిర్ణయిస్తుంది.

హిందూ సనాతన వర్గాల వ్యతిరేకత మూలంగా హిందూ ధర్మ శాస్త్రాన్ని పూర్తిగా మార్చ లేకపోయిన కేంద్ర ప్రభుత్వం దానిని ముక్కలు ముక్కలుగా మార్చ నిర్ణయించుకున్నది.

హిందూ వారసత్వ శాసనం వచ్చేనాటికి హిందూ విధవరాలికి తన స్వాధీనంలో ఉన్న ఆమె భర్త వాటా ఆస్తిలో ఆ శాసనం ప్రకారం ఆమెకు సర్వహక్కులూ వచ్చాయి. సమష్టి హిందూకుటుంబంలోను, తండ్రి చేతిలోని పిత్రార్జితపు ఆస్తిలోను కుమారునికి జన్మతః ఉన్న హక్కును ఈ శాసనం తొలగించలేదు. చనిపోయినవ్యక్తి తల్లి, విధవ లేక విధవలు,

కుమార్తె వీరందరూ చనిపోయిన వ్యక్తికి ఉన్న సమష్టి హిందూ కుటుంబాస్థిలో (పంపిణీ చేసుకున్నట్లు ఎంచుకుంటే) ని వాటాను అతని కుమారులతో పాటు సమానంగా పంచుకుంటారు. స్త్రీకి సర్వహక్కులు వచ్చాయి కనుక 1937 హిందూ స్త్రీ ఆస్తిహక్కు చట్టం కన్న ఇది అభ్యుదయ కరమైనదిగా కన్పడవచ్చును కాని పూర్వము కుమారునితో సమానంగా వాటా పొందే (భర్త వాటా) విధవరాలు - పరిమిత హక్కులతోనే అనుకోండి- ఇపుడు సర్వహక్కులతో చాల తక్కువ వాటాను పొందుతున్నది. కాని మొదటిసారిగా, చనిపోయిన స్త్రీ ఆస్థిలో భర్త, ఆమె కుమారులు, ఆమె కుమార్తెలతోపాటు సమాన వాటాను పొందుతున్నారు. (ఈ శాసనానికి పూర్వం ఆమె ఆస్థి ఆమె కుమార్తెలకు చెందేది.)

1955 లో వచ్చిన హిందూ వివాహశాసనం 1948 లోని మద్రాసు శాసనాన్ని రద్దు చేసింది. ఈ కేంద్ర శాసనము వలన ఏక భర్తృత్వ ఏక భార్యాత్వ కుటుంబాలు ఏర్పడాలి. కోర్టుద్వారా వేరుగా కాపురము ఉండటానికి అనుమతి (Judical Seperation), కాపురానికి పొమ్మని ఉత్తరువు (Restitution of Conjugal Rights), విడాకులు అన్నీ ఇందులో పొందుపరచ బడినాయి. మనవర్తి, విడిపోయిన దంపతుల సంతాన రక్షణ, పోషణ బాధ్యతలు ఈ శాసనం క్రమబద్ధం చేస్తున్నది. ఈ శాసనం చాల అభ్యుదయకరమని నిస్సందేహంగా చెప్పవచ్చును.

1956 లోని హిందూ దత్తత మరియు మనవర్తి శాసనము కేంద్రం చేసిన శాసనం. ఇది దత్తతను గురించిన ధర్మశాస్త్ర సూత్రాలను క్రోడీకరించింది. భర్త సపిండుల అనుమతితో నిమిత్తం లేకుండా విధవరాలు తన భర్తకు దత్తు చేసుకోవచ్చును. అంతే గాక ఏ హిందువూ తన భార్య అనుమతి లేకుండా దత్తు చేసుకోరాదు. పురుషునినైనా లేక స్త్రీ నయినా దత్తు చేసుకోవచ్చును. మనవర్తి అంటే తల్లిదండ్రులు, సంతానం, భార్యాభర్తలు వీరందరి మనవర్తికి సంబంధించిన 'లా' ను క్రోడీకరించారు ఈ శాసనంలో.

కేంద్రం 1956 లో హిందూ మైనారిటీ మరియు సంరక్షకత్వ శాసనం చేసింది. మైనారిటీకి, సంరక్ష కత్వానికి సంబంధించిన 'లా' ను క్రోడీకరించింది ఈ శాసనం. ఇది ప్రయోజనకరమైన శాసనమైనా, దీనిప్రకారం తండ్రి హక్కులు స్థిరపడినాయి. తల్లి దండ్రుల మధ్య తండ్రికి పెద్దపీట వేశారు. మైనరు సంతానానికి ముందుగా అతడే సంరక్షకుడు. అతడు జీవించియుండగా కోర్టుద్వారా నియమింప బడితే తప్ప తల్లి సంరక్షకురాలిగా ఉండతగదు. ఇదంతా పితృస్వామ్య సమాజపు అవశేషం. అన్ని జీవితరంగాలలోను మగవారు పెత్తనం చేసిన కాలపు లక్షణాలలో ఇదొకటి.

బాల్యవివాహ నిరోధపు శాసనాన్ని సవరించారు. అందుచేత వధువు వయస్సు కనీసం 18 సంవత్సరాలు నిండాలి. మొదట్లో 14 నిండాలని ఉండేది.

ముసల్మానులకు, క్రైస్తవులకు సంబంధించిన 'లా' లో మార్పులు లేకుండుట విచిత్రము. క్రైస్తవుల వివాహ శాసనం 1872 నాటిదికాగా, వారికి వర్తించే విడాకుల చట్టము 1869 నాటిది.

భారతపౌరులు విదేశాలలో వివాహం చేసుకునే సందర్భాలలో దానిని క్రమబద్ధం చేస్తుంది విదేశ వివాహ శాసనం (1969). ఇది అభ్యుదయ కరమైన చర్యఅని గర్వంగా చెప్పుకోవచ్చు.

వరకట్న నిషేధశాసనం (1961) కేంద్రము అమలులోకి తెచ్చింది. వరకట్న నిషేధం జరగాలని భారత స్త్రీలు చేసే డిమాండును పురస్కరించుకొని ఇది పుట్టింది. దీని వెనుక శాసనం తెచ్చిన వారి ఉద్దేశం మంచిదే. దానిని శంకించ నవసరం లేదు. కాని ఈ శాసనము ఎంతో లోప భూయిష్టము. భారతదేశ ప్రజల భావనలు, చట్టంలోని లోపాలు ఈ రెండూ కలసి ఈ శాసనానికి పురిట్లోనే సంధి కొట్టేలా చేశాయి. ఆక్టు అమలులోకి వచ్చిన 20 సంవత్సరాల కాలంలో ఒకే కేసు కోర్టుముందుకు వచ్చింది. ఈ శాసనాన్ని అమలు పరిచే అవకాశం లేకుండా దానిని శాసనాల జాబితాలో

ఉంచే కన్నా తొలగించడం మేలు అని అపుడపుడు అనిపిస్తుంది. దీనికి మహిళా సంఘాలు ఇటీవల అనేక సవరణలను సూచిస్తున్నాయి. పార్ల మెంటులో సవరణ బిల్లు వచ్చింది. ప్రజాభిప్రాయ సేకరణకు పార్ల మెంటు సెలెక్టు కమిటీ దేశం అంతా తిరిగి అభిప్రాయ సేకరణ చేసింది. లాంఛనాల విషయంలో, పెండ్లి ఖర్చుల విషయంలో, నేరానికి శిక్ష విషయంలో ఎన్నో మార్పులను సూచించటం జరిగింది.

వ్యభిచార నిర్మూలనాన్ని ఉద్దేశించి అవినీతికర రవాణా నిర్మూలన శాసనం (Suppression of immoral traffic Act) 1956 లో వచ్చింది. ఇదికూడ కేంద్రశాసనమే. వడుపు గృహాలను నడపటం, వాటికి స్త్రీలను సమకూర్చటం, వడుపు గృహ నిర్వహణకు సాయపడటం, ప్రోత్సహాలం చేయుటం నేరాలయినాయి. వడుపు గృహాలలో ఉండేది స్త్రీలే. (ఇంకా మగవారి 'బ్రాథెల్సు' భారతదేశంలో పుట్టలేదు) వడుపు వృత్తిని పోషించేది వాటిని దర్శించే పురుషులు, వ్యభిచారిణులు పొత్తును ఆసించేవిటులు. పురుషులకు శిక్షలేకుండా స్త్రీలకే శిక్ష పడుతున్నది. కనుక ఈ చట్టం స్త్రీలను వివక్షాపూర్వకంగా శిక్షిస్తున్నది. ఇది వారిపాలిట బాధకరంగా అణచివేత చర్యగా పరిణమించింది. 'పతిత' స్త్రీలకిది 'శాపము' అయింది.

మాతృత్వ సౌకర్యాల శాసనం (1961) ప్రకారం కార్మిక స్త్రీకి జీతముతో 6 వారాల సెలవు వస్తుంది పురిటి సందర్భంగా. ఇది స్త్రీలకు ప్రయోజనకారి.

అనాథాశ్రమాలు విధవల శరణాలయాల శాసనం అనాథాశ్రమాలను విధవల శరణాలయాలను నడిపే తీరును క్రమబద్ధం చేసింది. గర్భస్రావ చట్టం అని ప్రజలచే పిలువబడే వైద్య కారణాలవల్ల గర్భవిచ్ఛిత్తి శాసనం (1971) కొన్ని పరిస్థితుల్లో డాక్టర్లు - ప్రభుత్వ లేక ప్రయివేటు వైద్యులు- గర్భస్రావానికి పూనుకోవటానికి వెసులుబాటు కల్పిస్తుంది. ఈ శాసనం క్రితపూర్వం రహస్యంగా ఇలాంటి ఆపరేషనులు చెయించుకోవలసి వచ్చేది. చాల కేసులలో మంత్రసానులు, ఆయాలు చేసేవారు. వారు వైద్యజ్ఞానం

తగినంతగా లేని వారయినందున అసమర్థులుగా ఉండేవారు. చాలా కేసులలో తల్లి చనిపోయేది. ఈ శాసనంవల్ల పరిస్థితి మారింది. ఈ దిగువ పేర్కొనబడిన సందర్భాలలో ప్రభుత్వ గుర్తింపు పొందిన డాక్టర్లు గర్భస్రావ ఆపరేషన్లు చేయవచ్చును :-

స్త్రీ 12 మాసాలకు మించని గర్భిణీగా వున్నప్పుడు ఒక డాక్టరు, 12 మాసాలకు మించి 20 వారాలకు మించని గర్భిణీగా ఉన్నపుడు కనీసం ఇద్దరు వైద్యులూ "ఆమె ఇకగర్భిణీగా కొనసాగితే ఆమెప్రాణానికి ముప్పు అని గాని, ఆమె శారీరక లేక మానసిక ఆరోగ్యానికి భంగకరమని" గాని తలిస్తే, 'ప్రసవంజరిగితే సంతానంపుట్టే అది శారీరక లేక మానసిక వైపరీత్యాలతో బాధపడుతుందని, తీవ్ర వైకల్యం సంతానానికి సంక్రమిస్తుందని' భావిస్తే అపుడు వారు ఆమెకు గర్భస్రావం చేయవచ్చును. ఒక స్త్రీ మాన భంగానికి గురి అయితే ఆమెకు గర్భం వస్తే గర్భధారణ ఆమె మానసిక ఆరోగ్యానికి దెబ్బ అని పరిగణించవచ్చు. ఆమెగాని ఆమె భర్తగాని సంతానాన్ని పరిమితం చేసుకునే నిమిత్తం జన్మనిగ్రహ సాధనాలు వాడుతుంటే అవి నిరుపయోగమయి ఆమెకు గర్భం వస్తే అది ఆమె మానసిక ఆరోగ్యానికి తీవ్రమయిన అఘాతంగా ఎంచవలెను. ప్రమాదం, అఘాతం వీటిని అంచనా వేసేటప్పుడు ఆమె చుట్టూ ఉన్న వాస్తవ పరిస్థితులే కాక భవిష్యత్తులో రాబోయే స్థితిగతులను కూడా లెక్కలోకి తీసుకోవాలి. గర్భిణీ స్త్రీ యొక్క జీవితం ప్రమాదంలో ఇరుక్కున్నపుడు, పైన చెప్పిన సందర్భంలో ఇద్దరు డాక్టర్ల సమ్మతి అవసరమైనా, ఒక్క డాక్టరు అభిప్రాయం ప్రకారమే గర్భవిచ్ఛిత్తి చేయవచ్చును. కాకపోతే ఆ స్త్రీ యొక్క సమ్మతి మాత్రం అవసరం. అంతేగాక సంరక్షకుని అనుమతి లేకుండా మైనరు స్త్రీకి గర్భస్రావం చేయ వీలు లేదు. ఇది అభ్యుదయకర శాసనం. కొంతవరకైనా, ఆమె శరీరం మీద తన హక్కును ఆమె చలాయించుకో గలుగుతుంది. అలా ప్రపంచంలోని అనేక ఇతర దేశాల కన్నా భారతదేశం చాల చాల పురోగామిగా ఉన్నది ఈ విషయంలో.

# 4 వ అధ్యాయం :

# రాజకీయాలలో ప్రమేయం

1969 లోని తెలంగాణా ఉద్యమం, 1972-73 లోని ప్రత్యేక ఆంధ్రోద్యమం. 1968 - 71 నక్సలైటు ఉద్యమం, దరిమిలా నక్సలైటు ఉద్యమం తప్ప 1952 నుండి రాజకీయాలు శాసనసభలు, పార్లమెంటు మ్యునిసిపాలిటీలు, జిల్లా పరిషత్తులు, పంచాయితీ సమితులు, పంచాయితీలు వీటికే పరిమితమయినాయి.

1952 లో పార్లమెంటులో కొందరు స్త్రీలు సభ్యులుగా ఉన్నారు. లోక్ సభ సభ్యత్వం అయిదు వందల పైచిలుకు కా.గా అందులో 19 మంది మాత్రమే స్త్రీలు. పార్లమెంటు లేక శాసన సభలలో స్త్రీల ప్రాతినిధ్యం ఏనాడూ 5 శాతాన్ని మించిలేదు. 1961 నాటికి లోక్ సభలో స్త్రీల సంఖ్య తగ్గింది. 1962 లో 33 మంది, 1967 లో 28 మంది, 1971 లో 21 మంది మాత్రం ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి ఎన్నుకోబడిన సభ్యులు ఆయా సంవత్సరాలలో వరుసగా 4, 3, 2, గా ఉండేది. అయినా 1952 నుండి పది ఏండ్ల వరకు ఇతరులు గమనించేటంతగా స్త్రీ సభ్యులు ప్రసంగాలు చేసేవారు.

1969 తెలంగాణా ఉద్యమంలో స్త్రీలు సభలలో పాల్గొన్నారు. సత్యాగ్రహాలు చేశారు. మహాసభలు, సమావేశాలు జరిపారు. ప్రచారం ముమ్మరంగా సాగించారు. తెలంగాణా ఉద్యమం సంవత్సరం పైకాలం నడిచింది. చివరకు దాని లక్ష్యాన్ని అది సాధించలేక పోయింది.

1972 - 73 లోని ప్రత్యేకాంధ్రోద్యమము కొలది కాలమే నడిచింది. కాని తీవ్రత హెచ్చుగా ఉన్నది, 1921, 1930, 1932 స్వాతంత్ర్యోద్యమాలలో

కంటే ప్రజలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. తెనాలి, ఒంగోలు, ఆదోని పట్టణాలలో పోలీసులు సాగించిన కాల్పులకు వ్యతిరేకంగా స్త్రీలు ఉద్రిక్తులయినారు. వారు ఊరేగింపులలో, సభలలో, 'రిలే' నిరాహార దీక్షలలో విరివిగా పాల్గొన్నారు. మంత్రివర్గంలోని ఆంధ్ర మంత్రులు ఉద్యమంలో చేరారు. భారీ ఎత్తున స్త్రీలు ఉద్యమంలోకి దూకారు. 1969 తెలంగాణా ఉద్యమంలో అవమానాలకు గురి అయిన ఆంధ్ర ప్రభుత్వోద్యోగుల భార్యలు ఉద్యమంలోకి చేరారు. కొంతమంది కాంగ్రెసు మహిళలు కృషిచేసి కొంతపేరు సంపాదించుకున్నారు. కాని కాంగ్రెసు వారు ఉద్యమంనుండి తప్పుకోగానే వారు పై పొలిగారు. సివిలు సర్జనులు సివిలు అసిస్టెంటు సర్జనులు, వైద్య విద్యార్థులు, నర్సులు, ఆయాలు, మంత్రసానులు ఉద్యమంలోకి వచ్చి తమవంతు పాత్ర నిర్వహించారు. ఒకరకంగా, ఇందిరా గాంధికి వోట్లిచ్చి గెలిపించినందుకు స్త్రీలు వ్యధ చెందుతున్నారా అని తోచింది పరిశీలకులకు. మరునాడు విదేశాలకు పోవలసిన ఇందిరాగాంధి రాత్రికి రాత్రి విమానంలో హుటాహుటిన హైదరాబాద్ వచ్చి తెలంగాణా నాయకులతో మంతనాలు చేసిన విషయం సర్వులకూ విదితమే. కాని ఆమె ఆంధ్రకు వచ్చి పరిస్థితులను స్వయంగా తెలుసుకోవటానికి సుముఖత చూపలేదు. ఆంధ్రప్రాంతపు మధ్య తరగతి వారు – సమైక్యతా వాదులు తప్ప మిగతావారు దానిని తమకు అవమానంగా భావించారు. స్త్రీలు కూడా అలాంటి భావాలనే కలిగిఉండడము సహజమే.

వేలకొలది స్త్రీలు కృష్ణా, గుంటూరు ప్రకాశం జిల్లాల యాత్రలలో పాల్గొన్నారు. కృష్ణాజిల్లా యాత్రలోని ఊరేగింపులో యాభై వేలమంది పాల్గొన్నారు. అందులోకనీసం ఇరవై శాతంస్త్రీలు. బస్సులు, లారీలుట్రాక్టర్లు కారులు, స్కూటర్లు మూడుపేలదాకా యాత్రలో తిరిగాయి. ఏ సమయంలో నైనా ప్రసవం రాగల ఒక గర్భిణీ స్త్రీ లేడీ డాక్టరును వెంటబెట్టుకొని యాత్రలోపాల్గొన్నది. ఉదయం తొమ్మిదిగంటలకు బయలుదేరినఊరేగింపు జిల్లాలో 160 నుండి 170 వరకు మైళ్ళు ప్రయాణంచేసి రాత్రి పదిగంటలకు మొదట్లో కదిలిన ప్రదేశానికి వచ్చేది. రైల్వే లైను ప్రక్కనున్న

గ్రామాల స్త్రీలు ఉదయం తొమ్మిది గంటలకల్లా వీధి నిర్వహణకు వచ్చేవారు. రైళ్ళను ఆపటానికి, ప్రభుత్వ కార్యాలయాలను పికెటింగు చేయడానికి, విమానాలు దిగకుండా చేయటానికి అన్నింటికి వారుసిద్ధమే. కొన్ని గ్రామాల స్త్రీలు ఈ సందర్భంగా పేరెన్నిక పొందారు. పెదకాకాని, అంగలకుదురు అప్పికట్ల (గుంటూరుజిల్లా), ఎనికెపాడు, దెందులూరు (కృష్ణాజిల్లా) ఈ గ్రామాల స్త్రీలు ధైర్య సాహసాలను ప్రదర్శించారు. పెదకాకాని స్త్రీలు కేంద్ర రిజర్వు పోలీసు వ్యానును ఒకగంటసేపు కదలనీయలేదు. తెనాలి స్త్రీలు టెలిఫోను ఎక్స్ఛేంజిని ఆక్రమించారు. ఎనికెపాడు, దెందులూరు గ్రామాలలో స్త్రీలు రైళ్ళను ఆపే పనిని తామే స్వీకరించారు. తే 24-12-72 న సమైక్య వాదులైన మంత్రులు వస్తున్న విమానాన్ని దిగకుండా ప్రజలు గన్నవరం విమానాశ్రయాన్ని ఆక్రమించారు. ఆ ప్రయత్నంలో స్త్రీలు పురుషుల సరసన పాల్గొన్నారు. ఒక ఊరిలో పదివేలమంది పురుషులతో పాటు 5 వేలమంది స్త్రీలు పోలీసు స్టేషనుకు వెళ్ళి అరెస్టు కాబడిన 45 మంది కార్యకర్తలను వదిలించుకువచ్చారు. తే 19-2-1973 న పోలీసు స్టేషన్లపై జెండాలు ఎగరవేయటంలో స్త్రీలు పాలుపంచుకున్నారు. స్త్రీల ఊరేగింపు జరగని బస్తీ గాని గ్రామం గాని లేనేలేదు. జిల్లా ముఖ్యపట్టణాలలో ఊరేగింపులలో స్త్రీలు వేలసంఖ్యలో ఉండేవారు. తే 1-2-73 న ఆనాటి జనసంఘ్ ఈనాటి భారతీయ జనతా పార్టీ నాయకుడు వాజపేయి విజయవాడ వచ్చినపుడు ఒక లక్షమంది స్త్రీలు ఊరేగింపు తీశారు. పాలసీసాలతో పసిపిల్లల తల్లులు, గర్భిణీస్త్రీలు, వృద్ధమాతలు, బాలికలు కాలినడకన బారులు తీర్చి నడిచారు.

జనవరి 1973 లో కోస్తా పట్టణాలలో ప్రభుత్వం కాల్పులు సాగించింది. అందువలన తే 22-1-1973 న జరిగిన ప్రథమ మహిళా మహాసభలో ప్రకాశం, రాయలసీమకు చెందిన జిల్లాల స్త్రీలే పాల్గొన్నారు. ఆంధ్రమహిళా కార్యాచరణ కమిటీ పుట్టింది. డా॥ లిల్లీసుందరం అధ్యక్షురాలు. అనంత పురానికి చెందిన లక్ష్మీదేవమ్మ కార్యదర్శిని. అనంతపురంలోని ఎన్. జి. ఓ. హోంలో మహిళలకు ఆఫీసును కేటాయించారు. ఆందోళన సాగినంత

కాలం ప్రతిరోజు ఆ ఆవరణలో బహిరంగ సభ ఉండేది. గ్రామాలలో ప్రచారం చేయటానికి స్త్రీ కార్యకర్తలకు ఒక 'వ్యాను' ఉండేది. వజ్రమ్మ అనే పేరుగల వృద్ధురాలు అక్కడి స్త్రీలకు నాయకత్వం వహించింది.

తే 19-2-73 న 15 వేలమంది స్త్రీలు కడప బహిరంగ సభకు హాజరయినారు. ఉద్యమం తగ్గుముఖం పట్టిన తరుణంలో తే 1-4-73 న ద్వితీయ ఆంధ్రమహిళా మహాసభ విజయవాడలో జరిగింది. వెయ్యిమంది స్త్రీలు పన్నెండు జిల్లాలనుండి ప్రతినిధులుగా వచ్చారు. ఊరేగింపుకు అనుమతి ఇవ్వలేదు ప్రభుత్వాధికారులు. డాక్టర్లు నిషేధాజ్ఞలను ధిక్కరించారు. అందులో మహాసభ అహ్వాన సంఘాధ్యక్షురాలైన సరోజనీ రామారావు ఒకరు.

ఇంచుమించుగా అన్ని రాజకీయభావాలు కల స్త్రీలు, వయోభేదం లేకుండా అరెస్టు అయినారు. అనేకమంది మహిళలతోపాటు అద్దేపల్లి వివేకానందదేవి జైల్లో వుండివచ్చారు. మల్లాది సుబ్బమ్మ అలాంటి వారిలో ఒకరు. ఆమె అనేక ప్రభుత్వ భవనాలపై, పోలీసు స్టేషన్లపై జెండాలు ఎగురవేసి ఐదురోజులు ఒంగోలు సబ్‌జైలులో వున్నది. అనేకమంది స్త్రీలు పోలీసు 'లాకప్' లలో అనేక సందర్భాలలో ఉండిపోవలసి వచ్చింది. జూపూడి హైమావతి (జనసంఘం), రేబాల దమయంతి (కాంగ్రెసు), ఇందిరా రామకృష్ణారావు (ఎన్. జి. వో నాయకుడు రామకృష్ణారావు భార్య), మల్లాది సుబ్బమ్మ (రాడికల్ హ్యూమనిస్టు) అనేక జిల్లాలు తిరిగి వందల కొద్దీ బహిరంగ సభలలో ప్రసంగించారు. స్థలాభావంచేత కొన్ని పేర్లు మాత్రమే ఉటంకించబడుతున్నాయి.[1]

స్త్రీలు త్యాగాలు చేశారు. విశేషంగా శ్రమించారు. బాధలు పడ్డారు. కాని ప్రజానీకం యొక్క దృష్టిని ఆకర్షించి, అందరికీ మార్గదర్శకత్వం వహించగల నాయకత్వాన్ని అందించలేక పోయారు. ఇది శోచనీయం

## కమ్యూనిస్టు మహిళలు

1962 లో ఆదనపు భూమిపన్ను వేస్తే దానికి వ్యతిరేకంగా వచ్చిన ఆందోళనలో కమ్యూనిస్టు మహిళలు తమ వంతు బాధ్యతను నెరవేర్చారు. భూమికోసం జరిగిన పోరాటంలో వారు పాలుపంచుకున్నారు.

## శ్రీకాకుళం పోరాటం

న్యాయంకోసం ధర్మం కొరకు గిరిజనులు సాగించిన ఉద్యమమే శ్రీకాకుళం పోరాటం. అది రైతుల మీటింగులతో ప్రారంభమయింది. భూస్వాములు దాడి ప్రారంభించారు. మొండెకల్లులో గిరిజనుల ఊరేగింపు పై తుపాకులు కాల్చారు. దాంతో గిరిజనులలో ఉద్రిక్తత పెరిగింది పోరాటం మొదలయింది. అది మూడు దశలలో సాగింది. ప్రథమ దశలో గెరిల్లా దళాలు భూస్వాములకు వ్యతిరేకంగా దాడులు చేశాయి. రెండవ దశలో భూస్వాముల పై చర్యలవల్ల కలిగే లాభాలను ప్రజలు పంచుకోవాలని వారికి విజ్ఞప్తి చేశారు. ప్రామిసరీ నోట్లనుంచి వేశారు. ఋణపత్రాలను తగల వేశారు. తాకట్టు పెట్టిన వెండి బంగారు నగలను, వస్తువులను కుదువబెట్టిన వారికి ఇచ్చివేశారు. సహజంగా ప్రజలు వారి పిలుపును అందుకున్నారు. మూడవ దశలో ప్రజలే భూస్వాముల పై దాడులను నిర్వహించారు. అలా ద్వితీయ తృతీయ దశలలో స్త్రీలు పాల్గొన్నారు. వారు వెనుకంజ వేయలేదు. పోలీసులు వాళ్ళను అడ్డ దిడ్డంగా ప్రశ్నలు వేసినా వారు భయబడలేదు. చీకాకు పెట్టినా, అవమాన పరిచినా వారు జంకలేదు. చిత్రహింసలకు గురి అయినా వారు నాయకుల రహస్యాలను బయట పెట్టలేదు. గిరిజన స్త్రీలను చాలమందిని ప్రభుత్వం జైళ్ళలో పెట్టింది.

స్త్రీలు గెరిల్లా దళాలకు సహాయం చేశారు. వారు 'కొరియర్లు' గా పనిచేశారు. కావలా దారులుగా స్థావరాలను రక్షించుకున్నారు. ధైర్య సాహసాలు కల కొందరు స్త్రీలు గెరిల్లా దళాల్లో చేరారు. పోలీసుల

చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకున్నారు. పంచాద్రి నిర్మల చరిత్రను సృష్టించింది. ఆమె వయస్సు, 22 ఏండ్లు. ఆమెకు ఇద్దరు పిల్లలు. తన భర్తతోపాటు ఆమె ఉద్యమంలోకి దూకింది. ఆమె భర్తను భూస్వాములు చంపారు. గెరిల్లా దళంలో భర్తస్థానాన్ని ఆమె భర్తీ చేసింది. భర్తచావుకు పగ తీర్చుకున్నది. పోలీసులు ఆమె దళాన్ని వల వన్ని పట్టుకున్నారు. ఆమె దొరికిపోయింది. పోలీసులు ఆమెను కాల్చి చంపారు. 2

బొమ్మారెడ్డి స్నేహలత మరియొక చరిత్రాత్మక వ్యక్తి. 20 ఏండ్ల లోపు యువతి. ఆమె తల్లిదండ్రుల ఇల్లు విడిచి అడవికి తరలింది. ఆ రోజుల్లో 'అడవి' అంటే నక్సల్‌బరి పద్ధతి తిరుగుబాటుకు ప్రతీకగా ఉన్న పదం - పోలీసులు "ఎదురుదాడి" పేరుతో ఆమెను కాల్చివేశారు. ఆమె అసువులు వీడింది.

అనేక ఉద్యమాలలో స్త్రీలు పురుషులను అనుసరించారు. వారి ప్రయత్నాలలో వారు విశ్రాంతి ఎరుగరు; విరామంమెరుగరు. ధైర్యం త్యాగం, కృతనిశ్చయం లాంటి సద్గుణాలలో వారు పురుషులకు తీసిపోలేదు. నిర్ణయాలు చేయగల నాయకత్వ స్థానంలో వారికి చోటు పెట్టలేదు పురుషులు, స్త్రీలు ఆ ఉన్నత శ్రేణిని అందుకోలేదని వారు అలా చేశారా లేక మామూలుగా అమలులో ఉన్న పురుషాధిక్యతాభావం అడ్డు వచ్చిందా అనేది వివాదాంశం.

## నాల్గవభాగం నాల్గవ అధ్యాయం రిఫరెన్సులు


1. ఎం. వి. రామమూర్తి : 'ప్రత్యేక ఆంధ్రోద్యమం' (1973)
పుటలు 119 - 125

2. కృష్ణమూర్తి : 'నక్సల్‌బరీ వెలుగులో' పుట 497

# 5 వ అధ్యాయం : విద్య

రాజకీయాలలో మహిళా ప్రగతి మందకొడిగా సాగినా విద్యారంగంలో ఈ దశలో బాగా అభివృద్ధి కన్పిస్తున్నది. దిగువ పట్టికలోని అంకెలను గమనిస్తే విద్యాభినివేశం కల బాలికల సంఖ్య పెరుగుతున్నట్లు నిర్ణయించగలం.

విద్యాలయాల్లో విద్యార్థినులు

## పట్టిక 1

(లక్షలలో విద్యార్థులు, విద్యార్థినులు)

| సంవత్సరం | ప్రాథమిక పాఠశాలల తరగతులలో | మాధ్యమిక పాఠశాలల తరగతులలో | ఉన్నత పాఠశాల తరగతులలో | కాలేజీలు మరియు విశ్వవిద్యాలయాలలో |
|---|---|---|---|---|
| 1950-51 | 55. 65 (39) | 5-34 (20) | 1. 61 (15) | 0. 40 (14) |
| 1973-74 | 244. 01 (82) | 45-37 (43) | 23. 40 (36) | 9. 60 (31) |

గమనిక :- బ్రాకెట్లలో ఉన్న అంకెలు 100 మంది బాలురు ఉంటే బాలికలు ఎంతమంది ఉన్నారో తెలుపుతుంది. 1

విద్యా వ్యవస్థలో బాలికల శాతం ఈ దిగువ పట్టికవల్ల తేలుతుంది. విశ్వవిద్యాలయాలలో, హైస్కూళ్ళలో చదివే విద్యార్థినుల శాతం పెరిగింది.

# పట్టిక 2

విద్యావ్యవస్థలో వివిధ దశలలో బాలుర, బాలికల శాతం.

| సంవత్సరం | ప్రాథమిక స్థాయికి ముందు | ప్రాథమిక | హైస్కూలు | విశ్వ విద్యాలయం | వృత్తి పాఠశాలలు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1950-51 | | | | | | |
| బాలురు | 0. 1 | 70 | 20 9 | 2. 0 | 7. 0 | 100. 0 |
| బాలికలు | 0. 2 | 82. 4 | 12. 7 | 0. 6 | 4. 1 | 100. 0 |
| 1960-61 | | | | | | |
| బాలురు | 0. 3 | 67. 3 | 24 7 | 2 7 | 5. 00 | 100. 0 |
| బాలికలు | 0. 6 | 76 3 | 18, 4 | 1 3 | 3. 4 | 100. 0 |
| 1970-71 | | | | | | |
| బాలురు | 0 3 | 66 3 | 26. 4 | 4. 5 | 2 5 | 100. 0 |
| బాలికలు | 0. 5 | 74 3 | 19. 5 | 2. 4 | 3. 3 | 100. 0[2] |

సెకండరీ విద్య 1974 లో కూడ ఉన్నత తరగతులకు, మధ్య తరగతులకు పరిమితమయి ఉన్నవి. అలాగే పట్టణాలకు ప్రాముఖ్యత ఉన్నది. గ్రామాలలో ధనవంతులైన వారు అందులో ముఖ్యంగా మధ్య తరగతుల వారు లాభిస్తున్నారు.[3]

కాలేజీ చదువులు ఎక్కువగా పట్టణాలలోని ధనవంతులకు మధ్య తరగతి వారికి అందుబాటులో ఉంది.[4]

విద్యావ్యవస్థలో అన్ని దశల చేరిన విద్యార్థి, విద్యార్థినుల సంఖ్య.

# పట్టిక 3

| సంవత్సరం | బాలురు | బాలికలు | బాలికల సంఖ్యకన్నా బాలురసంఖ్య హెచ్చు ఎంత |
|---|---|---|---|
| 1950-51 | 1 91,42 009 | 64,00,762 (33) | 1,27,41,247 |
| 1960-61 | 3,37,04.897 | 1,42,59.505 (42) | 1,94,45.392 |
| 1970-71 | 5,57,16,623 | 3,00,34,484 (54) | 2,56,82,139 |

గమనిక :- బ్రాకెట్లలోని సంఖ్య 100 బాలురకు ఎంతమంది బాలికలు ఉన్నది తెలుపుతుంది.[5]

# పట్టిక 4

| | 1960-61 నుండి 1965-66 పెరుగుదల | | | 1965-66 నుండి 1970-71 పెరుగుదల | | |
|---|---|---|---|---|---|---|
| దశ | బాలురు | బాలికలు | మొత్తం | బాలురు | బాలికలు | మొత్తం |
| ప్రాథమిక స్థాయికి ముందు | 45% | 43, 9% | 47% | 29. 9% | 19. 0% | 24. 8% |
| ప్రాథమిక | 34. 9% | 56 1% | 41 8% | 20. 6% | 30. 7% | 24. 2% |
| సెకండరీ | 49 7% | 70. 6% | 54. 7% | 18 2% | 30. 5% | 21. 5% |
| విశ్వవిద్యాలయం | 76 3% | 119. 4% | 83 5% | 57. 3% | 78. 4% | 61. 5% |
| వృత్తి చదువులు | 16 5% | 74 6% | 1. 6% | 3. 9% | 34. 6% | 9. 3% |
| అన్ని దశలు | 37. 1% | 60 1% | 44 0% | 20. 5% | 31. 5% | 24 2% |

విశ్వ విద్యాలయదశలోనూ, వృత్తి విద్యాలయాలలోను పెరుగుదల ప్రాథమిక, సెకండరీ దశలలో దానికన్న ఎక్కువ.

విద్యవల్ల లాభించేవారు పట్టణాలలోని మధ్యతరగతి వారైనప్పుడు స్త్రీలలో విద్యావ్యాప్తి చాల వేగంగా నడిచింది. [6]

ఈ పై సంఖ్యలు దేశం మొత్తానికి చెందినవి. ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన ఆరురాష్ట్రాలలో ఉన్నది. [7]

ఈ దిగువ ఇవ్వబడిన లెక్కలు అన్ని రాష్ట్రాలకు సంబంధించినవి 1955-56లో స్త్రీలకుమాత్రమే ప్రవేశమున్న విద్యాలయాలు 2.6 శాతం. వాటి సంఖ్య 24,873. 1967-68 లో శాతం 23.0. విద్యాలయాలసంఖ్య 2,30,052 అనేక విద్యాలయాలు ఒకే ఉపాధ్యాయుని కలిగి ఉన్న పాఠశాలలు. [8] అక్షరాస్యత గణనీయంగా పెరగలేదు.

| సంవత్సరం | మొత్తం స్త్రీల సంఖ్యలో అక్షరాస్యులైన స్త్రీల శాతం. |
|---|---|
| 1901 | 0. 69 |
| 1911 | 1. 05 |
| 1921 | 1. 81 |
| 1931 | 2. 93 |
| 1951 | 7. 93 |
| 1961 | 12. 95 |
| 1971 | 18. 44 |

జీవనోపాధి కొరకు శ్రమ చేయవలసిన పేదస్త్రీలు భారత స్త్రీలలో[9] అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. వారు ఇంకా నిరక్షరాస్యులుగా ఉన్నారు. [10]

నిరక్షరాస్యులైన స్త్రీల సంఖ్య

| | |
|---|---|
| 1950-51 | 161, 303, 945 |
| 1970-71 | 215, 314, 004 |

[11]

జిల్లాస్థాయిలో మొత్తం స్త్రీల సంఖ్యలో అక్షరాస్యులైన స్త్రీలశాతం తక్కువగా కన్పడే అసమతుల్య స్థితి.

| | అందరూ | స్త్రీలు |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 24. 58 | 15. 65 |
| హైదరాబాదు | 53. 95 | 29. 57 |
| ఆదిలాబాద్ | 14. 14 | 6. 48 |

ఇవి 1960-61 నాటి లెక్కలు. [12]

ప్రభుత్వ కార్యక్రమాలవల్ల పేద ప్రజానీకం లాభించడం లేదని ఈ లెక్కలు తెలుస్తున్నాయి. మొత్తంమీద పరిస్థితి మెరుగయినమాట వాస్తవమే.

# నాల్గవ భాగం ఐదవ అధ్యాయం రిఫరెన్సులు

1. సమానత్వం కోసం ('Towards Equality' Report of Committee on status of women in India (1974) Published by government of India Department of social welfere, పుట 238 పట్టిక V

| | | |
|---|---|---|
| 2. | ,, | పుట 240 పట్టిక VII |
| 3. | ,, | ,, 241 |
| 4. | ,, | ,, 241 |
| 5. | ,, | ,, 240 పట్టిక VI |
| 6. | ,, | ,, 242 పట్టిక XI |
| 7. | ,, | ,, 253 |
| 8. | ,, | పట్టిక XV, పేరా 6. 31 పుట 258 |
| 9. | ,, | పేరా 6. 51 పుట 265 |
| 10. | ,, | పట్టిక XIX పుట 265 |
| 11. | ,, | ,, |
| 12 | ,, | పట్టిక XX పుట 265 |

# 6 వ అధ్యాయం : స్త్రీల పత్రికలు

‘గృహలక్ష్మి’, ‘ఆంధ్ర మహిళ’ల సేవా ఫలితంగా అనేకమంది రచయిత్రులు ఉద్భవించారు. వారు స్ఫుటంగా భావ ప్రకటన చేయగలిగారు. దుర్గాబాయి వ్యక్తిత్వ ప్రభావం వలన ‘ఆంధ్రమహిళ’ సోదర పత్రిక ‘గృహలక్ష్మి’ కన్నా ముందడుగు వేసింది.

‘హిందూ సుందరి’ ప్రచురింపబడేది. ఆ పత్రికలోని ఒక వ్యాసాన్ని మచ్చుకు గమనిస్తే ఆ పత్రిక వైఖరి తెలుస్తుంది. స్త్రీలు గణితశాస్త్రం, విజ్ఞాన శాస్త్రము, సామాజిక శాస్త్రము, ఆరోగ్య శాస్త్రము వీటిని అధ్యయనం చేయకపోతే వారు పురోగమించలేరు.[1] ‘హిందూ సుందరి’ ద్వారా కామాండూరు శఠగోపాచార్యులు ఇలా విజ్ఞప్తి చేశాడు. “హిందూ కోడ్ బిల్లును సమర్ధించే వారికే స్త్రీలు తమ వోట్లను ఇవ్వవలెను”. స్త్రీల హక్కులను రక్షించటం విషయంలో ఆయన చాల పట్టుదలగ వ్యవహరించేవారు.[2]

1960 లో జరిగిన అఖిల భారత మహాసభను గురించి ‘ఆంధ్ర మహిళ’ సంపాదకీయం రాస్తూ ఆ మహాసభ అధ్యక్షురాలి అభిప్రాయాలను వివరించింది. హార్డ్ మోటు సభ్యురాలైన సీతాపరమానంద్ స్త్రీ విద్యకు అవకాశాలు ఎందువల్ల లేవో పరిశీలించారు. ఆమె వాటిని పేర్కొన్నారు. విద్యా సంపాదనానికి ఆర్ధిక స్తోమతు లేక పోవటం, పాతకాలపు భావాలు, కుటుంబాలలో ముసలమ్మల మాటకు అభిప్రాయాలకు విలువ ఉండడం, చాల చిన్నతనంలో బాలికలకు వివాహం చేయటం, తమ కుమార్తెల మనోభీష్టాలను తెలిసికోకుండా, కాలగమనాన్ని గ్రహించకుండా కుమార్తెల భవిష్యత్తును తల్లి దండ్రులు నిర్ణయించపూనటం ఇవి అన్ని బాలికలు,

యువకులు చదువుకోక పోవటానికి కారణభూతాలు.[3] తే 27 - 3 - 63 న హైదరాబాద్‌లో జరిగిన ఆంధ్రప్రదేశ్ మహాసభ వార్తలను "ఆంధ్రమహిళ" ప్రచురించింది. ఆ మహాసభ తీర్మానాలను ఆమోదిస్తూ, వాటిని ఇతరులకు సిఫారసుచేస్తూ 'ఆంధ్రమహిళ' సంపాదకీయం రాసింది.[4]

గాంధీ యుగానికి చెందిన ప్రసిద్ధ స్వాతంత్రోద్యమ కార్యకర్త సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మ 'తెలుగుదేశం' అనే పత్రికను స్థాపించింది. పత్రిక స్త్రీల ఉద్యమానికే అంకితం కాక పోయినా మహిళోద్యమానికి చాలి ప్రాముఖ్యత ఇచ్చేది ఆమె.

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలో ప్రతియేట ఆధికారకమైన పాండిత్య ప్రతిభ కల్గిన వ్యాసం ఒకటి మహిళల సమస్యలపైన విధిగా ఉండేది.

హేతువాద నాస్తికుడైన గోరా తన భావ ప్రచారం కోసం 'సంఘం' 'ఆర్థిక సమత' అనే పత్రికలను నడిపారు. ఆ పత్రికలు అన్ని విషయాలను గురించి రాసినా మహిళోద్యమాన్ని మరచి పోలేదు.

రాడికల్ హ్యూమనిస్టులు తెనాలినుండి నడిపిన 'రాడికల్ హ్యూమనిస్టు' పేరాల నుండి ప్రచురించిన 'సమీక్ష' లలో స్త్రీల సమస్యలపై వ్యాసాలు ప్రకటింపబడేవి.

కమ్యూనిస్టుల దినపత్రికలైన 'విశాలాంధ్ర', 'ప్రజాశక్తి' లలో అప్పుడప్పుడు మహిళా సమస్యలపై వ్యాసాలు వచ్చేవి.

అభ్యుదయ రచయిత వట్టికొండ విశాలాక్షి గుంటూరునుండి 'ప్రజావాణి' అనే పత్రికను 16 సంవత్సరాలు నడిపింది.[5]

# నాల్గవ భాగం ఆరవ అధ్యాయం రిఫరెన్సులు

1. 'హిందూ సుందరి' 1958 నవంబరు పుట 13
2. 'హిందూ సుందరి' 1957
3. 'ఆంధ్ర మహిళ' 1961 ఫిబ్రవరి పుట 3
4. ఆంధ్ర మహిళ 1963 ఆగస్టు
5. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ : 'ఆంధ్ర కవయిత్రులు' పుట 105

# 7 వ అధ్యాయం :

# సమానత్వం వైపు పయనం

స్త్రీల స్థితిగతులను పరిశీలించి వాటిని మెరుగు పరచడానికి తగు చర్యలను సూచించమని భారత ప్రభుత్వం తే 22 - 9 - 71 న ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ తే 31 - 12 - 74 న నివేదికను సమర్పించింది. ఆ నివేదిక "సమానత్వంవైపు పయనం" (Towards Equality) అనే పేరుతో ప్రచురితమయింది. అది సమగ్రంగాను సంపూర్ణంగాను ఉన్నది. దానిలోని సిఫారసులు స్పష్టంగాను, న్యాయంగాను యుక్తి యుక్తంగాను ఉన్నాయి. ఆ కమిటీ 26 సిఫారసులను చేసింది. 1981 నాటికి రెండు సిఫారసులకు మాత్రమే భారత ప్రభుత్వం శాసన రూపం ఇచ్చింది. [1]

## వివాహము

బహు భార్యాత్వ నిషేధాన్ని కమిటీ సిఫారసు చేసింది. ఇందు విషయమై రాజీలేదని కమిటీ స్పష్టీకరించింది. [2] ఈ సిఫారసును 'ఖాతరు' చేయలేదు ప్రభుత్వం.

భార్య జీవించి ఉండగా భర్తగాని, భర్త జీవించి ఉండగా భార్యగాని ద్వితీయ వివాహం చేసుకున్నపుడు న్యాయస్థానపు అనుమతితో ఎవరైనా కేసు పెట్టటానికి అవకాశముండాలని కమిటీ అభిప్రాయం వెలిబుచ్చింది. [3] హిందూ వివాహ శాసనంలో ఏమిరాసి ఉన్నా, ద్వితీయ వివాహాన్ని ఆపుచేయించటానికి నిషేధపుటుత్తరువును (Injunction) ఇచ్చుటకు కోర్టుకు అధికారము ఉండాలని కమిటీ సిఫారసు చేసింది. [4]

బాల్యవివాహ నిరోధ శాసనాన్ని అమలు పరచటానికి ప్రత్యేకంగా అధికారులను నియమించమనే కమిటీ సలహాను ప్రభుత్వం పెడచెవిన పెట్టింది.[5]

ప్రస్తుతం హిందూ వివాహాన్ని రిజిష్టరు చేయించుకోవటం పూర్తిగా ఐచ్ఛికాంశం. వివాహాలను తప్పనిసరిగా రిజిష్టరు చేయించాలని కమిటీ అభిప్రాయపడింది.[6]

## వరకట్న నిషేధం

దీని విషయమై కమిటీ ఈ దిగువ సిఫారసులను చేసింది.

1) వరకట్నాన్ని ఇవ్వటం గాని పుచ్చుకోవటం గాని ప్రభుత్వోద్యోగుల నడతకు సంబంధించిన రూల్సు (Government conduct Rules) కు భిన్నంగా ప్రవర్తించటంగా పరిగణించాలి.[7]

2) నేరాలను పోలీసులు విచారించి కేసులు పెట్టగలగాలి.[8] అంటే ఈ కేసులలో నేరస్తుని వారంటు లేకుండా అరెస్టు చేసే హక్కు పోలీసులకు ఉండాలి.

3) ఈ శాసనాన్ని అమలు పరిచే బాధ్యత పోలీసులకు గాక ప్రత్యేక సంస్థ ద్వారా నిర్వర్తింప చేయాలి. ఆ సంస్థతో సంఘ సేవకులకు, జాగృతి కల పౌరులకు ప్రమేయం కల్పించాలి[9]

4) వరునికిగాని వధుని తల్లిదండ్రులకుగాని ఇవ్వబడే బహుమతులు ఐదు వందల రూపాయల విలువను మించరాదు. అలా కాక అవి ఆ విలువను మించితే తీసుకున్న వారిని శిక్షించాలి.[10]

5) 1961 వరకట్న నిషేధ శాసనపు అమలు తీరును, ఫలితాలను ఐదు ఏండ్ల తరువాత తిరిగి సమీక్ష చేయాలి.[11]

## విడాకులు

భార్యా భర్త వేరొక ఊరిలో ఉద్యోగం చేసుకున్నంత మాత్రాన ఒకరు మరియొకరిని నిరాదరణ చేసి వదిలివేసినట్లుగా ఎంచుకోరాదు. అది కాపురానికి రమ్మనమనే పిటీషనుకు, లేక విడాకులకు కారణభూతం కారాదు. 12

ముసల్మాను పురుషులు తమంత తాముగా (Unilateral) గా భార్య లకు విడాకులిచ్చే పద్ధతిని కమిటీ నిరసించింది. 13

భార్య నడత వల్లనే తమ భార్యను పోషించలేనని భర్త వాదించి నపుడు, ఆ వాదనతో నిమిత్తం లేకుండా, భర్త పోషించటానికి నిరాకరించి నప్పుడు విడాకులు పొందటానికి భార్యకు అర్హత కలిగించాలి. 14

క్రైస్తవుల శాసనం పురాతనమైనది, కాలం చెల్లినది కనుక దానిని మార్చడంలో ఆలస్యం ఏమాత్రము క్షంతవ్యం కాదు. 15 క్రైస్తవులలో విద్యావంతులు అభ్యుదయ గాములు ఉన్నా దీని విషయమై వారు పట్టించు కోకపోవటం శోచనీయం.

మతాంతరీకరణ విడాకులు పొందటానికి తగిన కారణం కారాదు. వివాహ బంధంనుండి విడివడటానికి పలువురు మతాంతరులవుతారు. 16

పరస్పర సమ్మతిమీద అన్ని మతాలవారికి విడాకులు లభించాలి. 17 విడాకుల విషయంలో భార్యాభర్తలకు సమానమైన అర్హతలు, అనర్హతలు ఉండాలి. 18

## దత్తు

తన జీవిత భాగస్వామి అనుమతితో భర్తగాని భార్యగాని దత్తు చేసుకోవచ్చు. 19 కమిటీ దృష్టిలో పిల్లల దత్తత బిల్లు (Adoption of Children bill of 1972) పర్వులకూ వర్తించే లౌకిక శాసనానికి నాంది.

హిందూ లా ఎంతో పురోగమించినా, హిందూ స్త్రీ భర్త సమ్మతితో తనకు దత్తు చేసుకోవటానికి వీలులేదు. అదీగాక సంప్రదాయ ముసల్మానులు వ్యతిరేకించినందున 1972 నాటి దత్తత బిల్లు శాసనం కాలేదు. కనుక ముస్లిం స్త్రీ పురుషులిద్దరికి దత్తత స్వీకరించే అధికారం లేనేలేదు.[20]

## సంరక్షకత్వం

ఈ దిగువ పేర్కొనబడిన సిఫారసులను స్త్రీల హోదాను గురించి 1961 లో నియమింపబడిన ఐక్యరాజ్య సమితి కమిటీ వారు చేశారు. వాటిని భారతదేశ కమిటీ ఆమోదించింది.

1) తమ మైనరు సంతానపు సంరక్ష కత్వపు విషయంలో భర్తతో పాటు భార్యకు సమాన హక్కులు బాధ్యతలు ఉండాలి. పిల్లలపై చూపవలసిన శ్రద్ధ, వారు ఎవరి పోషణలో ఉండాలనే అంశం, వారి విద్య, పోషణ రక్షణ వీటి విషయంలో తల్లి దండ్రులు ఇద్దరూ సమానంగా అధికారం కలిగి ఉండాలి.

2) మైనరు సంతానపు ఆస్తి పాస్తుల విషయమై మైనరు శ్రేయస్సుకు అనుకూలంగా జాగ్రత్త వహించాలి. ఈ షరతుకు లోబడి మైనర్ల ఆస్తుల సంరక్షణ నిర్వహణ వగైరా అంశాలలో భార్యా భర్త లిద్దరికి సమానమైన హక్కు బాధ్యతలుండాలి.

3) దంపతుల వివాహాన్ని చెల్లదని ప్రకటించే సందర్భంగా, విడాకులిచ్చే సమయంలో, లేక దంపతులు విడిగా ఉండటానికి న్యాయస్థానం అనుమతి ఇచ్చే పరిస్థితిలో పిల్లలు ఎవరి పోషణలో ఉండాలనేది నిర్ణయించాల్సి వచ్చినపుడు మైనర్ల శ్రేయస్సుకే అన్నింటి కన్న మిన్నగా ప్రాధాన్యత ఇవ్వాలి.

4) విడాకులు, పెండ్లి రద్దు, కోర్టు అనుమతితో విడిగా ఉండుట సంభవించినపుడు మైనర్ల సంరక్షకత్వం, పోషణ, అధీనం, లేక తల్లి దండ్రుల ఇతర హక్కుల సందర్భంగా స్త్రీ పురుష వివక్ష వనికిరాదు.[21]

ముసల్మాను 'లా' ప్రకారం తండ్రి, అతనిచే అతని వీలునామాలో నియమింపబడిన వ్యక్తి, తండ్రి తండ్రి, తండ్రి తండ్రిచే నియమింపబడిన వ్యక్తి వరుస క్రమంలో మైనర్లకు సంరక్షకులవుతారు. నవమాసాలు మోసి కని పెంచిన తల్లికి ఏ హక్కూ లేదు కోర్టుకు పోతేతప్ప. హనాఫీ 'లా' ప్రకారం ఏడేండ్లు వచ్చేవరకు మగపిల్లవానిని, రజస్వల అయ్యేవరకు ఆడపిల్లను తల్లి తన అధీనంలో ఉంచుకోవచ్చును. ఈ వెనులు బాట్లను ముసల్మాను 'లా' యొక్క ఉత్కృష్టతగా ప్రచారం చేస్తున్నారు ఆ మతానుయాయులు. [22] ఖుర్ ఆన్ లో పొందుపరచబడిన దివ్య ధర్మశాస్త్రానికి భిన్నమని చెప్తూ, సమానత్వంకోసం ముసల్మాను స్త్రీలు చేసే ప్రయత్నాలను నిరసిస్తున్నారు సనాతనులు. [23]

## మనవర్తి

ప్రస్తుతం క్రిమినలు మనవర్తి క్రింద భార్యకు నెలకు 5 వందల రూపాయలకన్నా ఎక్కువ ఇప్పించలేరు. ఆ గరిష్ట పరిమితిని తొలగించాలని కమిటీ అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. [24] భార్యకు భర్త చెల్లించవలసిన మనవర్తిని ఆదాయపు పన్నులాగా, భూమిశిస్తు బకాయిలాగా భర్త జీతంలో నుండి గాని ఇతర ఆదాయంలో నుండిగాని ముమ్ముందుగా వసూలు చేయాలని, జీతంలోనుండి ముందుగా కత్తిరించి వసూలు చేయాలని కమిటీ సిఫారసు చేసింది. [25] క్రిమినలు 'లా' లో జరిమానాలను వసూలు చేసిన పద్ధతిలో మనవర్తిని వసూలు చేయాలని కమిటీ సూచించింది. [26] మనవర్తి విషయం చిక్కులతో కూడుకున్నది కనుక దానిని ఇతర తగాదాలను తీర్చడానికి కుటుంబ కోర్టుల నిర్మాణాన్ని కమిటీ ప్రతిపాదించింది [27]

## వారసత్వం

స్త్రీల వారసత్వపు హక్కుల సందర్భంగా మత ధర్మ శాస్త్రాలు భిన్న భిన్న రీతుల్లో ఉన్నాయి. సమష్టి హిందూ కుటుంబంలో కుమారునికి

ఉంటున్న జన్మతః వాటా కలిగే హక్కును రద్దు వేయమని కమిటీ హితవు చెప్పింది. మితాక్షర 'కోపార్సనరీ' ని రద్దుచేసి హిందూ 'లా' లో మరొక శాఖ అయిన 'దాయభాగా' వ్యవస్థను నెలకొల్పమంది.[28] కేరళ క్రైస్తవు లకు భారత వారసత్వ చట్టాన్ని వర్తింప చేయమన్నది.[29] హిందూ వారసత్వ చట్ట నిబంధనల ప్రకారం వారసులైన స్త్రీలు కుటుంబ నివాస గృహాన్ని భాగపంపిణీ చేయమని కోరటానికి వీలులేదు. కాకపోతే వారు ఆ ఇంట్లో కాపురము ఉండవచ్చును. ఆ హక్కు కూడా అవివాహిత కుమార్తెలకు, విధవలైన కుమార్తెలకు, భర్తలచేత వదలి వేయబడిన కుమార్తెలకు మాత్రమే ఉంది. వివాహిత కుమార్తెలకు, అవివాహిత కుమార్తెలకు మధ్యతేడాను తీసివేయమని కమిటీ కోరింది.[30] భూ కమతాలు ముక్క చెక్కలు కాకుండాను, 'సీలింగు' విషయంగాను, కవులు హక్కుల సంక్రమణ సందర్భంగాను చేయబడిన శాసనాలను, నిబంధనలను హిందూ వారసత్వ చట్టం క్రింద మినహాయింపు చేశారు. ఆ మినహాయింపును తొలగించాలని కమిటీ భావించింది.[31] పెండ్లినాడూ, దరిమిలా వివాహ జీవిత కాలంలోను సంపాదించబడిన ఆస్తిలో విడాకులప్పుడు లేక విడిపోయి నప్పుడు భార్యకు మూడవవంతు చెందాలని కమిటీవారి భావం.[32]

## కుటుంబ తగాదాలు : కోర్టులు

వివాహితుల మధ్య తగాదాలను పరిష్కరించే నిమిత్తం ప్రత్యేక న్యాయస్థానాలను నెలకొల్పాలని, ఆ కోర్టులలో అనుసరించే విధానం, రూల్సును పాటించటానికి బదులు ఇష్టాగోష్టి పద్ధతిలో ఉండాలని కమిటీ నిశ్చయించింది.[33]

జపానులలో కుటుంబ కోర్టులలో ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప పార్టీలు ప్లీడర్లద్వారా వాదించటానికి వీలులేదు. కమ్యూనిస్టు చైనాలోను రష్యా లోను కుటుంబ కోర్టులో ఒక న్యాయమూర్తి విధిగా స్త్రీ అయి ఉండాలి. మన దేశంలో కుటుంబ కోర్టులు లేవు. (1983 నాటికి) ఇక్కడ విచారణలో రెండు సూత్రాలను అమలు పరుస్తున్నారు. పార్టీలు ఒకరికి మరొకరు

ప్రత్యర్థి అనే సూత్రం మొదటిది. 'ఇరువురు కక్షిదారులలో ఎవరు దోషులు' అనే విషయంపై ఆసక్తి చూపటం రెండవది. కాని నిజానికి "దంపతుల మధ్య కలిగిన వైమనస్య భావాన్ని ఎలా పోగొట్టాలి, వారిని ఎలా దగ్గరకు చేర్చాలి" అనేది ముఖ్య సూత్రంగా న్యాయమూర్తి ఆలోచన చేయాలి.

## ఒకే ఒక వ్యవహార సంహిత

కమిటీ ఒకే ఒక వ్యవహార సంహిత భారత పౌరులందరికీ వర్తించాలని బలంగా వాదించింది [34]

## క్రిమినలు లా

మన దేశంలో పరాయివాని భార్యతో సంపర్కం పెట్టుకోవడం నేరం. అలా వ్యభిచరించిన పురుషునికి శిక్ష పడుతున్నది. నేడు భారత శిక్షా స్మృతి (Indian Penal Code) సెక్షను 497 ఈ అంశాన్ని నిర్దేశిస్తున్నది. బ్రిటీషువారి రాకకు ముందు హిందూ ధర్మశాస్త్ర ప్రకారం స్త్రీ పురుషులు ఇద్దరూ నిందితులే. ఇప్పటికే స్త్రీ చాలా ఇబ్బందులకు, కష్టాలకు, అన్యాయాలకు గురి అవుతున్నది కనుక ఆమెపై నేరం మోపటం న్యాయం కాదని బ్రిటిషు ప్రభుత్వం తలపోసింది. దొంగతనానికి శిక్ష వేసినట్లు పరాయివాని భార్యతో పొత్తు పెట్టుకుంటే నేరమయింది. పరాయివాడి భార్య వాడి సొత్తనే భావం కన్పట్టుచున్నది. భార్యా భర్త ఇరువురూ వేరు వేరు వ్యక్తులు. ఎవరూ మరొకరి సొత్తు కాదు, ఆస్థికాదు. వ్యభిచారం విడాకులు కోరడానికి అవతలి పార్టీకి అవకాశం కల్పించవచ్చును కాని నేరంగా పరిగణింపబడరాదు. బహుశః కమిటీవారు ఇలాంటి ఆలోచనా ధోరణిని అనుసరించి యుండవచ్చు. భారత శిక్షాస్మృతిలోని 497 వ సెక్షనును తీసివేయమని కమిటీ నిశ్చితాభిప్రాయాన్ని వెలిబుచ్చింది. [35] భర్త మరల వివాహం చేసుకుంటే, భార్య అతనిపై క్రిమినలు కేసు పెట్టాలంటే వివాహమయిన చోటగాని లేక భార్యా భర్తలు చివరిసారిగా

కలిసి కాపురమున్నచోటగాని ఫిర్యాదు చేయాలి. ఇలాంటి పరిస్థితుల్లో భార్య తన పుట్టింట్లో ఉంటుంది లేక మరెక్కడో ఉద్యోగం చేసుకుంటూ జీవయాత్ర సాగిస్తుంటుంది. అలాంటి సందర్భంలో ఆమె శాసనం ప్రకారం ఫిర్యాదు చెయ్యాలంటే ఆమెకు కష్టం అవుతుంది. మరో ఊరిలో కేసు నడపడం తేలికవిషయం కాదు. అంటే ఆమెకు జరిగిన అన్యాయానికి ఆమెకు పరిష్కారమార్గం లేదన్నమాట. ఆమె ఆ అన్యాయాన్ని భరించి పడి ఉండాలన్నమాట. ఇలాంటి ఘోరాన్ని తప్పించే నిమిత్తం, భార్య కాపురముండే చోట ఉన్న కోర్టులో ఆమె తన భర్త ద్వితీయ వివాహం చేసుకున్నాడని నేరారోపణ చేయగల్గాలని కమిటీ భావ ప్రకటన చేసింది.[36]

కమిటీ నివేదికను భారత ప్రభుత్వం నిర్లక్ష్యం చేయుటం శోచనీయం. సమానత్వంకోసం హోదా కొరకు భారత స్త్రీలు చేసే పోరాటంలో ప్రముఖ పాత్రను విద్యావంతులు చైతన్యవంతులైన స్త్రీలు నిర్వర్తించాలి.[37]

దేశస్వాతంత్ర్యానంతరం భారతస్త్రీలకు చట్టరూపంలో కొన్ని హక్కులు వచ్చాయి. వాటికి రాజ్యాంగం హామీ ఇచ్చింది. అయినా ఆ హక్కులు స్త్రీలు అనుభవించటం లేదని తొమ్మిది లక్షల యాభై వేలు ఖర్చుచేసి మూడు సం॥ పరిశోధనచేసిన కమిటీ వారు తమ నివేదికలో పేర్కొన్న విషయం గమనార్హం.[38]

## నాల్గవ భాగం ఏడవ అధ్యాయం రిఫరెన్సులు

1. "భారత స్త్రీల హోదా" (1981 ఏప్రిల్‌లో హైదరాబాద్‌లో మహిళాభ్యుదయ సంస్థ ఆధ్వర్యాన జరిగిన సెమినారు రిపోర్టులోని ఎం. వి. రామమూర్తి వ్యాసం): పుటలు 13, 14
2. భారత ప్రభుత్వ ప్రచురిత మయిన 'సమానత్వం వైపు పయనం' (Towards Equality) పేరా 4-50 పుట 109
3. ,, 4-43 ,, 109
4. ,, 4-43 ,, 110

| | | | | |
|---|---|---|---|---|
| 5. | 'సమానత్వం వైపు పయనం' పేరా | 4-65 | పుట | 113 |
| 6. | ,, | 4-73 | ,, | 115 |
| 7. | ,, | 4-78 | ,, | 115 |
| 8. | ,, | 4-80 | ,, | 115 |
| 9. | ,, | 4-80 | ,, | 116 |
| 10. | ,, | 4-81 | ,, | 116 |
| 11. | ,, | 4-83 | ,, | 116 |
| 12. | ,, | 4-94 | ,, | 119 |
| 13. | ,, | 4-103 | ,, | 121 |
| 14. | ,, | 4-100 | ,, | 121 |
| 15. | ,, | 4-104 | ,, | 122 |
| 16. | ,, | 4-111 | ,, | 123 |
| 17. | ,, | 4-112 | ,, | 123 |
| 18 | ,, | 4-103 | ,, | 121 |
| 19. | ,, | 4-125 | ,, | 125 |
| 20. | ,, | 4-129 | ,, | 125 |
| 21. | ,, | 4-144 | ,, | 128 |
| 22. | స్త్రీ : ఎం. ఎచ్. కిద్వాయ్ [Shaik M. H. Kidwai : Woman (Light & Life pubiishers 1978)] | | పుట | 95 |
| 23. | ,, | ,, | పుట | 147 |
| 24. | 'సమానత్వం వైపు పయనం' పేరా | 4-150 | పుట | 129 |
| 25. | ,, | 4-159 | ,, | 131 |
| 26. | ,, | 4-160 | ,, | 131 |
| 27. | ,, | 4-161 | ,, | 131 |
| 28. | ,, | 4-194 | ,, | 136 |
| 29. | ,, | 4-173 | ,, | 133 |
| 30. | ,, | 4-205 | ,, | 138 |

31. 'సమానత్వం వైపు పయనం' పేరా 4-201 పుట 138
32. „ 4-226 „ 141
33. „ 4-233 „ 142
34. „ 4-237 „ 142
35. „ 4-247 „ 144
36. „ 4-245 „ 144
37. "భారత స్త్రీల హోదా" (1981) (సెమినారు రిపోర్టు) పుట 38
38. 'మహిళాభ్యుదయం' రచన : మల్లాది సుబ్బమ్మ పుట 13

# 8 వ అధ్యాయం : మహిళా సమాజాలు

## జాతీయస్థాయి

1954 లో ఉమెన్సు ఇండియన్ అసోసియేషను స్థాపకురాలు శ్రీమతి మార్గరెట్ కజిన్సు చనిపోయింది. ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు అధ్యక్షురాలు రేణుకా రే 1954 లో జరిగిన ఐక్యరాజ్య సమితి విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సమావేశానికి హాజరయి 'స్త్రీలహోదా' ను గురించి ఆలోచించుటకు నియమింపబడిన కమిటీలో సభ్యురాలిగా వున్నది. సరోజని నాయుడుకు మార్గరెట్ కజిన్సుకు స్మారకచిహ్నంగా ఉండగలందు లకు భారత ప్రభుత్వం నుండి ఉమెన్సు కాన్ఫరెన్సు ఐదు లక్షల రూపాయల విలువచేసే భవనాన్ని కొనుగోలు చేసింది.

1958 మే లో వచ్చిన వ్యభిచార నిర్మూలన శాసనం ( Suppression of Immoral traffic Act. ) ఉమెన్స్ కాన్ఫరెన్సు కృషి ఫలితమే. విధవా శరణాలయాలపై, బాలబాలికల ఆశ్రమాలపై అదుపు కావాలని సూరత్ మహాసభ (1966) తీర్మానాన్ని ఆమోదించింది. కష్టాలలో ఉన్న స్త్రీల కోసం 'బాపునూ ఘర్' ను 1965 లో ప్రారంభించింది. దానికి భవన స్థాపనోత్సవం 1966 లో జరిగింది. జాతీయ సంఘాన్ని అంతర్జాతీయ సంఘానికి (International Alliance of women) 1966 డిసెంబరులో అనుబంధం చేశారు.

1968 లో హర్యానా పంజాబు ప్రభుత్వం తండ్రి ఆస్థిలో కుమార్తె వాటాను తీసివేస్తూ హిందూ వారసత్వశాసనాన్ని సవరించే బిల్లును ప్రవేశ పెట్టింది. కాన్ఫరెన్సు బిల్లుకు వ్యతిరేకంగా భారీఎత్తున ప్రచారం చేసింది.

ప్రభుత్వం బిల్లును ఉపసంహరించుకున్నది. డిసెంబరు 1968 లో చండీఘర్‌లో ఒకే ఒక వ్యవహార సంహిత (Uniform civil Code) పై సెమినారు జరిగింది.

1969 లో కాన్ఫరెన్సు మంగుళూరులో (Mangalore) మహాసభ జరుపుకున్నది. బాలబాలికలకు తల్లిదండ్రుల శ్రద్ధ ఆప్యాయత, ఆరోగ్య సౌకర్యాలు, పోషకాహారము, విద్య, శిక్షణ, భద్రమైన గృహవసతి, వారి శ్రమ దోపిడి చేయబడకుండా ఉండటం అవసరం కావాలని తీర్మానించింది మహాసభ. కాన్ఫరెన్సుకు శాశ్వత భవన నిర్మాణం 1972 లో ప్రారంభమయింది. స్వంత భవనం ఉంటే దానిద్వారా కాన్ఫరెన్సుకు ఆదాయం సమకూరుతుందని ఆలోచన. రాత్రివేళల స్త్రీలు పనిచేయరాదనే సిద్ధాంతాన్ని రద్దు చేయించాలని కొంతమంది స్వప్రయోజనపరులు ప్రయత్నించారు. కార్మిక నాయకురాలు మణిబెన్ కారా ప్రోద్బలంతో కాన్ఫరెన్సు ఆ ప్రయత్నాన్ని వ్యతిరేకించింది.

1973 లో కాన్ఫరెన్సు దత్తత బిల్లును బలపరిచింది. 'మానవ హక్కుల ప్రకటన' 25 వ వార్షిక దినోత్సవాన్ని కాన్ఫరెన్సు యొక్క 420 శాఖలు జరిపాయి. అంతర్జాతీయ మహిళా సంఘం (International Alliance of women) యొక్క త్రిసంవత్సర సమావేశాన్ని కాన్ఫరెన్సు ఏర్పాటు చేసింది 1973 నవంబరులో. 'అంతర్జాతీయ శిశువుల అత్యవసర నిధి' (UNICEF) కి కాన్ఫరెన్సును అనుబంధం చేశారు. ఐక్యరాజ్య సమితికి అనుబంధమైన 95 వ ప్రభుత్వేతరసంస్థంగా కాన్ఫరెన్సు గుర్తింపును పొందింది.

ప్రపంచజనాభా దినోత్సవ సంవత్సరం 1974 లో కాన్ఫరెన్సు అఖిల భారత సమావేశం గుంటూరులో జరిగింది. లక్ష్మీ రఘురాం అధ్యక్షపీఠం అలంకరించింది. కాన్ఫరెన్సు 1973 లోనే కుటుంబ నియంత్రణ ప్రచారము మొదలిడింది.

కాన్ఫరెన్సు అనేక కార్యక్రమాలను చేపట్టింది. ఉద్యోగినులు వసతి గృహాలు, బాల్‌వాడీలు, పొదుపు కార్యక్రమాలు, కుట్టు కేంద్రాలు, ఉచిత వైద్య సహాయం, సంచార ఆరోగ్య దళాలు, కుటుంబనియంత్రణ కేంద్రాలు, చౌక దుకాణాలు, అంధులకు పాఠశాలలు, మానసికంగా వెనుక బడిన వారికి కేంద్రాలు, మెట్రిక్యులేషను పరీక్షకు తయారు చేసే నిమిత్తం వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యా బోధనా కోర్సులు, వయోజన విద్యా కేంద్రాలు, కుష్టువ్యాధి నివారణనిలయా , కాంటీన్లు, రక్త నిధులు, ముద్రణాలయాలు, వివాహ సలహా కేంద్రాలు, పిండిమరలు, ఆహార తనిఖీ దళాలు ఇలా ఎన్నింటినో చేపట్టింది కాన్ఫరెన్సు. 2

కాన్ఫరెన్సువారి మితవాద వైఖరి నచ్చని కమ్యూనిస్టు మహిళలు 1954 లో 'భారత స్త్రీల జాతీయ ఫెడరేషనును' (National Federation of Indian women) నెలకొల్పారు. కాన్ఫరెన్సులాగా కాక ఫెడరేషను శ్రామిక స్త్రీలను సంఘటితం చేయటానికి పూనుకున్నది. 1945 లో స్థాపించబడిన అంతర్జాతీయ ప్రజాస్వామిక ఫెడరేషనుకు భారత ఫెడరేషను అనుబంధ సంస్థ అయింది. 'ఆంధ్రమహిళా సమాఖ్య' భారత ఫెడరేషనుకు అనుబంధ సంస్థ.

## రాష్ట్రస్థాయి

1919 నుండి 1942 వరకు జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళా సభలలోను, 1943 నుండి 1952 వరకు జరిగిన నిజాం రాష్ట్ర ఆంధ్ర మహిళా మహా సభలలోను ఉదయించిన ఉత్సాహం తరువాత నీరుకారిపోయింది. క్లబ్బులు స్థానిక లేక ప్రాంతీయ సంఘాలు అనుబంధ సంస్థలుగా ఉన్న స్థితిలో ఉంది కాన్ఫరెన్సు. ప్రాంతీయ సంఘాలు, క్లబ్బులు నిర్మాణ కార్యక్రమం వైపు తమ దృష్టి సారించాయి. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు, సామాజిక సంక్షేమ బోర్డులు ఇచ్చే గ్రాంటుల సహాయంతో కార్యక్రమ నిర్వహణ సాగింది.

తే 28-7-1963 న కూడిన ఆంధ్ర మహిళా మహాసభ సమావేశ కేంద్రం హైదరాబాద్. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు. బంగారం విషయమై (మనిషికి పది తులాలకు మించి వుండరాదని సీలింగు పెట్టారు) భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాన్ని మహాసభ బలపరిచింది. స్థానిక స్వపరిపాలనా సంస్థలలో స్త్రీలకు ఇతోధిక ప్రాతినిధ్యాన్ని కోరింది మహాసభ.

## ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య

ఆంధ్ర మహిళా సమాఖ్య ద్వితీయ మహాసభ కృష్ణాజిల్లా అంగలూరులో 1954 లో సమావేశమయింది. 1957 తెలుగు స్త్రీలు జాతీయ మహిళా ఫెడరేషనును అఖిలభారత మహాసభకు విజయవాడలో ఆతిథ్యమిచ్చారు.

1958 నుండి 1964 వరకు కమ్యూనిస్టు మహిళల కార్యక్రమాల్లో స్తబ్దత వచ్చింది. ఐక్య కమ్యూనిస్టు పార్టీలో భేదాభిప్రాయాలు, అనుభవజ్ఞులైన నాయకుల సలహా మార్గదర్శకత్వాలు లేకపోవడం కారణాలుగా భావించవచ్చును.

1965లో కమ్యూనిస్టు మహిళలు హైదరాబాదులో సమావేశమయినారు. 300 మంది సమావేశానికి వచ్చారు. నూతన సంఘ నిర్మాణానికి నిబంధనావళి వగైరాలను తయారుచేసే నిమిత్తం ఒక కమిటీని వేశారు. 1964 లో కమ్యూనిస్టు పార్టీ చీలిందన్న విషయం సర్వులకూ విదితమే. పార్టీలో వచ్చిన చీలిక వారి ప్రభావంలో ఉన్న ప్రజా సంస్థలకు ప్రాకింది. భారత కమ్యూనిస్టు పార్టీకి చెందిన స్త్రీలకు, అందుకే, వేరే తమకు ప్రత్యేకంగా ఒక సంఘాన్ని స్థాపించుకోవటానికి నిశ్చయించుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ మహిళా మహాసభ 1970 లో కొత్తగూడెంలో కూడింది. 10 వేలమంది సభ్యుల ప్రతినిధులుగా 1000 మంది వచ్చారు. ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య ఉద్భవించింది. ఊరేగింపులో 5 వేల

మంది పాల్గొన్నారు. 10 వేల మంది బహిరంగ సభకు హాజరైనారు. ఇతర ప్రజా సంస్థలతో కలిసి బంజరుభూములు, భూసంస్కరణలు, ఇళ్ళ స్థలాలు వీటికోసం జరిగిన ఉద్యమాలలో కృషి చేసింది సమాఖ్య. అనంతపురంలో ప్రభుత్వ స్థలంలో 500 ఇళ్ళు నిర్మించారు. బంగ్లాదేశ్ సహాయనిధి, భూకంప బాధితుల సహాయనిధి, వియత్నాం నిధి వీటికి విరాళాలు వసూలు చేసింది.

భారత సోవియట్ సంధికి అనుకూలంగా ప్రచారం చేసింది సమాఖ్య కుట్టుకేంద్రాలు నెలకొల్పింది. స్థానిక సమస్యలను పరిష్కారం చేసింది. అధిక ధరలకు వ్యతిరేకంగా 1972 లో 50 వేల దస్కతులను సేకరించింది. అధిక ధరలకు వ్యతిరేకంగా, రేషన్ షాపులు ఇతోధికంగా తెరవాలని 50 కేంద్రాలలో రిలే నిరాహార దీక్షలు, ధర్నాలు, పికెటింగులు జరిగాయి. సమాఖ్యవారు తెలియజేసిన లెక్కల ప్రకారం సభ్యత్వం 38 వేలకు పెరిగింది. 18 జిల్లాలకు సమాఖ్య వ్యాప్తి చెందింది. 4 వ మహాసభ కృష్ణాజిల్లా వక్కలగడ్డలో కూడింది. 13 జిల్లాలనుండి వెయ్యిమంది ప్రతినిధులు వచ్చారు. భూసంస్కరణలు అమలు జరపమని, స్త్రీలపై సామాజిక దౌర్జన్యాన్ని ఆపుచేయుమని, అధిక ధరలను అరికట్టమని, స్త్రీలకు ఉద్యోగాలలో రిజర్వేషనులు ఇవ్వమని తీర్మానాలు ఆమోదింప బడినాయి.

1974-75 లో సమాఖ్య చరిత్రలో క్రొత్త మలుపు వచ్చింది. [4]

## ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం

మార్క్సిస్టు పార్టీ వారి మహిళా సంఘంపేరు 'ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం'. సమాఖ్య, మహిళా సంఘం రెండూ పనిచేసే తీరు ఒకటే. కాకపోతే ఎవరి పార్టీ పాలసీని వారు బలపరుస్తారు. కార్మికులు, వ్యవసాయ కూలీలు, బీదరైతులు ఈ వర్గాలకు చెందిన స్త్రీలలోనుండి అధికంగా సభ్యులు ఉంటారు.

1968 లో రాష్ట్ర సంఘానికి ఒక ఆర్గనైజింగు కమిటీని వేశారు. దానికి మానికొండ సూర్యావతి అధ్యక్షులు. మోటూరు ఉదయం

కార్యదర్శి. [5] 1972 లో మరొక ఆర్గనైజింగు కమిటి ఏర్పడింది. ఈ సారి మల్లు స్వరాజ్యం సహాయ కార్యదర్శి అయింది. [6] ప్రథమ ఆంధ్రప్రదేశ్ మహిళా మహాసభ 1974 లో ఖమ్మంలో సమావేశమయింది. 5 వందలమంది ప్రతినిధులుగా వచ్చారు. 6 వేలమంది స్త్రీలు ఊరేగింపులలో పాల్గొన్నారు. 15 వేలమంది స్త్రీలు బహిరంగ సభకు హాజరయినారు. ఒక సావనీరును ప్రచురించారు. [7]

మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ ఆలోచనా సరళిని ఈ సంఘం అనుసరిస్తున్నది. మార్క్సిస్టు స్త్రీలు 1964 నుండి చైతన్యవంతంగా పనిచేస్తున్నారు. కాని 1968 లో సంఘం పుట్టింది. ఐక్య కమ్యూనిస్టు పార్టీ రోజుల్లో స్త్రీలు 1947 నుండి 1951 వరకు సాగించిన పోరాటాలనుండి ఉత్తేజం పొందారు.

1964 లో భారత దేశంలో పన్నెండు వందలమంది మార్క్సిస్టు కార్యకర్తలను డెటిన్యూలుగా కేంద్రప్రభుత్వం జైళ్ళలో పెట్టింది. డెటిన్యూల భార్యలు నిర్బంధానికి వ్యతిరేకంగా ఆందోళన చేశారు. బహిరంగ సభలు పెట్టి ప్రచారం చేశారు. వందలు వేల సంఖ్యలో ప్రజలు ఆ సభలకు హాజరైనారు. ఒక రకంగా 1964 లోని కమ్యూనిస్టుల చీలిక తదనంతరం అదే పెద్ద కార్యక్రమం. [8]

1968 మార్చి నెలలో గుంటూరు జిల్లా కాజ గ్రామంలో 80 మంది కార్యకర్తల అధ్యయనం శిబిరం నిర్వహించింది సంఘం. [9] 1972 మే నెలలో విజయవాడలో రాష్ట్రస్థాయిలో మరొక శిక్షణ శిబిరం జరిగింది. [10] హైదరాబాదు జిల్లా శిక్షణ శిబిరం 1974 లో నిర్వహింపబడింది. [11]

1970 వరకు కార్యక్రమాలు మధ్య తరగతిలోనే జరిగాయి. అప్పటి నుండి శ్రామిక స్త్రీలను కలుపుకొని రావడానికి, వారి సమస్యలకు ఇతోధిక ప్రాముఖ్యత ఇవ్వడానికి నిశ్చయమైనది. [12] గ్రామాలలోని వ్యవసాయ కూలీ వర్గానికి, పట్టణాలలోని కార్మిక వర్గానికి విశేష ప్రాధాన్యత ఇచ్చారు. ఆత్కూరు, గుడివాడ, కురుమద్దాలి (కృష్ణాజిల్లా), దామర మడుగు

(నెల్లూరు జిల్లా) లలోని వ్యవసాయ కార్మికుల పోరాటాలకు అండగా స్త్రీలను ప్రగతిశీల మహిళా సంఘాలు సమీకరించాయి. దామర మడుగులో 100 మంది స్త్రీలు అరెస్టు కాబడినారు. [13] గన్నవరం తాలూకా, తాడేపల్లి (పశ్చిమ గోదావరి), ఎల్లాయి పాలెం (నెల్లూరు జిల్లా) లలో వ్యవసాయ కార్మికుల పోరాటాలలో స్త్రీలు అగ్రశ్రేణిన నిలిచారు. [14]

ఇతర ప్రజా సంఘాలతో కలిసి అధికధరలకు వ్యతిరేక ఆందోళనలో పాల్గొనటానికి సంఘం ఉత్తేజాన్ని కలిగించింది. 1653 మంది స్త్రీలు పికెటింగు చేశారు. 525 మంది అరెస్టు అయినారు. 80 మంది స్త్రీలకు లాఠీ దెబ్బలు తగిలాయి. [15] అఖిల భారత రైతు సంఘం పాలకొల్లులో కౌన్సిలు మీటింగు జరుపుకుంటే మహిళా సంఘం సహాయం చేసింది. సెంట్రల్ ఫెడరేషను ఆఫ్ ట్రేడ్ యూనియన్సు (CFTU) - మార్క్సిస్టుల కార్మిక ఫెడరేషను-నెల్లూరులో 1978 లో అఖిలభారత మహాసభ జరుపుకుంటే మహిళా సంఘం విరాళాలు వసూలు చేసి ఇచ్చి కార్మిక ఫెడరేషనుకు ఎంతో బలాన్ని చేకూర్చింది. [16] విజయవాడలో అగ్ని ప్రమాదాలు సంభవించి నపుడు ఇతర మహిళా సంఘాలతో కలిసి కమిటీని నిర్మించి దానిద్వారా బాధితుల సహాయార్థం ధనం, దుస్తులు, వస్తువులు, వంట పాత్రలు వగైరా వసూలు చేసి ఆర్తులకు అందించింది. [17]

సంఘం యొక్క గణనీయమైన కార్యక్రమం పుస్తకాల ప్రచురణ, కరపత్రాల ప్రకటన. 'మహిళోద్యమంలో చేరండి', 'విప్లవ మార్గంలో స్త్రీలు', 'భారత దేశంలో స్త్రీల హోదా' అలాంటివి. [18]

రాష్ట్రస్థాయిలో ఏదో ఒక రాజకీయ పార్టీతో అనుబంధమో లేక దాని ప్రభావమో లేని మహిళా సంఘం లేనేలేదు. అంతే కాక ఏ ఒక్క సంఘమూ అన్ని జిల్లాలలో వ్యాప్తి చెందలేదు. ఆయా రాజకీయ పార్టీలకు ప్రాబల్యం ఉన్న ప్రదేశాలలో ఆయా మహిళా సంఘాలకు సభ్యత్వం వచ్చేది,

## స్థానిక మహిళా సంఘాలు

కొన్ని సంఘాలను మాత్రమే పేర్కొనడం సంభవిస్తున్నది. ఆంధ్ర మహిళా సభ (మద్రాసు) దినదినాభివృద్ధి చెందింది. నర్సింగ్‌హోంకు 1954 లో పిల్లల వార్డును, 1957 లో ఐమూకీ రోగులకు మందులిచ్చే శాఖను, తరువాత దంత చికిత్సాలయాన్ని, కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని కలిపింది. నర్సులను, మంత్రసానులను తయారు చేయటానికి ఒక శిక్షణ సంస్థను నెలకొల్పింది. 1964 వరకు 'ఆంధ్రమహిళ' పత్రికను నడిపింది.

ఆంధ్రయువతీ మండలి 1935 లో ప్రారంభించబడింది. పి. అనంత లక్ష్మిదేవి, ఐ. సర్వతి దేవి, వై. సీతాకుమారి, ఎ. రామకృష్ణారావు, కె. వి. రంగారెడ్డి, మాడపాటి హనుమంతరావు, వ్యవస్థాపకులు, రంగమ్మా ఓబుల్ రెడ్డి, బి. అనంత లక్ష్మిదేవి, ఐ. శ్యామలా దేవి సబ్ కమిటీ మెంబర్లుగా వుండి ధనం సంపాదించారు.[10]

ఆంధ్రయువతీ మండలి, హైదరాబాద్ ఉద్యోగుల వసతి గృహాన్ని 1958 లో తెరిపించింది. నాచారం, రమంతపురం, అంబకుశాపురం, ఉప్పల్, హిమయత్‌నగర్‌లలో సంక్షేమ విస్తరణ కార్యక్రమాలను 1961 లో చేపట్టింది. 1958 లో శిశువసతి కేంద్రం ఏర్పాటు చేసింది. 1955 లో కుట్టు ట్రైనింగు కేంద్రాన్ని ప్రారంభించింది. సంగీత తరగతులు 1955 లో ఆరంభమయినాయి. శిశువిహార్ మాంటిస్సోరి స్కూలు 1955 లో ఏర్పాటయింది. హైస్కూలు 1963 - 68 నాటికి 10 క్లాసులతో శోభిల్లింది. మండలికి పెద్ద స్వంత భవనం ఉన్నది.

స్త్రీ హితైషిణీ మండలి బాపట్ల స్వంత భవనాన్ని నిర్మించుకో గల్గింది వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యాలయం నడిపింది. చర్చలు, వాగ్వాదాలు, స్త్రీలకు ఆసక్తికర విషయాలపై బహిరంగ సభలు, ఆటలు సాగించింది. మోదుకూరు మహిళా సంఘం (గుంటూరుజిల్లా) వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యాలయాన్ని, కుట్టు సెంటరును, ఆరోగ్య కేంద్రాన్ని నిర్వహించింది.

భారత మహిళామండలి, విజయవాడ కొమర్రాజు అచ్చమాంబచే స్థాపితం. మండలికి పెద్ద ఆవరణ కల భవనం ఉన్నది క్లబ్, ఆటలు, బహిరంగ సభలు దాని కార్యక్రమాలు. నవజీవన మండలి రామకోట్, హైదరాబాద్ స్త్రీలకు కళాశాల నడుపుతున్నది.

వాసవ్య మహిళామండలి, విజయవాడ 1965లో పుట్టింది. వాస్తవికత, వ్యక్తిత్వం, సామాజిక దృష్టి ఈ భావాల ప్రచారం ముఖ్య కార్యక్రమం.

మహిళామండలి, తెనాలి భవనం కలిగియుండి క్లబ్బుగాను, మహిళాసంఘం గాను పని చేస్తున్నది.

భారత మహిళా సేవా మండలి, పెదపూడి 1961 లో స్థాపింపబడినది. దానిని శ్రేష్ఠమైన మహిళా మండలిగా ఎంపిక చేసింది ప్రభుత్వం.

శారదా మహిళా విజ్ఞాన సమితికి (బాపట్ల) భవనం ఏర్పడింది. హిందీ తరగతులు, కుట్టుకేంద్రం, స్త్రీల సమావేశాలు దాని ప్రత్యేకత.

రైల్వే మహిళామండలిలో (విజయవాడ) రైల్వే పనివారి స్త్రీలు సభ్యులు. 1966 లో ప్రారంభమయింది.

మహిళా లేడీస్ రిక్రియేషను క్లబ్, విజయనగరం 1963 లో నెలకొల్పబడింది. దామరాజు లోపాముద్ర ఆ క్లబ్ కార్యదర్శి. సాధువమ్మ సేవా సదనం సత్తెనపల్లిలో 1958 లో సాధువమ్మచే స్థాపింప బడింది.

కుట్టు, సంగీతం, హిందీ నేర్పించేవారు. కండెన్సుడు కోర్సులు నిర్వహించేవారు.[20]

స్త్రీల గృహపరిశ్రమల సహకార సంఘం బాపట్లలో 1948 లో వెలగపూడి సరస్వతమ్మ, కోటంరాజు అన్నపూర్ణమ్మ, దేశరాజు బాపాయమ్మ తదితరులు స్థాపించారు. అనేకమంది కుట్లు, అప్పడాలు, బుట్టలు, చేతిపనులు చేసి బ్రతుకుతెరువు గడించారు. ఊటుపూరి లక్ష్మీకాన్తమ్మ, వెలగపూడి వైదేహి, మల్లాది సుబ్బమ్మ పదిహేను సం॥రాలు పనిచేసి అభివృద్ధిలోకి తెచ్చారు.[21] 1958 లో సుభాషిణి మాసపత్రిక సోషల్ వెల్ఫేరు కేంద్రశాఖ వారు A. C. కృష్ణారావు ఆధ్వర్యంలో మొదలుపెట్టారు. స్త్రీ జనాభ్యుదయ కార్య క్రమాలు ప్రచురించేందుకై స్థాపింపబడింది.[22]

# నాల్గవ భాగం ఎనిమిదవ అధ్యాయం రిఫరెన్సులు

1. ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సువారి 1982 సంవత్సరపు వార్షిక నివేదిక : పుటలు 69 నుండి 87 వరకు
2. ,, ,, పుట 3
3. 'ఆంధ్ర మహిళ' 1963 ఆగస్టు.
4. ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య 5 వ మహాసభ సందర్భంగా వెలువడిన సావనీరులో పుటలు 11, 13, 15 : గుజ్జుల సరళాదేవి వ్యాసం
5. జూన్ 1980 లో జరిగిన ఆం. ప్ర. మహిళా సంఘం 4 వ రాష్ట్ర మహాసభ సావనీరులో రిపోర్టు : పుట 36
6. ,, పుట 41
7. ,, పుట 48
8. ,, పుటలు 33 నుండి 35
9. ,, పుట 35
10 ,, పుటలు 40, 41
11. ,, పుట 57
12. ,, పుటలు 36, 37
13. ,, పుటలు 38, 39
14. ,, పుటలు 56, 59, 55
15. ,, పుటలు 42, 43
16. ,, పుట 43
17. ,, పుటలు 44 నుండి 47
18. ,, పుటలు 49, 50
19. ఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్సు సావనీరు పుట 16
20. 'సుభాషిణి' సోషల్ వెల్ఫేర్ బోర్డువారి మాసపత్రిక ఏప్రిల్ 1962
21. ,, ,, మే 1962
22. ఆంధ్రమహిళ 1961 జూన్ పుట 14

# 5 వ భాగం

# మహిళా దశాబ్దం [1975-83]

## 1 వ అధ్యాయం : దశాబ్దపు ప్రాముఖ్యత

1948 లో ఐక్యరాజ్య సమితి వారు ప్రకటించిన 'మానవహక్కుల పత్రం' స్త్రీ పురుషులలో ఎన్నో ఆశలను, ఆకాంక్షలను రేకెత్తించింది. ఐక్యరాజ్య సమితి రూపొందించిన అనేక ఒప్పందాలను (CONVENTIONS) సభ్యత్వగల దేశాలు అంగీకరించాయి. అందువల్ల అనేక దేశాల స్త్రీలు తమ హక్కులను డిమాండు చేయసాగారు. చివరకు ఐక్యరాజ్య సమితి సభ్యదేశాలు, స్త్రీల సంఘాలు, ఐక్యరాజ్య సమితి సంస్థలు వీటిప్రతినిధులతో ఒక మహా సభను 1975 లో మెక్సికోలో సమావేశ పరిచింది. 10 రోజుల పాటు సమాలోచనలు జరిగాయి. 13 వందల మంది ప్రతినిధులు వచ్చారు. ఈ సమావేశం జరుగుతున్న సమయంలోనే మరో మహాసభ ఆ పట్టణంలోనే జరిగింది. దీనిలో ప్రతినిధులు కేవలం మహిళా సంఘాల ప్రతినిధులే. రెండవ మహాసభలో మితవాదులు, అతివాదులు, స్త్రీ విమోచన వాదులు అందరూ ఉన్నారు ఒక తీవ్రవాది అయిన స్త్రీ పురుషులను 'పురుష దురహంకార సూకరాలు' అని నిందించింది. ఇది సంచలాత్మకమైన సంబోధన కనుక పత్రికా ప్రపంచపు దృష్టిని ఆకర్షించింది. ఆరోగ్య, వృత్తులు, ఉద్యోగం, వేతనాలలో పని నియమాల లో ఫ్యాక్టరీలలో కార్యాలయాలలో స్త్రీ పురుష వివక్ష, అభివృద్ధి, దేశఆర్థిక సామాజిక ప్రక్రియలలో ప్రవేశమూ, స్త్రీలను వాడుకోకుండా తీసుకోదగుచర్యలు వీటన్నింటిని స్త్రీల పరంగా ఐక్యరాజ్య సమితి అధికార యుతంగా పిలిచిన మొదటి మహా సభలో చర్చించారు.

ద్వితీయ మహాసభ, అనధికార యుతమైనది కనుక క్రొంగొత్త అంశాలను చర్చించింది. మహిళా సంఘాలు అనుసరించదగు తాత్విక

సిద్ధాంతం ఏమిటనేది చర్చనీయాంశం అయింది. లిబరలు ఫిమినిజం (మితవాద స్త్రీ విమోచన సిద్ధాంతం) నుండి రాడికల్ ఫిమినిజం (తీవ్రవాద స్త్రీ విమోచన సిద్ధాంతం) వరకు ప్రస్తావనకు వచ్చాయి. మిత వాద తత్వంనుండి విప్లవ తత్వం వరకు అన్ని భావనలు వెలువరింపబడినాయి. "స్త్రీలు : శాంతి" అనే సమస్యను కూలంకషంగా చర్చించారు. పితృస్వామ్య సమాజం యొక్క దుస్సహమైన దుష్ట లక్షణాలను సంపూర్ణంగా పరిశీలించారు. స్త్రీల యెడ అత్యాచారాలు వారి మనస్సులపై శరీరాలపై జరిగే హింస ముఖ్యమైన చర్చనీయాంశమయింది.

వేతనాలు, పని పరిస్థితులు, ఉద్యోగం మొదలగు విషయాలకు సంబంధించి వివక్షను పూర్తిగా తొలగించవలసినదని ఐక్య రాజ్య సమితి సభ్య దేశాలకు ఈ మహాసభలు విజ్ఞప్తి చేశాయి. మహిళా సంఘాలను ఉత్తేజపరిచాయి. సమాజాభివృద్ధి కొరకు పట్టుదలతో, ఉత్సాహంతో పని చెయుమని ఉద్బోధించాయి. 1975 మహిళా సంవత్సరంగా ప్రకటింప బడింది. తరువాత 1975 నుండి 1985 ను మహిళా దశాబ్దంగా ప్రకటించారు.

ఈ దశాబ్ద ప్రథమ భాగం 5 సంవత్సరాలలోని కృషిని సమీక్షించుటకు 1980 లో కోపెన్ హాగన్‌లో ఒక మహాసభ జరిపారు. ఐక్యరాజ్య సమితి వారు. ఆనాటి చర్చలలో సమస్యలపై ఆసక్తి, పట్టుదల కలిగింది. ఒక ప్రయోజనాన్ని ఆశించి పనిచేయుడం కన్పించింది. శాసనాల విషయంగా పెద్ద మార్పు రానందున దానిని గురించి ప్రతినిధులు ఆందోళన వెలిబుచ్చారు. 1975 తరువాత కొన్ని సభ్య దేశాలలో కొంత చలనం కలిగింది. వారు కొన్ని శాసనాలను స్త్రీలకు ప్రయోజన కరమైన వాటిని చేశారు. స్త్రీ జనాభ్యుదయానికి అది కొంత మంచి చేసిందని చెప్పవచ్చును.

## ఐదవ భాగం ఒకటవ అధ్యాయం రిఫరెన్సులు


1. "మహిళాభ్యుదయం" మల్లాది సుబ్బమ్మ : 2 వ భాగం పుటలు 4-10 'మహిళా దశాబ్దం' అనే వ్యాసం.

# 2 వ అధ్యాయం : జాగృతి : సంఘనిర్మాణం

మహిళా దశాబ్ది ప్రకటన భారతదేశ స్త్రీలలో మహత్తర జాగృతిని కలుగజేసింది. ఆ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ కూడా ప్రభావితమయింది. తెలుగు, ఇంగ్లీషు దిన పత్రికలు మహిళా సమస్యల చర్చకు వారానికి ఒక రోజు పూర్తి పుటను కేటాయించడం పెరుగుతున్న స్త్రీల జాగృతికి నిదర్శనం. ఈ చైతన్యం వలన అనేకమంది స్త్రీలు సంపాదకునికి లేఖలు, వ్యాసాలు రాయడం ఆరంభించారు. స్త్రీ యొక్క వ్యక్తిత్వం, తన ఇచ్ఛవచ్చినవానిని వివాహమాడటానికి ఆమెకు గల అధికారం, ఇంకా ఇతర స్త్రీల సమస్యలపై రచయిత్రులు కథలు, నవలలు రాయనారంభించారు.

ఈ భావ ప్రకటన పట్టణాలలోని వారికి, మధ్య తరగతి వారికే పరిమితమయిందన్న అంశాన్ని విస్మరించరాదు. చాలా మహిళా సంఘాలు 'నిర్మాణ' కార్యక్రమాలకు అంకితమయినాయి. బాల్‌వాడీలు, వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యను బోధించే పాఠశాలలు, హిందీ తరగతులు, సంగీత నాట్య పాఠాలు, కుట్టుపని నేర్పడం, ఇవి మహిళామండలుల ముఖ్య కార్య కలాపాలనాయి. స్త్రీలలో చైతన్య వ్యాప్తి విస్మరించబడింది. ఈ ఉపయోగకరమైన, ముఖ్యమైన పనిని కొద్ది సంఘాలు మాత్రమే చేపట్టాయి.

నల్గొండ జిల్లాలోని భువనగిరి తాలూకా లాంటి ఒకటి రెండు ప్రాంతాలలో తప్ప కనీస వేతన చట్టం అమలుకు స్త్రీలను సంఘటితం చేయటంలేదు. చేసేపనితో నిమిత్తం లేకుండా సమానమైన కాలంలో పని చేసే స్త్రీ పురుషులకు సమానమైన వేతనము ఇవ్వాలనే సూత్రం గ్రామాదులలో అంగీకరింపబడలేదు. స్త్రీల మనస్సులలోనే చోటుచేసుకో

లేదు. రైతు సంఘాలు, వ్యవసాయ కార్మిక సంఘాలు స్త్రీల ఈ ప్రత్యేక సమస్యపై శ్రద్ధాసక్తులు ప్రదర్శించడం లేదు. అందువలన స్త్రీలకు ప్రత్యేకంగా సంఘాలు ఉండాలా లేక ఉన్న సంఘాలలో స్త్రీల సమస్యల కోసం ప్రత్యేక విభాగాలు ఉండాలా అనే భావం స్ఫురిస్తున్నది. అనేక 'విప్లవ' పార్టీలు, సంఘాలు ఈ సమస్యపై దృష్టి సారించక పోవటం శోచనీయం. వారు అలా చేయటం చాలా ప్రమాదకరం. జనాభాలో సగమైన స్త్రీల సమస్యలను పట్టించుకోనందున వారు దేశభవిష్యత్తునే ప్రమాదంలోనికి లాగుతున్నారు.

1975 లోనే మహిళా దశాబ్దం ప్రకటించ బడినా ఈ నూతన ఆధునిక భావాన్ని ఏ అఖిల భారత మహిళా సంఘము స్వీకరించలేదు; క్రొత్త సంఘం పుట్టలేదు. సెమినార్లు జరుపుతున్నారు; పరిశోధనలు సాగుతున్నాయి 1980 లో ఒక జాతీయ మహాసభ జరిగింది బొంబాయిలో. అయినా స్త్రీ శక్తి అభివృద్ధికోసం, వికాసంకొరకు ఏ ఉద్యమమూ సంఘటిత రూపంలో ఉద్భవించలేదు.

వరకట్న మరణాలు, స్త్రీలను వేధించటం, స్త్రీలపై అత్యాచారాలు, హింస, మానభంగాలు వీటిపైన స్త్రీలు ఎక్కువగా ఆలోచిస్తున్నారు. దీనికి మూడు కారణాలు ఉన్నాయి. ఆందోళన చేసే కార్యకర్తలు మధ్యతరగతివారు. స్త్రీలలో సామాజిక చైతన్యం ఉన్నవారు బస్తీలలో ఉద్యోగాలు చేసేవారు కనుక సాధారణంగా పల్లెటూళ్ళకు పోరు; గ్రామీణ స్త్రీల సమస్యలు ఎత్తుకోరు. అదీ గాక పత్రికలు విధ్వంసమైన వార్తలకు విచిత్రమైన విషయాలకు ప్రాధాన్యత ఇస్తున్నాయి.

మహిళా కార్యకర్తలలో గ్రామాల నుంచి వచ్చి నాయకత్వం వహించే వారు బహు కొద్దిమంది. విద్యార్థులలో విప్లవ కారులకు ఆదర్శంపై అభిమానం ఉన్నా, వారికి స్త్రీల సమస్యలు పూర్తిగా అవగాహన కాలేదు; స్త్రీల సమస్యలపై గట్టి ప్రయత్నం చేయగల ఓపికా పట్టుదలా కూడా వారికి లేవు. రోగ నిర్ణయం సరిగా చేశామని భావించినా - చేశామని కాదు - వైద్యం అందుబాటులో లేకుండా వుంది. స్త్రీల పరిస్థితి అలా ఉంది.

# 3 వ అధ్యాయం :

# స్త్రీ విమోచన సిద్ధాంతాలు

స్త్రీల హోదాను గురించి, మానవ చరిత్ర ప్రారంభమయి నప్పటి నుండి ఇప్పటి వరకు వచ్చిన సిద్ధాంతాలను పరిశీలించడం అప్రస్తుతం కాదు. భావాలు ఒక సారి పుట్టి తేలికగా నశించవు. సామాజిక వ్యవస్థ మారవచ్చును. కాని గత కాలపు భావాలు, ఆదర్శాలు ప్రజల మనస్సులపై రాజ్యాధికారం సాగిస్తాయి. 1966 లో కమ్యూనిస్టు చైనా నాయకుడు మావో 'సాంస్కృతిక విప్లవాన్ని' ప్రారంభించినప్పుడు ఈ అభిప్రాయానికి విలువ వచ్చింది. కన్ఫ్యూసియస్ భావాలు ఇంకా ప్రజల మీద ప్రభావం చూపుతున్నాయని ఆయన ఆరోపించాడు.

అనేక సిద్ధాంతాలు పుట్టున్నాయి, గిట్టున్నాయి. ఆ సిద్ధాంతాల ప్రాతిపదిక వాస్తవానికి దూరంగా ఉండటంతో అవి నశిస్తున్నాయి. పురుషుడి మెదడు స్త్రీ మెదడుకన్నా పెద్దది కనుక పురుషుడు స్త్రీ కన్నా అధికుడు అనే భావానికి శాస్త్రాధారం లేదు. మెదడును శరీరాన్ని తూకం విషయంలో లెక్కలోకి తీసుకుంటే పురుషుల విషయంలో ఆ నిష్పత్తి స్త్రీల విషయంలోని నిష్పత్తి కన్నా పెచ్చుగా లేదు. అదీగాక ఏనుగు మెదడు మనిషి మెదడుకన్నా పెద్దదే అయినా అంత మాత్రాన ఏనుగు మనిషికన్నా తెలివి కలదని అనలేము కదా! అయినా కొంతమంది పురుషులు ఇలాంటి భావాలను ప్రచారం చేస్తున్నారు.

మరి కొంతమంది పురుషులు ఇంకో విచిత్రమైన వాదనను లేవ నెత్తుతున్నారు. పురుషుడి శారీరక బలం స్త్రీ శారీరక బలం కన్నా ఎక్కువది కనుక స్త్రీ పురుషునికి లొంగి ఉండాలని వారి వాదన.

ఈ యంత్రి యుగంలో శారీరక బలాన్ని గురించి పొగుడుకుంటూ, అధికృతను ఆశించటం బుద్ధిమాంద్యంతో కూడినపని లేదా కుతంత్రపు పద్ధతి. 'పిల్లలను కని పెంచే బాధ్యత ప్రకృతి స్త్రీకి కేటాయించింది కనుక ఆమె పురుషులతో సమదీటుగా అన్ని పనులూ చేయలేదు, అన్ని వృత్తులూ చేపట్టలేదు కనుక పురుషులు స్త్రీలకంటే అధికులు' అనేది మూడవ వాదన. జన్మ నిగ్రహమూ, గర్భస్రావము అందుబాటులో ఉన్న ఈ రోజుల్లో స్త్రీలకు మాతృత్వం తప్పని సరి కావటంలేదు. అది కేవలం ఐచ్ఛికం. జీవితమంతా ఆమె పిల్లలను కంటూ పెంచుతూ ఉండవలసిన పనిలేదు; అవసరమూ లేదు. అలాంటి పరిస్థితుల్లో ప్రకృతి స్త్రీకి ఇచ్చిన ప్రత్యేక శక్తికి ఆమెను అభినందించాల్సింది పోయి దానిని కారణంగా చెప్పి ఆమెకు అన్యాయం చేయుటము న్యాయమూ కాదు; ధర్మం అంతకన్నా కాదు. కనుక ఈ వాదనలో పసలేదు. ఇలా అనేక రకాలుగా విస్తరించిన శారీరక నిర్ణయవాదం (Biological Determinism) వీగిపోయింది.

## సామాజిక పరిణామ వాదం (SOCIAL DARWINISM)

తిరోగమన వాదులు తమ అవజాయాన్ని అంత తేలిగ్గా అంగీకరించరు. పరిణామ వాద శాస్త్ర మూల పురుషుడైన డార్విన్ సిద్ధాంతాలను వక్రీకరించారు. 'మనుగడ కోసం పోరాటం, స్త్రీ సాంగత్యం కోసం పోటీ, జాతుల లక్షణమని డార్విన్ చెప్పాడు. జాతిలో బహు సంతానం కలిగిన జీవులు తమ చుట్టూ వున్న పరిసరాలకు తట్టుకోగల జీవులు బ్రతుకుతాయని ఆయన చెప్పాడు. డార్విన్ ప్రకృతి వరణ సిద్ధాంతాన్ని చెప్తే వీరు లైంగిక వరణ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు. ప్రకృతి స్త్రీ పురుషుల మనస్తత్వాలలో తేడా ఏర్పరచిందని, పరిణామ వాదం తమ సిద్ధాతాన్ని సమర్ధిస్తున్నదని వారి వాదన. పురుషుని మేధాశక్తి స్త్రీ మేధాశక్తికన్న గొప్పదని వారి భావం మహిళోద్యమ కార్యకర్తలు ఈ వాదాన్ని తిరస్కరిస్తున్నారు. స్త్రీ లయొక్క అంతఃకరణశక్తి పురుషునిశక్తి కన్నా అదికమైనది. మేధస్సును వినియోగించడానికి అవకాశాలను, వెసులు బాట్లను శతాబ్దాల తరబడి స్త్రీకి లేకుండా చేసినందున ఆమె మానసికశక్తి పురుషునిమానసిక

శక్తి కన్నా తక్కువదిగా కనపడతోంది. సామాజిక పరంగా స్త్రీలను పేర్పాటుకు లోను చేయడం వల్లనూ వారిని అన్యాయాలకు, అక్రమాలకు, దోపిడీలకు గురి చేయడం వల్లనూ కలిగిన ఫలితమిది. ఈ సామాజిక పరిణామవాద సిద్ధాంతం మహిళోద్యమానికి తీరని నష్టం కలిగించిందని స్త్రీ విమోచన వాదులు విశదీకరించారు.

## సామాజిక జీవశాస్త్రం [SOCIAL BIOLOGY]

ఈ సిద్ధాంతం ప్రకారం స్త్రీ పురుషుల మధ్య పోటీ వుంటుంది. సాధ్యమైనంత మంది స్త్రీలతో పొందు కలుగజేసికొని ఎక్కువమంది సంతానాన్ని కనాలని పురుషుడు ఆశిస్తాడట. గర్భధారణ, ప్రసూతి లాంటి విషయాలలో ఎక్కువ శక్తిని వినియోగిస్తున్న స్త్రీ పురుషుడి శ్రమను, శక్తిని ఆసరాగా చేసుకోవాలని కోరుకుంటుందట. అలా స్త్రీ పురుషులు ఒకరి నొకరు వాడుకోవాలని చూస్తారట. తమ పిల్లలకు తనే తండ్రిని అనే నిర్ధారణకోసం స్త్రీని పురుషుడు తన సొంతం చేసుకుంటాడట. ఇలా స్త్రీ పురుషులు పోటీ పడతారట. ఈ సిద్ధాంతం అనుభవానికి దూరం. సమాజంలో సహకారం పోటీ రెండూ ఏకకాలంలో సహజీవనం చేస్తున్నాయి. అలాగే సామరస్యం, సంఘర్షణ మిక్కుటంగా కనపడతాయి. దౌర్జన్యం, దురాక్రమణ పురుషుల స్వాభావిక లక్షణాలని అందువల్ల పురుషులు సమాజం మీద పెత్తనం చేయడానికి అర్హులని ఈ సిద్ధాంత కర్తల అభిప్రాయం పురుషులలో 'టెస్టొట్రోన్' (Testotrone) అనే హార్మోను ఎక్కువగా వుండటం వల్ల పురుష స్వభావం అలా వున్నదని వాదిస్తున్నారు. దీనికి జవాబుగా, పురుషాధిక్యత ప్రదర్శన వల్లనే ఆ హార్మోను పెరుగుదల పురుషులలో కన్పడుతోందని ప్రతివాదన వచ్చింది. సింహాలు వేటాడేటప్పుడు వ్యూహంపన్ని, ఎత్తులు వేసి జంతువు మీద లంఘించేది ఆడసింహమే నని గమనించాలి. బాబూన్ కోతులలో మగకోతిని నాయకుడిగా ఎన్నుకోవడం భౌతిక పరిస్థితులను బట్టి జరుగుతోంది. కనుక చారిత్రిక, సాంస్కృతిక కారణాలవల్ల భౌతిక పరిస్థితులు మారగలవని తెలుసుకోవాలి. 1

## సామాజిక భావవాదం [SOCIAL CONSTRUCTIONISM]

స్త్రీ పురుషుల మధ్య సంబంధాన్ని జీవశాస్త్రం నిర్ణయించదని, జీవ శాస్త్రం కాక సామాజిక దృక్పథం నిర్ణాయక పాత్ర వహిస్తుందని ఈ సిద్ధాంతసారం. ఉ॥ బహిష్టు రక్తాన్ని గురించి, బహిష్టు అయిన స్త్రీ యొక్క అపవిత్రతను గురించి పూర్వం అనేక మూఢ విశ్వాసాలు వుండేవి. ఈ విశ్వాసాలు స్త్రీని న్యూనత పరిచాయి. శాస్త్రీయ విజ్ఞానం పెరిగిన తర్వాత ఈ వాస్తవిక భావాలు పటాపంచలవుతున్నాయి. ఈ సిద్ధాంతం సాంస్కృతిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది.

## శారీరక, మౌలికసార సిద్ధాంతం
## (BIOLOGICAL ESSENTIALISM)

పుట్టుకతోనే పురుషునికి పు రు ష స్వ భా వ ం, స్త్రీకి స్త్రీ స్వభావం వస్తుందని దీని భావం. పురుషుని మానసిక ప్రవృత్తి స్త్రీ యొక్క మానసిక ప్రవృత్తి కంటే భిన్నమైనదట. ఇంతవరకు పురుషాధిక్య సమాజంలోనూ పురుషుని పెత్తనం సాగే వాతావరణంలోనూ స్త్రీలు పెరిగారట. ఇప్పుడు స్త్రీలు చైతన్యవంతులై స్త్రీత్వం యొక్క గొప్పతనాన్ని గుర్తించాలట. గట్టిగా ఆలోచిస్తే ఈ సిద్ధాంతమూ శారీరక నిర్ణయువాదమూ బొమ్మా బొరుసూ లాంటివని తేలుతుంది. కాగా ఈ సిద్ధాంతాన్ని మహిళోద్యమ కార్యకర్తలు ప్రతిపాదిస్తున్నారు. శారీరక నిర్ణయువాదాన్ని పురుష దురహంకార వాదులు ప్రచారం చేస్తున్నారు. అయితే రెండూ స్త్రీ పురుషుల మధ్యనున్న శారీరక విభేదాల ప్రాతిపదిక మీద ఆధారపడుతున్నాయి.

ఈనాడు ప్రబలంగా వున్న స్త్రీ విమోచన సిద్ధాంతాలు నాలుగు. ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం, మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం, రాడికల్ స్త్రీ విమోచన సిద్ధాంతం, సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం అనే పేర్లతో అవి చలామణీ అవుతున్నాయి. ఈ సందర్భంగా హ్యూమనిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని కూడా చర్చించటం చాలా అవసరం. [2]

## ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం
[LIBERAL FEMINISM]

జీవితం యొక్క అన్ని రంగాలలోనూ అంటే సాంఘిక, ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక రంగాలన్నింట స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని కోరుతుంది ఈ సిద్ధాంతం. మామూలుగా ఓటుహక్కు, విద్యా ఉద్యోగ పరిపాలనాది ప్రభుత్వరంగాలలో సమానస్థాయి, ప్రాతినిధ్యం ఆశిస్తారు ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు. ఇప్పటి వరకు పురుషులకు మాత్రమే ప్రవేశార్హత వున్న ఉద్యోగాలన్నింటిలో పురుషులతో పాటు పోటీ పడమని స్త్రీలను వీరు ఉద్బోధిస్తారు; గర్భస్రావపు హక్కుకోసం ఆందోళన చేస్తారు; కుటుంబనియంత్రణను ఆమోదించి ఆచరణలో పెడతారు. సమాజానికి, పరిసరాలకు ప్రాధాన్యత నిచ్చేవారు వీరి వాదనను విమర్శిస్తారు. సామాజిక వాతావరణం, లేక సామాజిక వ్యవస్థ మౌలికంగా మారేవరకు స్త్రీల పురోగతి సాధ్యంకాదని ఈ విమర్శకులకు భావం. ఉదారవాద స్త్రీ విమోచన కారులు సామాజిక వ్యవస్థను మార్చగలచక పోయినా కొంతమేరకు స్త్రీ విమోచనకు వారి కార్యక్రమాలు, ప్రయత్నాలు తోడ్పడుతున్నాయి. ఆ మేరకు వారు శ్లాఘనీయులే.

## మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం
[MARXIST FEMINISM]

ఈ సిద్ధాంతం కుటుంబంలో జీవశాస్త్రపు పాత్రను అంగీకరిస్తుంది. ఉత్పత్తి సాధనాల స్వభావంపై సమాజం ఆధారపడుతుందని కూడా చెప్తుంది ఈ వాదం. దీనికి మూల పురుషులు మార్క్స్, ఏంగెల్సులు. స్త్రీ పురుషుల మధ్య శారీరక విభేదాలు స్త్రీ పురుషుల పని విభజనకు దారి తీశాయని అంటుంది ఈ వాదం. స్త్రీకి గర్భధారణ ప్రసూతి సహజ ధర్మాలయినందున అవి పురుషాధిపత్యానికి దారి తీశాయి. మాతృస్వామ్య వ్యవస్థపోయి పితృస్వామ్య వ్యవస్థ వచ్చింది. పారిశ్రామికీకరణ జరిగి సోషలిజం వచ్చిన తర్వాత పురుషాధిపత్యం సమసి పోతుంది అంటుంది మార్క్సిస్టు ఫెమినిజం. ఈ వాదాన్ని సమర్థించేవారు స్త్రీలకు విజ్ఞప్తి

చేస్తారు. "సోషలిజం వచ్చేవరకు పురుషులపై మీ పోరాటం ఆపండి" అని. ఆర్థిక స్వాతంత్ర్యం వస్తే స్త్రీకి దానంతట అదే సర్వవిధాలైన స్వేచ్ఛ వచ్చేస్తుందని వారి ఆశ. ఈ దృక్పథాన్ని సోషలిస్టు స్త్రీ విమోచన కారులూ, (Socialist Feminists) తదితరులూ ఇలా విమర్శిస్తున్నారు. సోషలిస్టు దేశాలలో పురుషులు పురుష దురహంకారాన్ని విడనాడుతున్న సూచనలు కానరావటం లేదు. పైగా పారిశ్రామిక కార్మికులు తమ స్త్రీలను తమతో సమానులుగా చూడటం లేదు. సనాతన సంప్రదాయ కమ్యూనిస్టు లందరూ ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తున్నారు. సృజనాత్మక మార్క్సిస్టులు ఈ వాదాన్ని ఆమోదించటంలేదు. ఆచరణలో మావో ఈ వాదాన్ని త్రోసిరాజన్నాడు.

ఈ సిద్ధాంతాల మీద విమర్శ ఇలా సాగింది. భౌతిక పరిస్థితులను గమనించకుండా ఏంగెల్సు మనస్తత్వానికి ప్రాధాన్యత ఇచ్చాడు. స్త్రీ పురుషులమధ్య పనివిభజన జీవశాస్త్ర సంబంధంగా జరగలేదు. శారీరకబలం విషయంగా స్త్రీ పురుషుల మధ్యగల తేడా స్త్రీ యొక్క పనిని నిర్ణయించటంలోగాని ఆమె అసమాన స్థితికి గాని, కీలకాంశంగా లేదు. సమాజం పారిశ్రామికీకరణ కాకముందు స్త్రీ ఇంటిలో గాని, పొలంలో గాని బండెడు చాకిరీ చేయక తప్పలేదు. అందుకు ఆమె శారీరక బలహీనత అడ్డురాలేదు యాంత్రికరణ పద్ధతి వలన స్త్రీలకు ఉద్యోగాలు పోతున్నాయి. మొదటిదెబ్బ వారికి తగులుతోంది. స్త్రీలకు తక్కువ వేతనాలు లభిస్తున్నందున వారు పురుషులపై ఆర్థికంగా ఆధార పడటం తప్పటంలేదు. శ్రామికులలో వారూ సగభాగంగా ఉన్నా స్త్రీలకు సమానత్వం లభించడంలేదు. స్త్రీల తక్కువ బలాన్ని వారికి తక్కువ వేతనాలు ఇవ్వడానికి కారణంగా చూపిస్తున్నారు.

## సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం
## (SOCILIST FEMINISM)

మార్క్సిస్టు విమోచన వాదం యొక్క లోపాన్ని వీరు సవరించు కుంటారు. వీరికి ఉదారవాద సిద్ధాంతం సరిపడదు. దానితో వారు

తృప్తి పడరు. అలాగే మార్క్సిజాన్ని స్త్రీ విమోచనోద్యమానికి గాని స్త్రీ విమోచనోద్యమాన్ని మార్క్సిజానికి గాని లొంగేటట్లు చేయరు స్త్రీ విమోచనోద్యమ కారులు. కుటుంబంలో స్త్రీ యొక్క ప్రతిపత్తి ఉత్పత్తి సాధనాల స్థితిగతులలో సరాసరి ముడిపడి ఉండకుండా సాపేక్షంగా, స్వతంత్రంగా నిర్ణయించ బడుతుందని వీరి వాదన. లైంగిక అసమానత్వానికి ఆర్థికత ముఖ్యకారణమని వీరు అంగీకరించరు. కాగా వీరిలో చాలామంది మార్క్సిస్టు బంధాలను విడలేకుండా వున్నారు.

## రాడికల్ స్త్రీ విమోచనోద్యమం (RADICAI FEMINIST)

ఉదారవాద స్త్రీ విమోచనోద్యమ కారులూ, మార్క్సిస్టు స్త్రీ విమోచన కారులూ శారీరకాంశాలకన్నా సామాజికాంశాలకు హెచ్చు ప్రాధాన్యత నిస్తారు. రాడికల్ స్త్రీ విమోచనోద్యమ సిద్ధాంతంలో జీవశాస్త్రం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. పురుషుని శారీరక బలాధిక్యత, సంతానోత్పత్తి విషయంగా స్త్రీ యొక్క పాత్ర ఈ రెండూ కలసి స్త్రీని సమానత్వ స్థితికి దూరం చేశాయని వీరి విశ్వాసం. స్త్రీ పురుషుల మధ్య వర్గ విభజన, రాజకీయ విభజన ఉన్నాయని వీరి వాదం. స్త్రీల నుండి విప్లవం రావాలని వీరి ఆకాంక్ష. స్త్రీ విమోచనకు ద్వితీయ స్థానం ఇచ్చినందుకు మార్క్సిస్టులను వీరు విమర్శిస్తారు. వీరి దృష్టిలో స్త్రీలు ఒకవర్గం. వీరు 'శారీరక మౌలికసార సిద్ధాంతం' పై ఆధారపడతారు.

## సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం (CULTURAL FEMINISM)

ఈ సిద్ధాంతం రాడికల్ ఫెమినిజానికి చాలా దగ్గరగా వుంటుంది' కాకపోతే కొద్ది తేడాలున్నాయి. ఈ సిద్ధాంతం మహిళా సంస్కృతిని శ్లాఘిస్తుంది. స్త్రీ యొక్క సృజనాత్మక శక్తిని, సంతానోత్పాదనలో ఆమె సామర్థ్యాన్ని చూచి పురుషుడు ఈర్ష్యపడుతున్నాడని వీరిఅభిప్రాయం. విప్లవ స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని ఇది ప్రతిపాదిస్తుంది. సంతానోత్పాదనలో స్త్రీ పాత్రను పురుషుడు మానసికంగా గ్రహించే విధానంపై ఆమె

అణగారినతనం ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా గాని ఆధారపడుతుందని పీరి భావం. ఈ అంశంపై రాడికల్ ఫెమినిష్టులకూ సాంస్కృతిక ఫెమినిస్టులకూ ఏకీభావమే. స్త్రీ విమోచనకు ప్రధాన శత్రువు పురుషుడేనని వీరి నిర్ణయం. రాడికల్ ఫెమినిష్టు అయిన 'ఫైర్‌స్టోన్' పురుషులతో సంపర్కం లేకుండా కృత్రిమ గర్భధారణకు పూనుకోవలసినదని విజ్ఞప్తి చేస్తున్నది. సాంస్కృతిక ఫెమినిష్టు అయిన "రిచ్" అనే ఆమె "సంతానోత్పాదన" గురించి గర్వపడవలసిందని స్త్రీలకు ఉద్బోధిస్తూ వుండేది. ఈ రెండు శాఖల వారూ శారీరక మౌలికసార సిద్ధాంతాన్ని ఆమోదిస్తారు. అంటే స్త్రీకుండే సృజనాత్మక శక్తిని చూచి పురుషజాతి అసూయచెంది వారిని అణచివేయ పూనుకున్నదని ఈ వాదన ముఖ్యాంశం. ఈ వాదనను అంగీకరించేవారు పురుష నైజాన్ని ద్వేషిస్తారు. పురుష జాతిని 'పురుష దురహంకార సూకరాలు' (Male Chauvinist Pigs) అని మెక్సికో ప్రపంచ మహిళా సభలో ఎలుగెత్తి నిందించడం జరిగింది. వీరి సిద్ధాంతంలో ముఖ్యమైనది స్త్రీలకు స్త్రీత్వలక్షణాలను ప్రకృతి ప్రసాదించిందని, వాటిని పురుషుల మానసిక లక్షణాలకన్నా గొప్పవిగా పరిగణించాలని అంతగా కాకపోతే సమానంగా లెక్కలోకి తీసుకోవాలని వీరి విశ్వాసం. 'డన్‌బార్' అనే ఆమె 'సామాజిక విముక్తికి మూలం స్త్రీ విమోచనయే' అని ప్రకటించింది. స్త్రీత్వలక్షణాలు అంటే ఇతరులయెడ శ్రద్ధ, జాగ్రత్త, ఆత్మవిశ్వాసం, పోటీలేని మనస్తత్వం, సహకారం, ఐహికతత్వం (Materialism) ఇవి ప్రపంచానికి అవశ్యకమని వీరిభావన.

స్త్రీ విమోచనను గురించిన ఈ తాత్విక సిద్ధాంతాలన్నీ అర్ధసత్యాలే. వాటిలో కొంత వాస్తవం వున్నది. వాటిని పూర్తిగా అంగీకరించడానికి వీలులేదు. స్త్రీ పురుషునికి లొంగివుండడం అనే ఈనాటి వాస్తవానికి శారీరక శాస్త్రం, మానసిక శాస్త్రం, సామాజిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సామాజిక పరిణామ వాదం, సామాజిక జీవశాస్త్రం వీటిలో ఏ ఒక్కటీ సరియైన సంజాయిషీ ఇవ్వలేదు. ఏ ఒక్క అంశాన్ని ఆధారం చేసుకొని దాన్ని వివరించలేము. రాజకీయ ఆర్థిక శాస్త్రాలు, జీవశాస్త్రం, మానసిక

శాస్త్రం, సామాజిక భావన, అన్నిటితోపాటు పురుషులూ, సమాజం కూడా స్త్రీలను దోపిడీ చేయటానికి ఉపకరించాయి. కేవలం మార్క్సుగాని, ఫ్రాయిడ్‌గాని స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గాలను చూపలేదు. అందువల్ల బహుముఖ్యంగా ఈ సమస్యలను దర్శించవలసి వుంటుంది. నేడు సమ్యక్ దృక్పథం చాలా అవసరం. ఏదో ఒక సిద్ధాంతాన్ని ముందుగా ఊహించుకొని తద్వారా పరిష్కారమార్గాన్ని అన్వేషించపూనటం అవివేకం. అలాంటి ప్రయత్నం నిష్ఫలమవుతుంది. మానవవ్యక్తి సంక్లిష్ట జీవి. మానవ స్వభావాన్ని లేక పెరుగుదల క్రమాన్ని అవగాహన చేసుకోవాలంటే గాఢంగా, సునిశితంగా విమర్శనాయుతంగా పరిశీలన అవసరం. అది మానవవాద ప్రాదిపదికపై జరగాలి. ఈ అంశంపై శాస్త్రీయ భావనను శాస్త్రీయ దృష్టిని ప్రసరింప జేయాలి. అలాంటి ప్రయత్నానికి మానవతా దృక్పథంతో కూడిన స్త్రీ విమోచన సిద్ధాంతం ఉపకరించవచ్చు. కనుక హ్యూమనిస్టు ఫెమినిజం స్వరూప స్వభావాలను పరిశీలిద్దాం.

## మానవ వాద స్త్రీ విమోచన సిద్ధాంతం
(HUMANIST FEMINISM)

ఈ సిద్ధాంతం వాస్తవికతపై ఆధారపడి సమగ్ర పరిశీలనవల్ల పుట్టి సమ్యక్ దృక్పథంతో భాసిల్లుతుంది. సంతానోత్పాదన విషయంలో స్త్రీ శక్తి సంపన్నతను గుర్తిస్తుంది. దానిని ఆమె బలహీనతగా పరిగణించదు. కుటుంబ పెంపుదలకు, సామాజిక శాశ్వత్వానికి, ఆమె చేసే అపూర్వ సేవగా లెక్కలోకి తీసుకుటుంది. కనుక ఆమెను అభినందిస్తుంది. గర్భధారణ సమయంలో కాని ప్రసూతి సందర్భంగా కాని ఆమెకు కలిగే కొద్దిపాటి ఇబ్బందిని, చికాకును సాకుగా తీసుకొని ఆమెకు అన్యాయం చేయదు. ఆ సమయంలో ఆమెకు అండగా నిలబడాలని పురుషుడుని ఉద్బోధిస్తుంది. ఇంటిపని పిల్లల పెంపకం ఆమెకే కేటాయించడం అక్రమమని వాదిస్తుంది. స్త్రీ పురుషుల మేధా సంపత్తిలో తేడాలు, వ్యత్యాసాలు లేవని స్త్రీ పురుషునితో సమదీటుగా వ్యవహరించగలదని నొక్కి చెప్తుంది. స్వేచ్ఛ సమగ్రమూ, సంపూర్ణమూ కావాలి. స్త్రీకి సామాజిక స్వేచ్ఛ ఉన్నంతమాత్రాన

చాలదు. అలాగే ఆర్థిక స్వేచ్ఛ లభించినంత మాత్రాన జరిగేది లేదు. రాజకీయ సాంస్కృతిక స్వేచ్ఛ కూడా అవసరమే. ఒక రంగంలో స్వేచ్ఛ అనుభవిస్తూ మరో రంగంలో ఏ వ్యక్తి కట్టు బానిసగా వుండలేడు. ఈ సత్యాన్ని గుర్తించి సామాజిక వ్యవస్థయొక్క ప్రాధాన్యతనూ, దాని పై నిర్మింపబడిన భావప్రపంచాన్ని రెండిటినీ సమానంగా పరిగణించి ఏ సమస్యనైనా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించడం అవసరం. ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు రాడికల్ ఫెమినిస్టుల వలె పురుష ద్వేషానికి లోనుకారు. మార్క్సిస్టు ఫెమినిస్టులవలె స్త్రీ విమోచనోద్యమ పోరాటాన్ని ఆర్థిక పోరాటాలకు బలి చేయరు. అంటే పురుషాధిపత్యంమీద జరిపే పోరాటం సామాజిక వ్యవస్థ మార్పుకై సాగించే ఆందోళన ఏకకాలంలో జరుపుతారు. ఉదారవాద ఫెమినిస్టుల వలె పెట్టుబడిదారి సామాజికవ్యవస్థను ఆమోదించి ఊరుకోరు. మార్క్స్, ఫ్రాయిడు లాంటి మహా మేధావుల సిద్ధాంతాలలోని వాస్తవాంశాలను మాత్రం స్వీకరించి జీవితానుభవంతో రంగరించుకొని ముందుకు సాగిపోతారు. భవిష్యత్ ప్రపంచంలో కండ బలానికన్నా బుద్ధిబలానికి ప్రాధాన్యత వున్నదన్న అంశాన్ని గుర్తెరిగి నూతన సమాజ ఆవిర్భావంకోసం భావవిప్లవాన్ని ఆకాంక్షిస్తారు. కేవలం బావాల మార్పువల్ల సమస్య పరిష్కారం కాదని వారికి తెలుసు. కనుకనే భావవిప్లవాన్ని, సామాజిక పరివర్తనా కార్యక్రమాన్ని ఏకకాలంలో సాగిస్తారు. అలా స్త్రీ విమోచనోద్యమాన్ని, సామాజిక విప్లవ పంథాను సమన్వయం చేస్తారు. ఈ మార్గం అనుసరణీయమని గ్రహించాలి. ఈ సమస్యను మానవవాద పరిధిలో పరిశీలించి దీన్ని పరిష్కరించటానికి బహుముఖ కృషి జరగవలసి వుంది. అసలు సిద్ధాంతాలకన్నా జీవితం వాస్తవమైనది; విలువైనది. జీవితపు లోతులను అవలోకనం చేసిన కొలది నూతన సత్యాలు గోచరిస్తాయి. నూతన సిద్ధాంతాలు మొలకెత్తుతాయి. కనుక అర్ధసత్యాలైన మొదటి నాలుగు స్త్రీ విమోచన సిద్ధాంతాలు అంటిపెట్టుకొని ప్రాకులాడక స్త్రీని మానవిగా పరిగణించే మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని పూర్తిగా రూపొందించటం, ఆచరించటం అవశ్య కర్తవ్యం. అది నూతన సమాజావిర్భావానికి నాంది పలుకుతుంది.

వర్గపోరాటం పేరుతో స్త్రీ విమోచనోద్యమాన్ని అణచిపెట్టటం తప్పు. అలాగే స్త్రీ విమోచన పేరుతో సమాజంలోని దోపిడీ పద్ధతులను గుర్తించక పోవటం పొరపాటు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కౌటుంబిక రంగాలన్నిటా స్త్రీ విమోచనకు అరమరికలు లేకుండా కృషి చేయడం మన కర్తవ్యం. ఈ సందేశాన్ని మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతం ప్రతిపాదిస్తుందని గ్రహిస్తాం. అది అందరికి ఆచరణయోగ్యం అవుతుందని ఆశిస్తాం.

## ఐదవ భాగం మూడవ అధ్యాయం రిఫరెన్సులు


1. ప్రసారిత : సమాజ విజ్ఞాన త్రైమాసిక పత్రిక వ్యాసం: విభిన్న స్త్రీ విమోచన సిద్ధాంతాలు రచన : మల్లాది సుబ్బమ్మ — పుట 88
2. 'స్త్రీ విముక్తి సిద్ధాంతాలు' : రచన మల్లాది సుబ్బమ్మ 'బంగారు సంకెళ్ళు' : — పుట 79

# 4 వ అధ్యాయం : శాసనాల నడక తీరు

ప్రస్తుతం అమలులో ఉన్న 'లా' ను మార్చారు స్త్రీలపై అత్యాచారాల విషయంగా. సమానమైన పనికి సమానమైన వేతనం అనే సూత్రాన్ని ఆచరణలోకి తీసుకొని రావడానికి నూతన శాసన నిర్మాణం జరిగింది.

## సమానమైన ప్రతిఫలపు శాసనం 1976

ఒకే పనికి మనదేశంలో పురుషునికి ప్రతిఫలం ఎక్కువ; స్త్రీకి తక్కువ. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. ఒకే రకమైన పనికి స్త్రీ పురుషులకు ఒకే కనీస కూలి రేటును ప్రభుత్వం నిర్ణయించింది శాసనం ఆధారంగా. అలాగే పారిశ్రామిక తగాదాలచట్టం (1947) క్రింద కార్మిక తగాదాలను పరిష్కరించే పారిశ్రామిక ట్రిబ్యునల్సు, లేబరుకోర్టులు స్త్రీ పురుషులకు ఒకే వేతనం అనే సూత్రాన్ని స్థిరీకరించాయి.[1]

అంతర్జాతీయ మహిళా సంవత్సరమైన 1975 లో భారత ప్రభుత్వం కొంచెం కదిలింది. సమానమైన పనికి సమానమైన వేతనాన్ని నిర్ణయిస్తూ తే 26-9-75వ ఆర్డినెన్సు తెచ్చింది. అంతర్జాతీయ కార్మికసంస్థ ఈ సందర్భంగా చేసిన ప్రతిపాదనను (Convention) భారత దేశం 1958 నాటికే ఆమోదించింది. కానిదానిని అమలుపరచడానికి 17 సంవత్సరాలు పట్టింది. ఆర్డినెన్సుకు బదులుగా 1976 ఫిబ్రవరిలో శాసనంపుట్టింది. సమానమైన పనికిసమానమైన వేతనం ఇవ్వాలనేది, ఉద్యోగవిషయంలో స్త్రీ పురుష వివక్ష ఉండరాదనేది శాసనంయొక్క మౌలికసూత్రం. ఇతరశాసనాలకన్న, యజమాని కార్మికుడు వీరిమధ్యగల ఒప్పందాలకన్నా ఈ శాసనం అధికశక్తి కలది అంటే ఒప్పందాలు ఎలా ఉన్నా ఈ శాసనంలోని నిబంధనలు అమలు పరచాలన్నమాట.

స్త్రీల ప్రసూతి సెలవులు, రిటైరుమెంటు, వివాహం, మరణం, స్త్రీల ఉద్యోగం వీటికి సంబంధించిన శాసనాలు మాత్రం ఈ క్రొత్త శాసనపు పరిధిలోకి రావు. అంటే అవి అమలులో ఉంటాయి. సమానత్వం పేరుతో స్త్రీలచేత గనులలో పనిచేయించరాదు. అలాగే ప్రసూతి సౌకర్యాలు నిరాకరించవీలులేదు. స్త్రీ కార్మికులను ఉద్యోగంలో చేర్చుకునే సందర్భంగా వివక్ష పనికి రాదని ఈ నూతనశాసనం ప్రకటిస్తున్నది. ఈ శాసనం అన్ని రకాల ఉద్యోగాలకు అంటే వ్యాపార ఉద్యోగాలకు కూడా వర్తిస్తుంది. ప్రయివేటు రంగంలో పనిచేసే వారికి కూడా ఈ శాసనం లాభం చేకూరుస్తుంది. మొత్తంమీద సమాన ప్రతిఫలపు శాసనం (1976) స్త్రీలకు ప్రయోజనకారిమైన శాసనం. [2]

## హిందూ వివాహ చట్టానికు (1955) సవరణ (1978)

1978 లో ఆమోదింపబడిన 2 వ నెంబరు శాసనం ద్వారా కేంద్ర ప్రభుత్వం వివాహార్హతగా చెప్పబడిన వయస్సును మార్చింది. పూర్వం వరునికి 18 ఏండ్లు నిండాలి. ఇపుడు దానిని 21 ఏండ్లకు పెంచింది ఈ శాసనం. పూర్వం వధువుకు 15 సంవత్సరాలు నిండాలి. దానిని 18 సంవత్సరాలు చేయడం జరిగింది.

## బాల్యవివాహ నిరోధ శాసనానికి (1929) సవరణ (1978)

1929 బాల్య వివాహ నిరోధ శాసనంలో "బాల్యంలో ఉన్నవ్యక్తి" అనేదానికి అర్థం మార్చారు 1978 సవరణ శాసనం ద్వారా (Act No 2) పురుషుడయితే 21 సంవత్సరములు నిండనివాడు, స్త్రీ అయితే 18 ఏండ్లు నిండనియామె అని కొత్త అర్థం చెప్పారు. బాల్యవివాహాన్ని చేసే మనిషికి, చేయించే వ్యక్తికి, ఆదేశించి నడిపించే వ్యక్తికి 1978 సంవత్సరపు 42 వ శాసనం ద్వారా జైలుశిక్ష విధించడానికి ఏర్పాటయింది. 1978 సంవత్సరపు 2 వ నెంబరు శాసనం ద్వారా ఆ నేరాలను పోలీసులు పట్టుకొని విచారించటానికి వీలు కల్పించబడింది. ఈ సవరణలు ఆహ్వానించ తగినవి. స్త్రీలకు ఎంతో మేలు ఒనగూర్చేవి.

# క్రిమినల్ లా సవరణ చట్టం

'మథురా' కేసులో సుప్రీం కోర్టుతీర్పువల్ల జాగృతి చైతన్యం కల మహిళా కార్యకర్తలు ఆందోళన చెందారు. తమ సంఘాలద్వారా నిరసన తెలిపారు. ఆందోళన ఫలితంగా క్రిమినల్ లా సవరణ కొరకు కేంద్ర ప్రభుత్వం ఒక బిల్లును ప్రతిపాదించింది.

1) ఈ క్రింది నమోదు అయిన సందర్భాలలో మానభంగ నేరానికి శిక్ష కనీసం 7 సంవత్సరాలుగా నిర్ణయించబడింది. గరిష్ఠ పరిమితి జీవిత కాలం ఖైదు లేక పది సంవత్సరాలు

(క) పోలీసు స్టేషను లోపల పోలీసు మానభంగానికి ఒడిగడితే, లేక తను ఉద్యోగానికి నియమించబడిన పోలీసు స్టేషను ఆవరణలో నేరం చేస్తే, లేక తన అదుపులో కాని తన తాబేదారు అదుపులోగాని ఉన్న స్త్రీపై నేరం చేస్తే,

(ఖ) తనయొక్క లేక తనయొక్క క్రింది ఉద్యోగస్థుని అధీనములో ఉన్న స్త్రీపై, తన అధికారాన్ని దుర్వినియోగంచేసి, 'పబ్లిక్ సర్వెంటు' (ప్రభుత్వోద్యోగి) నేరం చేస్తే,

(గ) జైలు, 'రిమాండుహోం', స్త్రీల లేక బాలల సంస్థయొక్క ఉద్యోగులు, మేనేజిమెంటు మనుషులు తమ అదుపులో ఉన్న స్త్రీ యెడల నేరం చేస్తే,

(ఘ) ఆస్పత్రిలో ఉన్న స్త్రీపై ఆస్పత్రి ఉద్యోగులు లేక మేనేజిమెంటు చేసేవారు నేరం చేస్తే,

(చ) గర్భిణీస్త్రీని మానభంగం చేస్తే,

(ఛ) 12 ఏండ్ల బాలికపై నేరానికి ఒడికట్టితే,

(జ) ఇద్దరుకాని అంతకు పైగా సంఖ్యలో ఉన్నవారు మూకుమ్మడి మానభంగం చేస్తే పైన ఉటంకించిన కనిష్ఠ గరిష్ఠ శిక్షలు పరిధిలోకి వస్తాయి.

2) పైన పేర్కొనబడిన (ఖ), (గ), (ఘ) లోని పురుషులు తమ అధికారం దుర్వినియోగం చేసి మానభంగ నేరముకిందకు రాకుండా తమ అధీనంలో ఉన్న స్త్రీతో లైంగిక సంపర్కం పెట్టుకుంటే వారికి కనిష్ట శిక్ష 5 సంవత్సరాలు.

3) పైన చెప్పిన సందర్భాలలోని ముద్దాయుల విషయంగా 'నేరానికి గురి అయిన స్త్రీ తన సమ్మతిని ఇచ్చింది' అనే దానిని ముద్దాయి రుజువు చేసుకోవాలి. అంటే రుజువు భారం అతనిది. సాక్ష్యశాసనం (Evidence Act) లో 114 ఎ అనే సెక్షనును క్రొత్తగా ప్రవేశపెట్టారు. ఒకసారి లైంగిక సంపర్కం రుజువయితే, తను సమ్మతి ఇవ్వలేదని స్త్రీ చెపితే ఆమె సమ్మతి ఇవ్వలేదని కోర్టు ప్రప్రథమంగా విశ్వసిస్తుంది. కాకపోతే తగిన సాక్ష్యం ద్వారా కోర్టువారి అభిప్రాయాన్ని ముద్దాయి మార్చవచ్చును.

ఆ బిల్లులోని లోపాలు :-

I భూస్వాములు, అధికారులు, యజమానులు, కాంట్రాక్టరులు, ఋణదాతలు ఆర్థిక స్తోమతు కలవారు. తమవద్ద పనిచేసే వారిపై అధికారం చలాయించగల సత్తా కలవారు. వారిని పోలీసు ఆఫీసర్లతో సమానంగా పరిగణించవలసి యున్నది.

II) స్త్రీ యొక్క సమ్మతి రుజువు విషయంలో కొలదిమార్పు ఉన్నా మొత్తంమీద విధానం మారలేదు.

III) నేరానికి గురి అయిన స్త్రీ అనుమతి లేకుండా ఆమె పేరును ప్రచురించటం బిల్లు ప్రకారం నేరం. ఈ నిబంధనవల్ల నేరస్థునిపై దర్యాప్తుకు అనుకూలించే లాగు నేరంయెడల ప్రజాభిప్రాయాన్ని సృష్టించటం కష్టమవుతుంది.

IV) కేసును పోలీసులు విచారించే క్రమం - ప్రథమ సమాచారం, డాక్టరు రిపోర్టు - విషయంలో తగు మార్పులు లేవు. 3

## క్రిమినల్ ప్రొసీజరు కోడ్ 2 వ సవరణ శాసనం 1983

భార్యపై భర్త జరిపే హింసకు 3 సంవత్సరాలు శిక్షగా నిర్ణయించిన శాసనం. క్రూరమైన హింస అంటే

I] భార్య ఆత్మహత్య చేసుకునే స్థితికి, ఉద్దేశపూర్వక నడతద్వారా ఆమెను కొట్టడం, లేక ఆమె శారీరక మానసిక ఆరోగ్యానికి తీవ్రమయిన ఘాత కలుగచేయడం;

II] అక్రమమైన వరకట్నానికి సంబంధించిన కోరికలను, ఆస్తి కోసం, నగదు, ఋణపత్రాలు మొదలైన విలువగల వాటికొరకు భార్యను వేధించటం.

ఇలాంటి నేరం జరగకుండా భార్యగాని ఆమె బంధువులుగాని ముందుగా నిరోధక చర్యలు కోర్టుద్వారా తీసుకోవచ్చును. ఆత్మహత్య చేసుకున్న స్త్రీ బంధువులు కోరినపుడు కేసును విచారించే పోలీసు ఆఫీసరు చనిపోయిన ఆమె శరీరానికి శవపరీక్ష (Post Mortam) చేయించవలెను. పెండ్లి అయిన 7 సంవత్సరాలలోపల భార్య ఆత్మహత్య చేసుకుంటే, భర్త లేక అతని బంధువులు ఆమెను హింసించినట్లు రుజువయితే అపుడు భర్త ఆమె ఆత్మహత్యకు దోహదం చేసినట్లు ఎంచుకోవలెను. ఈ శాసనం స్త్రీల ఆమోదాన్ని పొందుతుంది.[4]

## ఐదవ భాగం నాల్గవ అధ్యాయం రిఫరెన్సులు


1. "రోష్ని" (ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు మాసపత్రిక) మే-జూన్ 1982 పుట 13 రాకేష్ రస్తోగి వ్యాసం : "స్త్రీలకు సమాన వేతనం"
2. ,, పుట 16
3. భారత స్త్రీల జాతీయ ఫెడరేషను (National Federation of Indian women) 11 వ కాంగ్రెసు సావనీరు : (1984) పుటలు 35, 37
   గీతా ముఖర్జీవ్యాసం : "1982 సంవత్సరం"
4. అందులోనే పుటలు 37, 15

# 5 వ అధ్యాయం : రిజర్వేషన్లు

## 1 రాజకీయ సంస్థలలో రిజర్వేషన్లు

(క) పార్లమెంటులో, శాసన సభ, శాసనమండలులలో 'లెజిస్లేచరు' లో స్త్రీలకు రిజర్వేషనులు ఉండాలా అక్కరలేవా అనేది వివాదాస్పదమయింది. 'స్త్రీలహోదా' కమిటీ ఈ సమస్యను పరిశీలించింది. సాక్ష్యసేకరణచేసి ప్రజల అభిప్రాయాలను తెలుసుకున్నది. భిన్నాభిప్రాయాలు ప్రకటిత మయినాయి. రిజర్వేషనులకు అనుకూలంగా ఈ దిగువ వాదనలు వినవచ్చాయి.

I) రాజకీయ పార్టీలు స్త్రీలను అభ్యర్థులుగా ఎంపిక చేయుటం లేదు. ఎక్కడో ఒక స్త్రీని అభ్యర్థిగా నిర్ణయించి స్త్రీలయెడ తమ బాధ్యతను నిర్వర్తించినట్లు చేతులు దులుపుకుంటున్నారు. ఇది నామ మాత్రంగా స్త్రీలకు సాయపడటం. (Tokenism) 1

II] ఈ ధోరణి ఇలాగే సాగితే రోజులు గడిచేకొలదీ ఎక్కువమంది స్త్రీలు రాజకీయ ప్రక్రియనుండి జారుకుంటారు. 2

III) రిజర్వుడు సీట్లలో గెలిచి వచ్చిన స్త్రీలు తప్పక స్త్రీ జనాభ్యు దయంకోసం ఎలుగెత్తి ఆందోళన చేస్తారు. 3

VI) మహిళోద్యమాన్ని బలపరిచి ప్రచారం చేసేవారి సంఖ్య పెరుగుతుంది. 4

V) స్త్రీల రాజకీయ హోదాను పెంచటం సామాజిక ఆర్థిక పరిణామం యొక్క సమగ్ర స్వరూపంలో భాగం. 5

VI) శాసన సభలలో కనీసం 10 శాతం సీట్లు స్త్రీలకు కేటాయిస్తే శాసనసభల వాతావరణమే మారిపోతుంది; రాజకీయపార్టీలు తమ వ్యూహాలను మార్చుకుంటాయి. అందువలన స్త్రీలకు సముచిత స్థానం ఇవ్వడానికి సంసిద్ధమవుతాయి. [6]

VII) పార్లమెంటులో శాసనసభలలో ఎక్కువమంది స్త్రీలు ఉండటం వలన, స్త్రీలస్థితి మార్పుయొక్క స్వభావాన్ని ప్రభావితం చేయగలరు. [7]

VIII) అలాంటి చర్య సమానత్వానికి దోహదం చేస్తుంది. [8] కొన్ని రాజకీయపార్టీలు స్త్రీలకు రిజర్వేషనులు ఇవ్వడాన్ని వ్యతిరేకించాయి.

రాజ్యంయొక్క ప్రాతినిధ్య వ్యవస్థలలో స్త్రీలకు తగిన ప్రాతినిధ్యం లేదని కమిటీ అంగీకరించింది. అది గుణాత్మకంగాను, సంఖ్యాపరంగాను ఉన్నది. సమస్య యొక్క ఉనికిని కమిటీ గుర్తించింది. అయినా పార్లమెంటులో శాసనసభలో, శాసన మండలిలో స్త్రీలకు రిజర్వేషన్లు కావాలనే సూచనను కమిటీ తి ర స్క రిం చిం ది. కారణాలను ఇలా వివరించింది.

I] స్త్రీల స్థితిని మెరుగుపరచడానికి అవసరమైన వాతావరణాన్ని స్త్రీ పురుషులు సమష్టి కృషి ద్వారానే సృష్టించగలరు.

II] స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గాలు ఇస్తే స్త్రీల దృక్పథం సంకుచితమవుతుంది.

III] సమాజంలోని సామాజిక ఆర్థిక రాజకీయ గ్రూపులు, వర్గాలు, తరగతులు వీటి శ్రేయస్సుకు స్త్రీల శ్రేయస్సు భిన్నం కాదు.

IV] రిజర్వేషనులను స్త్రీలకు ఇస్తే ఇతరులు - అంటే కులాలవారు, ప్రత్యేక ప్రయోజనాలు కలవారు - కూడా అలాంటి కోరికనే కోరతారు. అంటే వారూ రిజర్వేషనులను ఆశిస్తారు.

V] రిజర్వేషనుల వల్ల అసమానత్వం శాశ్వత రూపం తాలుస్తుంది.

VII] సమానత్వం కోసం స్త్రీలు పురుషులతో సమంగా పోటీ పడు తున్నారు. రిజర్వేషన్లు ఉంటే ఆ పోటీ మనస్తత్వం పోతుంది.

VIII] స్త్రీలు ఒకజాతి కాదు. ఒకవర్గం కాదు. కాగా వారు ఒక శాఖ (Category) మాత్రమే. అల్పసంఖ్యాకులతో వారిని సమంగా చూడరాదు. [9] కమిటీలో ఇద్దరు సభ్యులు - వీణా మజుందార్, లోతికా సర్కార్ - కమిటీ నివేదికకు అసమ్మతి తెలిపారు. పార్లమెంటులో శాసన సభలలో, శాసన మండలులలో వారు రిజర్వేషన్లు కావాలని తమ అసమ్మతి వ్యాఖ్యలో వివరించారు. [10]

అసమ్మతి అభిప్రాయం వాస్తవిక దృష్టితో కూడియుండి దేశ పరిస్థితులకు అనుగుణంగా ఉంది.

## (గ) మ్యునిసిపాలిటీలు వగైరాలలో రిజర్వేషన్లు

స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన ప్రాతినిధ్య సంస్థలలో స్త్రీలకు ప్రత్యేక అవకాశాలు కావాలని కమిటీ అభిప్రాయాన్ని వెలువరించింది. [11] ప్రస్తుతం స్థానిక స్వపరిపాలనా రంగంలో స్త్రీలకు నామ మాత్రపు ప్రాతినిధ్యం ఉన్నదని, అది చాలదని, దానిని అర్థవంతంగా ఏర్పాటు చేయాలని కమిటీ సిఫారసు చేసింది. [12] ప్రస్తుతం మునిసిపాలిటీలలో కొన్ని స్థానాలు స్త్రీలకు కేటాయించబడినాయని, జిల్లా పరిషత్తులు, పంచాయితీ సమితులలో స్త్రీలను 'కోఆప్టు' (తరువాత కమిటీలలో కలుపు కొనుటకు) చేసుకొనుటకు అవకాశం ఉన్నదని మనం గమనించాలి. స్త్రీల సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించటానికి స్త్రీల పంచాయితులను కమిటీ సిఫారసు చేసే వరకు వెళ్ళింది. [13] కమిటీలోని ఇద్దరు సభ్యులు - ఫూల్ రేణుగుహ, మణిబెన్‌కారా - ఈ ప్రతిపాదనకు వ్యతిరేక తెలిపారు. [14]

## (చ) రాజకీయ పార్టీలు

పార్లమెంటుకు, రాష్ట్ర శాసనసభల ఎన్నికలలో అభ్యర్థులను ఎంపిక చేసేటప్పుడు స్త్రీలను అభ్యర్థులుగా నిర్ణయించే విషయంలో నిర్దుష్టమైన

విధానాన్ని రాజకీయ పార్టీలు రూపొందించుకోవాలని కమిటీ కోరింది. రాజకీయపార్టీలు స్త్రీలకు 15 శాతం సీట్లు ఇవ్వడంతో ప్రారంభించి క్రమంగా వారి ప్రాతినిధ్యాన్ని పెంచాలని, దేశం లేక రాష్ట్రంయొక్క జనాభాలో స్త్రీల స్థానానికి అనుగుణంగా శాసన నిర్మాణ సంస్థలలో వారి ప్రాతినిధ్యం ఉండేలా చూడాలని రాజకీయ పార్టీలకు కమిటీ హితవు చెప్పింది. [15]

## (ట) కమిటీలలో, కమిషన్లలో, ప్రతినిధి వర్గాలలో ప్రాతినిధ్యం

సామాజిక ఆర్థిక సమస్యలను పరిశీలించటానికి నియమించబడే అన్ని కమిటీలు, కమిషన్లు, ప్రతినిధివర్గాలు అన్నింటిలో స్త్రీలకు విధిగా స్థానం ఇవ్వాలని కమిటీ సిఫారసు చేసింది. [16]

(డ) కమిటీకి భిన్న భిన్న వ్యక్తిత్వాలున్నాయి. స్థానిక వ్యవహారపాలనాసంస్థలలో స్త్రీల ప్రాతినిధ్యం నామమాత్రంగా ఉండరాదని (Tokenism) నిరసిస్తూ, ప్రతినిధివర్గాలు, కమిటీలు కమిషన్లలో స్త్రీలకు స్థానం ఉండాలన్నది.

పార్లమెంటులో, శాసన సభలలో రిజర్వేషన్లు వద్దని చెప్పి, స్త్రీల సంక్షేమ కార్యకలాపాలను నిర్వహించేటందుకు స్త్రీల ప్రత్యేక సంస్థలు కావాలని కోరింది. అంటే స్థానిక రంగంలో స్త్రీల సంక్షేమాన్ని గురించి మాట్లాడటానికి స్త్రీలే తగుదురని అంగీకరించింది.

కమిటీ తన ఆలోచనా విధానంలో ఏ విధమైన తర్కాన్ని ప్రవర్తించలేదు. అయితే సమస్యను విస్మరించనూలేదు. స్త్రీలు సమాజంలో నిర్ణాయకపాత్ర వహించాలంటే వాస్తవంగా వారు సామాజిక అసమానత్వానికి అనర్హతలకు లోనవుతున్నారని, అవి వారి వికాసానికి అడ్డుపడుతున్నాయని గుర్తించడం అవసరమని కమిటీ భావప్రకటన చేసింది. [17] కమిటీవాదనను పొడిగిస్తే పార్లమెంటుకు, శాసన సభలకు దానిని బలవత్తరంగా వర్తింపచేయవచ్చును.

పార్లమెంటులో, శాసనసభలలో రిజర్వేషనులు కావాలనే బృహత్తర ఉద్యమాన్ని నిర్మించవలసియున్నది. ఆ ఉద్యమం ప్రారంభమయితే పర్వతాలమీద ఉండే మంచు కరిగి వచ్చే బ్రహ్మాండమైన ప్రవాహంలాగా అది రూపం తాలుస్తుంది. వ్యతిరేకతను నెట్టివేస్తుంది.

## 2. పాఠశాలలలో, కాలేజీలలో సీట్లు రిజర్వేషను

వృత్తి కళాశాలల్లో ప్రస్తుతం స్త్రీలకు సీట్లు రిజర్వేషన్లు ఉన్నాయి. దాని శాతం చాల స్వల్పమనే మాట నిజమే. రిజర్వేషన్ల విషయమై మహిళా సంస్థలు సరియైన దృక్పథాన్ని అలవర్చుకున్నపుడు ఆ శాతం పెరుగుతుంది. మహిళాభ్యుదయాన్ని సాధించే నిమిత్తం స్త్రీలకు ప్రోత్సాహ కారణంగా ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వడానికి రాజ్యాంగంలో అవకాశం ఇవ్వబడింది. రాజ్యాంగంలోని 15 వ అధికరణాన్ని స్త్రీలు వినియోగించుకోవాలి.

## 3. స్త్రీలకు ఉద్యోగాలలో రిజర్వేషన్లు

ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినులుగా, నర్సులుగా, 'స్టెనో గ్రాఫర్లు' గా, 'టైపిస్టు' లుగా, కొద్దిస్థాయి గుమస్తాలుగా స్త్రీలు విశేష సంఖ్యలో పనిచేస్తున్నారు. ఆ ఉద్యోగాలలో వారిశాతం కొంచెం ఎక్కువగానే ఉన్నది. అలాగే నడుం విరిగేనాట్లు వేసే పనిలో వారి సంఖ్య చాల ఎక్కువగా ఉంది. సంస్థలను నిర్మించే నేర్పు, నిర్ణయాలు చేయడం ఎక్కువ జీతాలు సౌకర్యాలు, హోదా ఉన్న పదవులను పురుషులు తమకు తామే అట్టిపెట్టుకున్నారు. స్త్రీలను అడుగుపెట్టనీయరు ఆ రంగాలలో. కంపెనీ పరిపాలక పరిపాలనా సిబ్బందిలో అగ్రశ్రేణి ఆఫీసర్లుగా, మేనేజర్లుగా, బ్యాంకు మేనేజర్లుగా, ప్రభుత్వ శాఖల డైరెక్టర్లుగా ఉన్న స్త్రీలు అరుదుగా కన్పిస్తారు. ఉద్యోగాలలో చేర్చుకోవటం, శిక్షణకు

వంపటం, పై ఉద్యోగాలకు నియమించడం విషయంలో స్త్రీ పురుషుల మధ్య – స్త్రీలకు వ్యతిరేకంగా, నష్టదాయకంగా – వివక్ష విలయతాండవం చేస్తున్నది.

పై వ్యాఖ్యానము ఇంత బలవత్తరంగానూ వ్యక్తిగత వ్యాపార పారిశ్రామిక రంగానికి, ప్రభుత్వ రంగానికీ, సమష్టి రంగానికి మాటికి వర్తిస్తుంది. ప్రభుత్వ సంస్థలకూ, అర్ధ ప్రభుత్వ సంస్థలకూ కూడా వెల్లుతుంది.

ముప్పై శాతం ఉద్యోగాలు స్త్రీలకు కేటాయిస్తామని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసినప్రకటన స్త్రీలలో ఆసక్తిని రేకెత్తించింది. వెంటనే ఉద్యోగ రంగంలో తమ ఆధీనంలో ఉన్న ఉన్నతస్థానాన్ని కాపాడుకోవటానికివారు సన్నద్ధులవుతున్నారు. ఏమైనా చైతన్య యువతులైన స్త్రీలు తమ శ్రేయస్సును గుర్తెరిగి తమ కొద్దిపాటి కోర్కెలనయినా సాధించుకోవడానికి ఉద్యుక్తులవటం అవసరం.

## ఐదవ భాగం ఐదవ అధ్యాయం రిఫరెన్సులు


1. 'సమానత్వం వైపు పయనం' (Towards Equality)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | | | పేరా 7–103 | పుట | 302 |
| 2. | ,, | ,, | 7–104 | పుట | 302 |
| 3. | ,, | ,, | 7–105 | పుట | 302 |
| 4. | ,, | ,, | 7–106 | పుట | 302 |
| 5. | ,, | ,, | 7–108 | పుట | 303 |
| 6. | ,, | ,, | 7–109 | పుట | 303 |
| 7. | ,, | ,, | 7–112 | పుట | 303 |
| 8. | ,, | ,, | 7–111 | పుటలు | 303 |

| | | | | |
|---|---|---|---|---|
| 9. | ,, | ,, | 7-113 | పుటలు 303, 304 |
| 10. | ,, | ,, | | పుటలు 355-357 |
| 11. | ,, | ,, | 7-115 | పుట 304 |
| 12. | ,, | ,, | 7-116 | పుట 304 |
| 13. | ,, | ,, | 7-117 | పుటలు 304, 305 |
| 14. | ,, | ,, | | పుటలు 354- 355 |
| 15. | ,, | ,, | 7-117 (3) | పుట 305 |
| 16. | ,, | ,, | 7-117 (4) | పుట 306 |
| 17. | ,, | ,, | 7-115 | పుట 304 |

# 6 వ అధ్యాయం : రాజకీయం

1971 లోక్‌సభ ఎన్నికలలో విశేష సంఖ్యలో ఇందిరాగాంధికి వోటు ఇచ్చిన స్త్రీలు తరువాత పశ్చాత్తాపపడవలసి వచ్చింది. 1975 జూన్‌లో ఆమె అత్యయిక పరిస్థితిని ప్రకటించి, ప్రతి పక్ష నాయకులను నిర్బంధించి, ఒక లక్షమంది ప్రజాస్వామ్య వాదులను జైళ్ళలో కుక్కింది. రాజ్యాంగాన్ని మార్చి నిరంకుశ అధికారాలను స్వీకరించింది. తన రెండవ కుమారునికి అధికారం ఇవ్వదలచిన ఆమె సంజయ గాంధీని రాజ్యాంగేతర అధికారశక్తిగా రూపొందించింది. ప్రజాస్వామ్య సూత్రాలను, సంప్రదాయాలను పద్ధతులను మట్టిమర (Buldozer) లాగా అతడు నెట్టేశాడు. శాసనం లేకుండా బలవంతంగా అతడు చేయించిన కుటుంబనియంత్రణ ఆపరేషన్ల విధానం అతనిపైన, తద్వారా ఆమెమీద ఎదిరికొట్టింది. ఆమె ప్రజాభిమానం కోల్పోయింది. ఆమె అంచనా తప్పు వేసుకుని లోక్‌సభకు 1977 లో ఎన్నికలు జరిపారు. దాంతో ఆమె, ఆమెపార్టీ వ్యతిరేకపు వరదలో కొట్టుకొనిపోయారు. వింధ్యకు ఉత్తరాన ఆంధ్రప్రదేశ్‌లో కథ వేరుగా ఉంది. ఆమె పార్టీకి 42 స్థానాలలో 41 స్థానాలు వచ్చాయి. తెలుగుస్త్రీలు ఆమె పార్టీకి, ఆమెకు వోట్లిచ్చారు. స్త్రీ కదా యని ఆమెను అభిమానించారు. స్త్రీలుగా తమపై ఇన్నాళ్ళు ప్రత్యేక శ్రద్ధ చూపలేదని ఆగ్రహించారు. ఇందిరాగాంధీ వారికి స్త్రీగా తోచింది. పైగా ఆమె వారికి సౌభాగ్యాన్ని, సంక్షేమాన్ని అరచేతిలో చూపింది. పనిచేసే ప్రభుత్వాన్ని ఇస్తానని వాగ్దానం చేసింది. 1977 లో చేసినట్లుగానే 1978 లో ఆమెనే బలపరిచారు తెలుగుస్త్రీలు. కాకపోతే అంత భారీఎత్తున ఆమెను బలపరచలేదు. 1980 లో లోక్‌సభ ఎన్నికలలో మరల ఆమెకు వత్తాసుగా ఉన్నారు. వారి ఆశలు అడియాసలయినాయి. కేంద్రంలోగాని, రాష్ట్రంలోకాని ఆమె పనిచేసే ప్రభుత్వాన్ని ఇవ్వలేక

పోయింది. ఆంధ్రప్రదేశ్‌లో ఏ ముఖ్యమంత్రికి పదవీ భద్రత లేదు. అసెంబ్లీలో అత్యధిక సంఖ్యాబలం ఉన్నా అవమానకరమైన పరిస్థితుల్లో చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవిని వదలవలసి వచ్చింది. తరువాత వచ్చిన అంజయ్యకూ అదేగతి పట్టింది. తదుపరి కేంద్రపు ఆశీస్సులతో రంగం మీదికి వచ్చిన భవనం వెంకటార్రామ్ ఎక్కువకాలం నిలవలేదు. విజయ భాస్కర రెడ్డిని ఆమె ఎంపిక చేసింది. అలా ఐదు సంవత్సరాల కాలంలో నలుగురు ముఖ్యమంత్రులు తెరమీదికి వచ్చారు. లంచగొండితనం పెరిగింది. నీతి క్షీణించింది ఇదీ. ఆంధ్రప్రదేశ్ పరిస్థితి.

1983 లో అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. ప్రసిద్ధనటుడు, ప్రజాభిమానాన్ని చూరగొన్న సినిమానటుడు ఎన్. టి. రామారావు రాజకీయ రంగంలోకి దుమికాడు. ప్రజల భావోద్రేకాన్ని రెచ్చకొట్టాడు. తన పార్టీకి 'తెలుగుదేశం' అని పేరుపెట్టాడు. అందరికి అన్ని వాగ్దానం చేశాడు. తెలుగు మహిళల గౌరవ ప్రతిష్టలను కాపాడుతానన్నాడు. ఈసారి తమకు నచ్చిన నాయకుడు లభించాడని తెలుగుస్త్రీలు భావించారు. వారు ఆయనకు ఆయన పార్టీవారికి వోట్లిచ్చి ఆయనకు అఖండవిజయం చేకూర్చారు.

అత్యయిక పరిస్థితిలో వామపక్షభావాలుకల కె. లలిత వీణా శత్రుఘ్నలు అంతరంగిక భద్రతాచట్టం క్రింద డెటిన్యూలుగా నిర్బంధింపబడ్డారు. నక్సలైటు కార్యక్రమాల్లో పాల్గొన్న స్త్రీలు కొందరు అరెస్టు కాబడ్డారు. తెలంగాణాకు చెందిన కొమరమ్మ అలాంటి స్త్రీ. రైల్వేవారి సమ్మెను గురించి రాసినందుకు 'విరసం' పత్రిక (హనుమకొండ) పబ్లిషరు హేమలతను అరెస్టుచేసి ఆమెను జైలులో ఉంచారు. నక్సలైట్లకు సాయంచేసినందుకు అనేకమంది స్త్రీలను పోలీసులు వేధించారు; చిత్రహింసల పాల్జేశారు. పోలీసుల కుమ్మక్కుతో భూస్వాముల గుండాలు ఆదిలాబాద్ జిల్లాకు చెందిన రాజమ్మ అనే వ్యవసాయ కూలీల నాయకురాలిని కొట్టి మానభంగం చేశారు. సాహసవంతులైన స్త్రీలు 1975, 1976 సంవత్సరాలలో అత్యయిక పరిస్థితిని ఎవరికి తోచిన రీతిన వారు ఎదుర్కొన్నారు. రహస్యంగా పనిచేసే కార్యకర్తలకు సహాయం చేశారు; వారికి ఆశ్రయం

ఇచ్చారు. సత్యాగ్రహులకు నైతిక ధృతి కలిగించారు. ఎక్కువమంది సత్యాగ్రహులు రాష్ట్రీయ స్వయం సేవక సంఘానికి చెందినవారు. జి. అమ్మన్నరాజా (స్వాతంత్ర్య యోధురాలు) లక్ష్మీకాంతమ్మ (ఆమె తరువాత కాంగ్రెసు (ఐ) లో చేరింది) అత్యయిక పరిస్థితి విధింపును వ్యతిరేకించింది. 'వికాసం' మాసపత్రిక పబ్లిషరు మాల్లాది సుబ్బమ్మ (రాడికల్ హ్యూమనిస్టు) తన పత్రికలో పౌరహక్కుల ప్రచారానికి తావు ఇచ్చింది. మార్క్సిస్టు కమ్యూనిస్టు నాయకులు మోటూరు ఉదయం, మల్లుస్వరాజ్యం అత్యయిక పరిస్థితి కొనసాగినంతకాలం, తర్వాత ఇందిరా గాంధీ వ్యతిరేకపై ఖరి ప్రదర్శించారు;

భారత కమ్యూనిస్టు పార్టీకి చెందిన మహిళా కార్యకర్తలూ, వారి నాయకులూ 1980 ఎన్నికలలో తమ పార్టీ అభ్యర్థులకు అనుకూలంగాను, తమ అభ్యర్థులు లేనిచోట ఇందిరాగాంధి అభ్యర్థులకు వ్యతిరేకంగాను పనిచేశారు.

1980 లోక్‌సభ ఎన్నికలలో మల్లాది సుబ్బమ్మ హైదరాబాద్ నియోజక వర్గంనుండి వోటర్ల హక్కుల ఉద్యమ ప్రచారం నిమిత్తం పోటీ చేసింది. ఆరుగురు అభ్యర్థులలో ఆమె నాలుగవ స్థానాన్ని సంపాదించుకున్నది. ఆమెకు కాంగ్రెసు (ఎస్) అభ్యర్థికన్న, హెచ్చువోట్లు లభించటం గమనార్హం.

ఆదిలాబాద్ జిల్లాలో నక్సలైట్లు నడిపిన పోరాటంలో గిరిజన స్త్రీల పాత్ర ప్రశంసనీయం. కాని నక్సలైట్ల కార్యక్రమాలు సాయుధదళాల చేత నడిపించబడటంతో ఆ పార్టీకి చెందిన మహిళల పాత్ర తక్కువ ప్రాధాన్యతను పొందింది.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 287 మంది సభ్యులలో 11 మంది మాత్రమే స్త్రీలు. సాంఘిక సంక్షేమశాఖ, స్త్రీ సంక్షేమశాఖలు కేటాయించ బడిన ఒకమహిళామంత్రి ఉన్నారనుకోండి. స్త్రీ సంక్షేమ శాఖకు మాత్రమే స్త్రీ మంత్రిగా వుండే ఆచారం ఎందుకు ఉండాలి? తెలుగుదేశం శాసన

సభాపార్టీకి కార్యదర్శిగా ఒక స్త్రీ ఎంపిక చేయబడింది. ఇదంతా నామ మాత్రమే. ఇది అచ్చంగా నికార్సైయిన కళ్ళనీళ్ళు తుడుపు (Tokenism) ఆదిపే రాజకీయపార్టీ అయినా-సి. పి. ఐ; సి. పి. ఐ (ఎం), జనత, తెలుగుదేశం ఏదైనా కాని - ప్రధానమైన ప్రాధాన్యతకల నిర్ణాయక స్థానాలను స్త్రీలు ఆక్రమించటంలేదు. బహుశః వారిని పురుష పుంగవులు ఆ స్థానాలలోకి రానీయలేదేమో!

జనతంత్ర సమాజ్ (Ditizens For Democracy) ఉపసంఘంగా ఉన్న ఒక కమిటీ, 'ఎదురుదాడులు' పేరుతో ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్లను పోలీసులు చంపినదాని విషయమై 'రిపోర్టు' ఇచ్చింది. ఆ కమిటీని ప్రజలు తార్కుండే కమిటీ అని పిలిచేవారు. (ముఖ్యపాత్ర వహించిన రాడికల్ హ్యూమనిస్టు నాయకుడు వి. ఎం. తార్కుండే పేర). పోలీసులు చేసిన దారుణ హత్యలను క్రూరహింసలను ఆ కమిటీ వెల్లడించింది. చివరకు వాటిని గురించి విచారణ చేయటానికి రాష్ట్రప్రభుత్వం 'భార్గవా కమిషను' ను నియమించవలసి వచ్చింది. ప్రజల తరఫున ఆ కమిషను ముందు తార్కుండే కమిటీ (CFD), పౌరహక్కుల ప్రజాసమితి (PUCL), ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (APCL), రాజకీయపార్టీలు సి. పి. ఐ. (ఎం), సి. పి. ఐ; జనత కలిసి పోలీసుల దుశ్చర్యలను ఎండగట్టాయి. విచారణ 15 మాసాలు జరిగింది. హైదరాబాద్ నగరంలోని అభ్యుదయ భావాలు కల స్త్రీలు బహిరంగ విచారణలకు హాజరయి, ప్రజల తరఫున పోలీసులపై నేరారోపణ చేసి పని చేస్తున్న వారికి నైతిక ధృతిని, ధన సహాయాన్ని చేశారు. ఇది పౌరహక్కుల పరిరక్షణ చర్య.

ప్రసిద్ధ రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవి 'మరీచిక' అనేనవల రాయటం జరిగింది. అందులో ఇద్దరు హిప్పీలు, ఇద్దరు నక్సలైట్లు ముఖపాత్ర ధారులు. ఆ పాత్రల రెండు సిద్ధాంతాలు అవాస్తవాలనే భావం ఆ పుస్తకంలో కన్పట్టింది. అది సీరియల్‌గావచ్చి పుస్తకంగా ప్రచురింపబడిన రెండేండ్లకు దానిని ప్రభుత్వం 1982 లో నిషేధించింది. జాగృతి చైతన్యంకల స్త్రీలు వ్యక్తిగతంగాను, తమ సంఘాలద్వారాను ప్రభుత్వ చర్యను నిరసించారు. చివరకు ప్రభుత్వం వెనుకడుగు వేయవలసి వచ్చింది.

# 7 వ అధ్యాయం : సర్వరంగాలలో అభివృద్ధి

స్త్రీల సామాజిక స్పృహ పెరిగింది. వారి హక్కులను వారు గుర్తించారు. వారు సమాజంలో తమ పాత్రను మదింపు వేసుకొన నారంభించారు.

అక్షరాస్యత నత్తనడక నడిచింది. 1971 లో స్త్రీల అక్షరాస్యత 18 శాతం వుంటే 1981 నాటికి అది 20 శాతం అయింది. పట్టణాలలోను, నగరాలలోను ఉన్న మధ్య తరగతి స్త్రీలు, గ్రామాలలోని ధనవంతుల కుటుంబాల స్త్రీలు విద్యకోసం ఎగబడ్డారు. పట్టణాలలోని మహిళలు ఆర్థిక అవసరం దృష్ట్యానేగాక తమకాళ్ళపై తాము నిలబడాలనే దీక్షతో కూడ ఉద్యోగాలు చేపట్టారు. పెద్దగా ఆదర్శాలు లేక పెండ్లిచేసుకోవటమే పరమావధిగా కల పట్టణ స్త్రీలు యోగ్యత గల వరులకోసం ఉద్యోగినులయ్యారు.

కుటుంబాలను పరిమితం చేసుకునే నిమిత్తం ఎక్కువగా మధ్యతరగతి స్త్రీలు, కొంత వరకు శ్రామిక స్త్రీలు జన్మనిగ్రహాన్ని పాటించారు. ముసల్మానులు, రోమన్ కాథలిక్కులు అంతగా ముందుకు రాలేదు.

ఉద్యోగ విషయంలో తక్కువ వేతనాలపై పనిచేయటానికి స్త్రీలు సంకోచించటంలేదు. బాధ్యత, హోదాకల ఉద్యోగాలు చేయాలనే యావ, ఆకాంక్ష వారికి లేకపోలేదు. బ్యాంకు మేనేజరు, ప్రభుత్వ శాఖ డైరెక్టరు, డిప్యూటీ డైరెక్టరు, హైకోర్టు జడ్జి, ప్రొఫెసరు, లాయరు, డాక్టరు, ఫొటోగ్రాఫరు, సేల్సు మేనేజరు, కంపెనీ పై అధికారి ఇలాంటి ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు తరచుగా కన్పిస్తారు. ఇంతకు క్రితం ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు, నర్సులు, స్టెనోగ్రాఫర్లు, టైపిస్టులు, గుమస్తాలు ఈ ఉద్యోగాలతో స్త్రీలు తృప్తిపడేవారు. ఇపుడు పురుషులతో సమానంగా

ఏ పదవినైనా నిర్వహించగలమని ఏ ఉద్యోగాన్నైనా చేయగలమని వారు భావిస్తున్నారు. క్రీడారంగంలో స్త్రీలు ఎంతగానో అభ్యుదయం సాధించారు. స్త్రీల హాకీ టీములు, వాలీబాల్ టీములు, బ్యాడ్మింటన్ టీములు విరివిగా ఉంటున్నాయి. పరుగు పందాలలో పాల్గొనే స్త్రీలు లేకపోలేదు. మహిళా సమాజాలకు, లేడీస్ క్లబ్బులకు ఆటస్థలాలు, ఇతర సౌకర్యాలు లేనందున వారు వ్యాయామం పైన క్రీడలపైన ఎక్కువ శ్రద్ధచూపలేకపోతున్నారు.

సాహిత్యం స్త్రీల దృష్టిని విశేషంగా ఆకర్షించింది. గత రెండు దశాబ్దాలుగా రచయిత్రుల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఈ దశాబ్దంలో వేగం పుంజుకున్నది. నవలలో, చిన్న కథలలో వారు ప్రాశస్త్యము ప్రజారంజకత్వం సంపాదించారు. కొందరి రచనలకు మంచిగిరాకీ ఉండి మార్కెటులో, గ్రంథ ప్రచురణకు అనుమతి ఇచ్చినందుకు ప్రచురణకర్తలు రాయల్టీపేర భారీఎత్తునసే వారికి డబ్బులు ముట్టచెపుతున్నారు.

ప్రయోజనాన్ని ఆశించి, రాసి, సాధించేవారు చాల తక్కువసంఖ్యలో ఉన్నారు. రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, బొమ్మా హేమావతి, మాలతీ చందూరు, కె. రామలక్ష్మి, మల్లాది సుబ్బమ్మ ప్రభృతులు స్త్రీ విమోచనకు, ప్రోదోకరమైన మానవ వాదానికి (Humanism) అంకితమైన రచయిత్రులు.

స్త్రీలు ఉన్నత విద్యలో చాల ముందంజ వేస్తున్నారు. గణిత శాస్త్రాన్ని అభిమాన విషయంగా తీసుకోవటానికి, ఇంజనీరింగు కాలేజీలో అడుగుపెట్టటానికి ఒకనాడు మహిళలు జంకేవారు. ఈనాటి పరిస్థితి వేరు. మునుపటిలాగా వైద్యకళాశాలలకు, ఉపాధ్యాయులను తయారుచేసే కళాశాలలకు ఎగబడటమే కాక ఈ రోజుల్లో విశ్వవిద్యాలయాలలో అన్ని కోర్సులలో చేరుతున్నారు. ఎం ఏ. క్లాసులలో వారిది యాభైశాతం కాగా, సైన్సు విభాగాలలో 25 శాతంగా ఉంది. ఇంజనీరింగు కాలేజీలలోనూ, పాలిటెక్నికులలోను వారు తరుచు కన్పిస్తున్నారు. పరిశోధనలో వారు వెనుకడుగు వేయుటంలేదు. రాష్ట్రంలో విద్యార్థినుల

సంఖ్య పెరిగింది. శక్తిసామర్థ్యాలు కలిగిన అధ్యాపకులు హెచ్చుగా రీడర్లు, ప్రొఫెసర్లు అయినారు. తమ అధ్యయన విషయాలపై సునిశిత దృష్టిని మహిళా దృక్పథాన్ని ప్రదర్శిస్తున్నారు. తెలుగు స్త్రీలకు ఇదంతా తృప్తిని, ఆత్మసంతృప్తిని కలుగ జేస్తున్నది.

కొలది మంది స్త్రీలు సినిమాలకు దర్శకత్వం వహిస్తున్నారు. అంతకు క్రితం వారు నటనకే తమ శక్తియుక్తులను ధారపోశారు. ఇపుడు సినిమా కథలను రాసేవారుగా, దర్శకులుగా రూపొందారు. ఇది గతకాలపు స్థితి కన్న గమనార్హమైన మార్పు.

స్త్రీలు వంటకు గాని ఇతరత్రాగాని యంత్రాలను వాడటం నేర్చుకున్నారు. శ్రమ తగ్గించే పనిముట్లు వచ్చాయి. తమ ఆర్థిక స్థితినిబట్టి, ఆదాయానికి అనుగుణంగా వారు వాటిని కొనుగోలు చేసి ఇతోధికంగా విశ్రాంతిని పొందటానికి ప్రయత్నిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాంతాల అభివృద్ధిలో తేడా ఉంది. అయినా తమ నైచ్యస్థితిని గుర్తెరిగి దానిని మెరుగుపరచుకోవడానికి శ్రామికస్త్రీలు కృషిచేస్తున్నారు. వారు తమ ప్రయత్నాలలో ఎక్కువగా విజయం సాధించలేక పోవచ్చును. కాని ఆర్తి ఉన్నది; ప్రయత్నలోపం లేదు. ఈ మార్పు ముదావహం.

స్త్రీలు ఒకశాఖగా, ఒకతెగగా (Category) తమ అస్తిత్వాన్ని వ్యక్తిత్వాన్ని గుర్తిస్తున్నారు. వారిలో ఉన్న వర్గవైషమ్యాలను మరచిపోయి అన్నింట పురుషులతోపాటు సమానంగా సంపూర్ణ మానవులుగా మనగలగడానికి స్త్రీలు సమష్టి కార్యాచరణకు పూనుకోవటం తరుచు ఈ దశాబ్దంలో సంభవిస్తుంది.

స్త్రీల స్థితిలో విప్లవకరమైన మార్పులు తీసుకొని రావటానికి మహిళా దశాబ్దం ఉపకరించక పోవచ్చును. కాని జాగృతిని, చైతన్యాన్ని పెంపొందించటంలో అది మహత్తరంగా దోహదం చేసింది.

# 8 వ అధ్యాయం : స్త్రీలు : పత్రికారంగం

ఈ దశాబ్దంలో స్త్రీ పాఠకులకు రెండురకాల పత్రికలు అందుతున్నాయి. స్త్రీలచేత ప్రచురింపబడి, స్త్రీల యాజమాన్యంలో ఉండి నడపబడే పత్రికలు ఒకరకం. 'వికాసం', 'జ్యోతి', 'నూతన', 'సాహితీ స్వతంత్ర', 'అనామిక' ఈ కోవకు చెందినవి. అలాకాక కేవలం స్త్రీలకోసం ఉద్దేశింపబడినవి రెండోతరగతికి చెందినవి. 'వనిత' 'వనితాజ్యోతి', 'నూతన' అలాంటివి.

'వికాసం' అనే మాసపత్రిక (1974-82) మల్లాది సుబ్బమ్మ పబ్లిషరుగా మొదట్లో విజయవాడనుండి తరువాత హైదరాబాదునుండి నడపబడింది. భావప్రసర్వికాసం, హేతువాదం, మానవవాదం, శాస్త్రీయదృష్టి, స్త్రీ జనాభ్యుదయం వీటికి అంకితమయినదీ పత్రిక. ఆమె మేనేజింగు ఎడిటరుగా ఉండి పెక్కువ్యాసాలు మహిళా సమస్యలపైన మహిళోద్యం పైన రాసేది.

'జ్యోతి' రాఘవయ్యచేత మదరాసులో నెలకొల్పబడిన మాసపత్రిక లీలావతి రాఘవయ్య మేనేజింగు ఎడిటరు. చిన్న కథలకు, సీరియల్ నవలలకు ఆ పత్రికలో ఎక్కువగా చోటు వినియోగింపబడ్తున్నది. కాగా మహిళోద్య వార్తలను, మహిళా కార్యక్రమాల విషయాలను విధిగా ప్రకటిస్తారు. 'నూతన' తెలుగు మాసపత్రిక. క్రమంగా వెలువడడానికి శ్రమపడుతున్న పత్రిక. హైదరాబాద్ నుండి రత్నమాలచే ప్రచురితము ఆమెయే దాని సంపాదకురాలు. అది తీవ్రవాద భావాలకు అంకితం. ముఖ్యంగా స్త్రీలలో చైతన్యాన్ని పెంపొందించడానికి కృషి చేస్తున్నది. "సాహితీ స్వతంత్ర" 1983 డిసెంబరు నుండి వస్తున్నది అనంతపురంనుండి. ఎడిటరు పేరు పి. అనూరాధ. సంపాదకవర్గం స్త్రీలతో నిండి ఉన్నది.

కాకపోతే స్త్రీల రచనలు మాత్రమే ప్రకటించము. ఆ పత్రిక 'అనామిక' 1975 లో విజయవాడలో పుట్టిన పత్రిక. సంపాదకురాలు వి. జయలక్ష్మి. కథలు నవలలు దాని ప్రత్యేకత. ప్రస్తుతం ఆగిపోయింది.

'వనిత' చందమామ పబ్లికేషన్సు వారిచేత నడుపబడుచున్నది. దాని సంపాదకుడు విశ్వనాథరెడ్డి. అది పక్షపత్రికగా ప్రారంభమయి మాసపత్రికగా మారింది. ఆ పత్రిక పుటలలో, చిన్నకథలు, క్రీడలు, విజ్ఞానం, కుట్టు, అలంకరణ, మహిళోద్యమం , రచయిత్రుల వ్యక్తిచిత్రణ, మహిళా సంఘాల కార్యక్రమాల వార్తలు, వాటికి సంబంధించిన ఫోటోలు, సీరియలు నవలలు అన్నీ చోటు చేసుకుంటాయి. రచయిత్రులను ప్రోత్సాహపరచటం సంతోషకారణం.

'వనితా జ్యోతి' విజయవాడలోని ఆంధ్రప్రింటర్సు లిమిటెడ్ వారు 1978 లో ప్రారంభించారు. సంపాదకుని పేరు నండూరి రామమోహనరావు· సంపాదక బాధ్యతను నిర్వహించేవారు మారుతుంటారు. కొన్ని సంవత్సరాలు వాసిరెడ్డి సీతాదేవి ఆ పత్రికకు "కన్సల్టింగు ఎడిటరు". అది 'వనిత' లాగానే నడుస్తున్నది.

'మహిళ' మాసపత్రిక 1975 లో తిరుపతిలో పుట్టింది· స్త్రీ చదువరుల కోసం ఉద్దేశింపబడినది· 1980 ప్రాంతాల్లో అది ఆగిపోయింది· అలాంటి పత్రికలలో తతిమ్మ వాటి కంటె ఎక్కువగా మహిళోద్యమానికి ప్రాధాన్యత ఇచ్చిన పత్రిక. 'వనిత', 'వనితాజ్యోతి', 'మహిళ' లు బహుళ ప్రచారం గల పత్రికలు. మహిళోద్యమవ్యాప్తి కన్నా వ్యాపారదృష్టి వాటికి మెండుగా ఉండేది.

స్త్రీల ఆదరాభిమానాలను పొందుతూ, బహుళ సంఖ్యలో అమ్ముడు పోతూ, అదే సమయంలో స్త్రీ విమోచన సిద్ధాంతానికి కట్టుపడిన పత్రిక ఈనాడు తెలుగునాట లేకపోవుట శోచనీయము. అలాంటి పత్రిక ఎప్పటికి వస్తుందో!

# 9 వ అధ్యాయం : స్త్రీల సంఘాలు

## అఖిలభారత సంఘాలు

### ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు

'మహిళల్లారా! మీ హక్కులను మీరు తెలుసుకోండి' (''Women Know your rights'') అనే కరపత్రాన్ని శ్యామలావప్పు, కమలా రామ్‌జీ రాశారు. అది 1976 లో ప్రచురితమయింది. "జాతీయాభివృద్ధికి, సంక్షేమానికి కుటుంబం మూలకందము" అనే విషయంమీద జాతీయ స్థాయి సెమినారు పాట్నాలో 1977 లో జరిగింది. అన్ని కార్యాలయాలలోను, బహిరంగ ప్రదేశాలలోను స్త్రీలకు మరుగుదొడ్లు నిర్మించమని ఆందోళన చేశారు. 'కుటుంబ నియంత్రణ' పై ఢిల్లీలో 1980 లో సెమినారు జరిగింది. 1980-90 మధ్యకాలంలో "ఐచ్ఛిక సంఘ సేవయెడల నూతన దృక్పథం" (A new Approach to voluntary social service in the eighties) అనే అంశంపై 1981 లో జమ్‌షెడ్‌పూర్‌లో సెమినారును నిర్వహించింది కాన్ఫరెన్సు. [1]

కాన్ఫరెన్సు తనకు ఒకలక్ష సభ్యులున్నారని ప్రకటించింది. ఆ సంస్థ చేసే ముఖ్యమైన కార్యక్రమాలు మహాసభలు, సెమినారులు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు, సంఘ సేవా కార్యక్రమాలు. 1981 లో సమావేశం అనేక విషయాలపై తీర్మానాలను ఆమోదించింది. విద్యాలయాలలో కొత్త విద్యార్థులను పాత విద్యార్థులు హేళన చేసి, ఆటలు పట్టించి అల్లరి చేయడాన్ని నిరసించింది. అవసర వస్తువులను విదేశాలకు పంపవలదని, ధరలను స్తంభింప చేయాలని తీర్మానించింది. దొంగనిల్వలను బ్లాకు మార్కెటును నిరోధించటానికి ప్రజల పర్యవేక్షక కమిటీల నిర్మాణాన్ని

ఆశించింది. సినిమా ప్రపంచంలో దౌర్జన్యం, సెక్సు, నేరము కథావస్తువులుగా సినిమాలు రావడంపట్ల అసహ్యతను ప్రకటించింది. శాంతిని, మానవులు విద్యను, అనియత విద్యను పెంపొందించే విషయం పరిశీలించడానికి ఒక కమిటీని వేసింది.

గోపేశ్వర్ (ఉత్తరప్రదేశ్) లో ఆరునెలల సమావేశం ఏర్పాటయింది. హరిజన స్త్రీలపై అత్యాచారాలు పెచ్చు పెరగడం పట్ల కాన్ఫరెన్సు వ్యథ వెలిబుచ్చింది. చిప్కో ఉద్యమాన్ని (అడవులలో పెరుగుతున్న వృక్షాలను నరకవద్దని) బలపరిచింది. బాలలను దుష్టంగా వాడడాన్ని ఖండిస్తూ ఈ దిగువ నమోదు చేసిన సూచనలు చేసింది :-

I) బాలలకు మాదక ద్రవ్యాలు ఇవ్వరాదు. వారిని అవినీతికరంగా అమ్మరాదు, మరొకరికి ఇవ్వరాదు.

II) బాలల శ్రమకు సంబంధించిన శాసనాలను ఖచ్చితంగా అమలు పరచాలి.

III) బాలలకు క్రీడా ప్రదేశాలు, ఆటస్థలాలు వసతులు ఒనగూర్చటం ప్రభుత్వం, స్థానిక సంస్థలయొక్క విధి. 2

స్త్రీలు నిర్ణయాలు చేసే ప్రక్రియలో పాలుపంచుకోవటంలేదు. ఇది గమనించిన అంతర్జాతీయ మహిళా సంఘం (International Allianca of women) యీ దిగువ పేర్కొనబడిన సూచనలను చేసింది :-
(కాన్ఫరెన్సును ఈ అంతర్జాతీయ సంస్థకు ముందే అనుబంధం చేశారు)

I) అన్ని రంగాలలోను స్త్రీలపట్ల మర్యాదను పోగొట్టాలి.

II) స్త్రీల హక్కుల విషయమై సమాచారం అందించాలి.

III) వివక్షను తెలకొల్పే శాసనాలను రద్దుచేయుమని ప్రభుత్వాన్ని కోరడం; స్త్రీలకు న్యాయసంబంధమైన రక్షణ ఇవ్వటం.

IV) వోటుహక్కును వినియోగించుకోవలసినదని, సమాజపు రాజకీయ జీవితంలో పాల్గొనమని స్త్రీలకు ప్రబోధం చేయుట.

V] ఉద్యోగసందర్భంగా ఎంపిక చేయుట, నియమించుట, పై పదవికి 'ప్రొమోట్' చేయుట, పదవీ విరమణ, పెన్షను హక్కులు, పని పరిస్థితులు వీటి విషయంగా వివక్షాయుత ఆచారాలను, అలవాట్లను, సంప్రదాయాలను తొలగించుట,

VI] ఉద్యోగం ఇవ్వడంలోనూ, నిరుద్యోగస్థితిలో ఇచ్చే సాంఘిక భద్రతలోనూ, స్త్రీలను నాయకులుగా తయారుచేయుటంలోనూ స్త్రీ పురుషులకు సమానమైన అవకాశాలు,

VII] ప్రభుత్వంలో, పార్లమెంటులో, శాసనసభలలో, స్థానిక సంస్థలలో, ప్రజలకు సంబంధించిన ఉద్యోగాలలో స్త్రీల ప్రాతినిధ్యం పెంచుట,

VIII] ఉద్యోగాలలో కొంతకాలంవరకు స్త్రీలకు రిజర్వేషన్లు,

IX] 'స్త్రీల ఆరోగ్యం' విషయమై స్త్రీలకు ప్రబోధంచేసే సందర్భంలో చేయవలసిన పనులు.

(క) ఆరోగ్యాన్ని గురించి జాగృతి కలుగజేయడం, వ్యాధినిగురించి నిరోధక చర్యలు తీసుకొనుట, అనారోగ్యాన్ని నిరోధించుట,

(ఖ) ఉద్యోగానికి ఆరోగ్యానికి ఉన్న సంబంధం నొక్కి చెప్పుట

(గ) ఉద్యోగం, ఆరోగ్యం ఈ రెంటివిషయంలో జ్ఞానాభివృద్ధి చేయుట,

(ఘ) ప్రాథమిక ఆరోగ్య రక్షణ విషయంగా స్త్రీలయొక్క పాత్రను, వారి సంఘాల పాత్రను పెంచుట, అందుకు అవసరమగు చర్యలు తీసుకొనుట,

(చ) ఆరోగ్యాన్ని పెంపొందించుట

(ఛ) అంతర్జాతీయ మంచినీటి (Drinking water) మరియు పారిశుద్ధ్య దశాబ్దం కార్యక్రమాలలో స్త్రీలు పాల్గొనేటట్లు చేయుట. 3

'స్త్రీలకు వృత్తి శిక్షణ' అనే దానిపై కేంద్రప్రభుత్వపు లేబరు డిపార్టుమెంటు సెప్టెంబరు 1982 లో సెమినారును నిర్వహించింది. అందులో

కాన్ఫరెన్సు పాల్గొన్నది. 1981 గణాంక లెక్కల ప్రకారం ఉద్యోగాలలో స్త్రీలు 21 శాతం మాత్రమే ఉన్నా రోజురోజుకూ అధిక సంఖ్యలో స్త్రీలు ఉద్యోగం కోసం అర్జీలు చూస్తున్నారు. "ఏ పనిని పురుషులు చేయగలరో దానిని స్త్రీలు కూడా చేయగలరు; పై పెచ్చు ఇంకా మెరుగుగా చేయగలరు" అనేది దరహంపిన సెమినారుయొక్క అభిప్రాయం.[4]

1983 లో మహిళా దినోత్సవం జరిగిన రోజున 8 మహిళా సంఘాలు కలిసి స్త్రీల ఉద్యోగాల విషయమై కోర్కెల పత్రాన్ని సమిష్టిగా ప్రధాన మంత్రికి సమర్పించారు. స్త్రీలకు న్యాయం చేకూర్చటంలో, స్వేచ్ఛను ఒనకూర్చటంలో, హుందాతనాన్ని కలుగజేయుటంలో జరుగుతున్న జాప్యం పట్ల అసంతృప్తి వెల్లడించారు. ఈ దిగువన పేర్కొన్నట్లుగా తక్షణ చర్యలు తీసుకోవాలని వారు కోరారు :-

I] అన్ని ప్రణాళికలలో 'ప్రాజెక్టులలో' స్త్రీల సంబంధంగా లక్ష్యాలను నిర్ణయించుట,

II] రిజర్వేషన్లు, హాస్టలులు, ఉచిత ఉపకార వేతనాలు (Stipends), శిశువిహార్‌లు, శిక్షణాసదుపాయులు వీటిద్వారా స్త్రీలకు శిక్షణ అవకాశాలు ఇతోధికంగా పెంచుట,

III] శిశు విహారాలను స్థాపించుట మాతృత్వాన్ని జాతీయ బాధ్యతగా భావించి మాతృత్వ సౌకర్యాలను పెంచుట; అందరికీ అందుబాటులోకి తెచ్చుట,

IV] ఇపుడున్న శాసనాలను ఈ దిగువ పనులు చేయుటద్వారా అమలుపరచాలి.

(క) ఉచిత న్యాయసలహా ఇవ్వటం, ఉచితంగా కోర్టులో పని సంస్థాపరంగా చేయించుట,

(ఖ) స్త్రీలయొక్క హక్కు బాధ్యతలను గురించి స్త్రీలలో ప్రబోధం, సమాచారం అందించుట,

(గ) కష్టాలలో ఉన్న స్త్రీలకు మద్దతు ఇవ్వటం, వారిని పునరుద్ధరించటానికి అవసరమైన చర్యలు

(ఘ) 'లేబరు' శాసనాలను ఖచ్చితంగా అమలు పరుచుట,

(చ) శ్రామికశాసనాలను అమలుపరచటానికి లేక పర్యవేక్షింపటానికి నియమింపబడిన కమిటీలలో - ప్రభుత్వ కార్మిక సంఘాలు వీటి కమిటీలలో మహిళా సంఘాలకు ప్రమేయం కల్పించడం, ప్రత్యేకంగా స్త్రీల కమిటీలు వేయుటం

(ఛ) వ్యవసాయం మొదలగు సంఘటితం కాని వృత్తులలో వేతనాల నిర్ణయ విధానాన్ని మార్చుట, వేతనాల చెల్లింపు పద్ధతి సవరణ చేయుట (దీని ఉద్దేశమేమంటే వేతనము లేక కూలి శ్రమించే స్త్రీలకు - ఇంటి యజమానిగా ఉన్న పురుషుడికిగాక - చెందేటట్లు చూడటం, పురుషులు స్త్రీలు చేసే పనులలో వివక్ష లేకుండా చేయుటమే)

(జ) కాంట్రాక్టు లేబరు చేస్తున్న స్త్రీల కంట్రాక్టులను క్రమబద్ధం చేయుటం, స్థిరనివాసం లేక ఊరూర తిరుగు శ్రామికులకు రక్షణ

VI] (క) భూసంస్కరణలకు భంగంలేకుండా, మతధర్మ శాసనాల క్రింద స్త్రీలకు ఇచ్చిన హక్కులకు వైరుధ్యం లేకుండా, భూములు ఇళ్ళ స్థలాలు ఇచ్చే సందర్భంలో భార్యాభర్తలిద్దరికీ సమష్టిగా పట్టాలిచ్చుట,

(ఖ) వైవాహిక జీవితం గడిపేకాలంలో సంపాదించబడిన ఆస్తిలో భార్యాభర్తలిద్దరికీ హక్కుఉండేలాగున 'వైవాహిక ఆస్థి' (Matrimonial Property) సూత్రాన్ని స్థిరీకరించుట,

VII) పని పొందడానికి పౌరునికిగల హక్కును రాజ్యాంగంలో పొందుపరచుట

VIII) స్త్రీల స్థితిగతులను విచారించి నివేదిక సమర్పించటానికి, స్త్రీల హక్కులు అమలుపరచటానికి జాతీయ కమిషనును శాసన పరమైన హక్కులతో నియమించుట.

ఆల్ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు, అఖిలభారత ప్రజాస్వామ్య మహిళల సంఘం (All india democratic women's Association) భారత స్త్రీల జాతీయ ఫెడరేషను (National Federation of indian womens), మహిళా దక్షతా సమితి, క్రైస్తవ యువతీసంఘం (Young women's christan Association) తదితరులు ఆ విజ్ఞాపన పత్రంపై దస్కతులు చేశారు. 1982 లో నాగపూర్ ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు మహాసభకు ఆతిథ్యమిచ్చింది. సరోజని వరదప్పన్ అధ్యక్ష స్థానంనుండి ఇలా చెప్పింది. కాన్ఫరెన్సు ముఖ్య కార్యక్రమం ఏమంటే క్రొత్త అవసరాలను ఏరి కూర్చుకోవటం, మన కార్యక్రమాలకు ఒక దిశను నిర్ణయించే విధంగా మనకు ఉత్తేజపరచే పద్ధతిలో నూతన ఆదర్శాలను సమకూర్చుకోవటం" 6

డా॥ ఉషా మెహతా అదే మహాసభకు ప్రారంభోత్సవం చేస్తూ కాంగ్రెసు పార్టీ 15 శాతం సీట్లు స్త్రీలకు ఇస్తామన్న మాటను నిలుపుకోలేదని విమర్శించింది. ఆమె లెక్క ప్రకారం ప్రాతినిధ్యం ఏడు శాతాన్ని ఏనాడూ మించలేదు. 7 "మహిళా సంఘాలు ఇంతవరకు సామాజిక కార్యకలాపంపై దృష్టిని కేంద్రీకరించాయి. ఇకనుండి అవి తీవ్రవాదవైఖరిని ప్రదర్శించవలసి ఉంటుంది" తమ సభ్యులను, ఇతర మార్గాలు విఫలమయితే, సత్యాగ్రహానికో లేక మరొకరీతి ప్రతిఘటనలకో సన్నద్ధం చేయాలి." 8 (వక్కాణింపు రచయితది) అని ఆమె సభలో చెప్పింది. అది యుక్తాయుక్తంగా ఉన్నది.

కాన్ఫరెన్సుకు 1981 లో 420 శాఖలున్నాయి. ఈనాడు దానికి 500 శాఖలు ఏర్పడినాయి. 'రోష్నీ' అనే పేరుగల ఇంగ్లీషు పత్రికను రెండునెలలకొకసారి ప్రచురిస్తున్నారు. ఆ సంఘం అనేక ఇతర సంస్థలను ప్రారంభించింది. అవి స్వతంత్రంగా, ఈనాడు, వ్యవహరిస్తున్నాయి. భారత శిశుసంక్షేమసంస్థ (indian council of child welfare, New Delhi-41), కాన్సరు సంస్థ (Cancer institute, Madras), అఖిలభారత కుటుంబ నియంత్రణ సంఘం (Family planning Association of india) అలాంటి సంస్థలలో ముఖ్యమైనవి. 9

కాన్ఫరెన్సు, దాని శాఖలు, దాని అనుబంధ సంఘాలు వీటి కార్యక్రమాలు ఇలా ఉండేవి. అశక్తులకు సహాయం, మానసికంగా వెనుకబడినవారికి పాఠశాల, కుటుంబ నియంత్రణ, వయోజన విద్యా కేంద్రాలు, వయోజన స్త్రీలకు సంక్షిప్త కోర్సులు, ఆహారవస్తువుల నిలవ, నేత, అచ్చుపని, అద్దకం, కుటీరపరిశ్రమలు, చేతిపనులు, ఉద్యోగినులకు వసతిగృహాలు, శ్రామిక స్త్రీల సంక్షేమం, కుష్ఠునివారణ కేంద్రాలు, వయోవృద్ధుల శరణాలయాలు, అనాథ శరణాలయాలు, పాఠశాలలు, పాడి పరిశ్రమ, శిశువిహార్ ఇలా ఎన్నో నడిపేవారు.[10]

కాన్ఫరెన్సు లక్ష్మి రఘురాం అనే తెలుగుస్త్రీని నాయక శ్రేణిలోకి తెచ్చింది. ఆ సంస్థ ఎక్కువగా ధనవంతులతో మధ్యతరగతి స్త్రీలతో నిండి ఉండేది.

## అఖిలభారత ప్రజాస్వామ్య మహిళా సంఘం

(ALL INDIA DEMOCRATIC WOMEN'S ASSOCIATION)

ఇది ఇటీవలనే నిర్మాణమయినది. ఇది మార్క్సిస్టు స్త్రీలతో కూడి ఉన్నది. ఇది భారత స్త్రీల జాతీయ ఫెడరేషను (National Federation of indian women) లాగానే పనిచేస్తున్నది.

## మహిళా దక్షతా సమితి

బొంబాయిలోని ప్రసిద్ధ సోషలిస్టు, స్త్రీ విమోచనవాది ప్రమీలా దండావతేచే ఇది స్థాపించబడినది. ఆమె పార్లమెంటు సభ్యురాలు. ఆంధ్రప్రదేశ్‌లో సోషలిస్టు భావాలు కల స్త్రీలు ఉన్నా ఈ సమితికి అను బంధంగా మహిళా సంఘాలు ఆంధ్రప్రదేశ్‌లో లేవు.

## మానుషి

ఈ పేరుతో ఢిల్లీలో రెండునెలల కొకసారి వచ్చే ఇంగ్లీషు పత్రిక నెలకొల్పబడింది. తరువాత అదే పత్రికను హిందీలో కూడ ప్రచురించ

సాగారు. 1980 చలికాలంలో అది ప్రారంభమయింది. అది మార్క్సిజానికి, స్త్రీ విమోచనకు అంకితమైన పత్రిక. అలా ఆ పత్రిక ప్రచురించుకోదు. దాని మార్క్సిజం సంప్రదాయ సనాతన మార్క్సిజానికి భిన్నమయినది. అది విమర్శనాయుతంగాను సృజనాత్మకంగాను ఉంటున్నది. స్త్రీల స్థితి, దళిత స్త్రీలు, లైంగిక వైవిధ్యం, వరకట్న మరణాలు, స్త్రీలు : రాజకీయం, అనావృష్టి : స్త్రీలు, నిరసన రీతులు, పట్టణాలలో కాలిబాటలపై నివసించే వారు, గ్రామీణ స్త్రీలు, షెడ్యూలు గల స్త్రీలు, పోరాటాల్లో స్త్రీలు, స్త్రీ సంగీత వాద్యకారులు, స్త్రీలు : నీటికొరత ఇలా ఎన్నింటి పైనినో దాని పుటలలో మంచి వ్యాసాలు ఉంటాయి. పురుష దురహంకార భావాన్ని వెలికి కక్కే సినిమాలపై దాని విమర్శ ఘాటుగా ఉంటుంది. తగినంత సంఖ్యలో గుణాత్మకమైన చదువరుల గ్రూపులను అది సంతరించుకో గలిగింది.

## భారత స్త్రీల జాతీయ ఫెడరేషను

## (NATIONAL FEDERATION OF INDIAN WOMENS)

ఇది 1954 లో ఆరంభమయింది. చురుకైన కార్యకర్తలు ఉండటంతో అది వ్యాప్తి చెందింది. స్త్రీలు తమ పరిస్థితిని తాము మెరుగు పరుచు కోవటానికి, జీవనపరిస్థితులను బాగుచేసుకోవటానికి, ఎందుకు తాము వివక్షకు లోనవుతున్నారో తెలుసుకోవటానికి, పురుషులు, స్త్రీలు అందరూ కలిసి సామాజిక ఆర్థిక వ్యవస్థను మార్చడం సాధ్యమని స్త్రీలు గుర్తించి కృషిచేసేలా వారిని ఉత్తేజ పరచడానికి ఈ ఫెడరేషను ఎంతో పని చేసింది [11] మూడుసంవత్సరాల కొకసారి అది మహాసభను జరుపు తుంటుంది. అధికధరలు [12], స్త్రీలపై అత్యాచారాలు [13], శాసనాలలో మార్పు [14], ఇతర ప్రజాసంస్థలతో కలిసి ప్రజాపోరాటాల్లో పాల్గొనడం [15], శాంతికోసం అంతర్జాతీయ ఐక్యత కొరకు చర్యలు [16], నిర్మాణ కార్యక్రమం [17] దాని దృష్టిని ఆకర్షించింది.

## రాష్ట్ర సంఘాలు

ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య తే 31-12-75 న 12 జిల్లాలలోని 28 కేంద్రాల్లో నిరాహారదీక్ష కొనసాగించింది. 18 జిల్లాలో 355 వయోజన విద్యాకేంద్రాలను నడిపింది. 15 వేలమందిని అక్షరాస్యులను చేసింది. 300 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

1975 లో జరిగిన బెర్లిను ప్రపంచ మహిళా సభకు ఆరుగురు ప్రతినిధులు ఆంధ్రప్రదేశ్‌నుండి వెళ్ళారు. ప్రాంతీయ, జిల్లా అధ్యయన తరగతులను నిర్వహించింది. 5 వందలమంది కార్యకర్తల శిక్షణ ఇచ్చింది. 19 జిల్లాలకు వ్యాపించింది. సభ్యత్వం 80 వేలకు చేరింది. 18 'స్త్రీలు వారి సమస్యలు' శాసనం ప్రకారం వారి హక్కులు అనే కరపత్రాన్ని ప్రచురించింది.

అంతర్జాతీయ మహిళా సంవత్సరాంతాన 5 లక్షల సంతకాలతో 15 కోర్కెలుగల విజ్ఞాపన పత్రాన్ని ముఖ్యమంత్రికి సమర్పించింది ఈ సమాఖ్య. వారి లెక్కలప్రకారం 14 జిల్లాలనుండి వచ్చిన 10 వేల మంది స్త్రీలు ఊరేగింపులో పాల్గొన్నారు. తండ్రి చేతిలోని పిత్రార్జితపు ఆస్థిలో కూతురుకు హక్కులు, ఉద్యోగాలలో 25 శాతం రిజర్వేషన్లు, స్త్రీలను మాత్రమే ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులుగా నియమించుట, నిరక్షరాస్యతానిర్మూలన ఆ 15 కోర్కెలలో కొన్ని.

1976-77 లో సమాఖ్య 225 వయోజన విద్యాకేంద్రాలను నడిపింది. తెలుగులో పాఠ్యగ్రంథాన్ని వెలువరించింది, జలంధరులోని, అఖిల భారత మహిళా మహాసభకు ఆంధ్రప్రదేశ్‌నుండి 228 మంది ప్రతినిధులు వెళ్ళారు. వారు 15 జిల్లాలనుండి వచ్చారు. 19 సమాఖ్య తన 6 వ మహాసభను తాడేపల్లిగూడెంలో 1982 లో జరుపుకున్నది. అప్పుడు నివేదిక సమర్పించారు. 1977 నుండి 1982 వరకు 200 కుట్టుపని కేంద్రాలను నడిపారు. అప్పటికి ఒక వెయ్యి వయోజన విద్యా కేంద్రాలను నడిపారు. 80 లక్షల రూపాయల విలువగల కుట్టు మెషిన్లు నిరుద్యోగ

స్త్రీలకు ప్రభుత్వమునుండి వచ్చేలాగు కృషిచేశారు. 1977 లో దివి సీమ తుఫాను బాధితులకు 14 వేల రూపాయలు వసూలుచేసి ఇచ్చి వారిని ఆదుకున్నారు. అలాగే నెల్లూరు తుఫాను సందర్భంగా రు 3200 వసూలు చేసి ఇచ్చారు. రమీజాబీ, షకీలా, ఖాశింబీ (నారాయణలంక) ల మాన భంగాల కేసుల విషయంగా ఆందోళన చేసింది సమాఖ్య. ఖాసింబీ కేసునడిపి ముద్దాయి సబ్ ఇన్స్పెక్టరు ఉద్యోగం ఊడగొట్టించింది సమాఖ్య.

1982 నాటికి సభ్యత్వం లక్ష పదివేల ఏడువందలకు వచ్చిందని వారి లెక్కలు చెప్తున్నాయి. ఒక వెయ్యిమంది మహిళలు పంచాయితీ బోర్డుల సభ్యులవడానికి సహాయంచేశారట.[20] తాడేపల్లిగూడెం మహాసభకు (1982) అన్ని జిల్లాలనుంచి ఏడువందలమంది ప్రతినిధులు వచ్చారు. అంతార్జాతీయ మహిళా దినోత్సవం 14 జిల్లాలలో 48 కేంద్రాలలో జరుపుకున్నది సమాఖ్య. ఉద్యోగాలలో 25 శాతం కావాలనే డిమాండుకు మద్దతుగా 16 జిల్లాలలో 61 కేంద్రాలలో పలురకాల ఆందోళన సాగింది. సమావేశాలు, ధర్నాలు, ప్రదర్శనలు, బహిరంగ సభలు ఆ ఆందోళనా రీతులు. భారత కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ కలిసి కట్టుగా పనిచేయ ప్రారంభించాయి కనుక ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘము రెండూ కలిసి 1983 లో అంతర్జాతీయ మహిళాదినోత్సవాన్ని జరుపుకున్నాయి. సమావేశాలు జరిగాయి. పొగాకు గ్రేడింగు పనిలో యంత్రాలు ప్రవేశపెట్టి స్త్రీ కార్మికులను పనినుండి తొలగించినందున ఐ. ఎల్. టి. డి. కంపెని చర్యను నిరసిస్తూ 1500 మంది స్త్రీలు ఊరేగారు.[21]

## ఆంధ్రమహిళా సంఘం

కోస్తా ఆంధ్రలో 1977, 1978 లలో వచ్చిన తుఫానులలో బాధితుల సహాయార్థం పైకమూ, బియ్యమూ, వస్త్రాలూ పోగుచేసి వారికి అందించి తమవంతు బాధ్యతను నెరవేర్చుకుంది ఆంధ్రమహిళా సంఘం. బెంగాలు

వరద బాధితుల సహాయార్థ కార్యక్రమంలో భాగంగా ఫిలింలు ఉచితంగా తెచ్చి ప్రదర్శనలు ఇచ్చి 24 వేల రూపాయలు పోగు చేయకలిగారు కార్యకర్తలు. ఆ ఉదాత్త ప్రయత్నంలో ఇతర ప్రజా సంస్థలకు వారు తోడ్పడ్డారు.[22] "ఆత్మరక్షణలో శిక్షణ సంఘం" అనే సంస్థ ఆవిర్భవించ టానికి సంఘం పూనుకొని పనిచేసింది. 1979 జనవరి ఫిబ్రవరి మాసాలలో ఒక మాసం రోజులు ఆ సంఘం కరాటేలో శిక్షణ ఇప్పించింది. 68 మంది యువతులు శిక్షణ పొందారు.[23]

'తుపానునష్టం', 'స్త్రీ విముక్తి', 'ఆదర్శ స్త్రీ పురుషులు', 'బాలల సంవత్సరం' అనే అంశాలపై చిన్న పుస్తకాలు అచ్చువేసింది సంఘం.[24]

స్త్రీలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా సంఘం ఆందోళన చేసింది. షకీలా, మంగులక్ష్మి వగైరా కేసులలో ముద్దాయిలను శిక్షించాలని ఆందోళన సాగించింది సంఘం.[25]

మురికివాడల నివాసుల ఇబ్బందుల నివారణకు కృషిచేసింది. అధిక ధరలకు వ్యతిరేకంగా ప్రజా చైతన్యాన్ని రేకెత్తించింది. వరంగల్, ఖమ్మం, నల్గొండ, పశ్చిమగోదావరి జిల్లాలలో అనేక గ్రామాలలో భూస్వాములు పోలీసులు స్త్రీలపై చేసిన దౌర్జన్యాలను ఆయా ప్రాంతాల స్త్రీలు ఎదుర్కొనే లాగున వారిని ఉత్తేజపరచింది.[26]

1980 ఏప్రిల్ నాటికి 10 జిల్లాలలో సంఘానికి బలమైనస్థానం లభించింది. 30 వేల సభ్యత్వాన్ని సంతరించింది. 1980 జూన్‌లో 6 వ రాష్ట్ర మహాసభను నిర్వహించుకున్నది. అప్పుడు మల్లు స్వరాజ్యం అధ్యక్షురాలుగా ఎన్నికయింది.

ఈ రెండు సంఘాలు ఆం. ప్ర. మహిళా సమాఖ్య, ఆం. ప్ర. మహిళా సంఘం రెండూ ఎక్కువగా సమాజంలోని బీద స్త్రీలను సమీకరిస్తున్నాయి. స్త్రీలకు సంబంధించిన సామాన్య సమస్యలను ఎత్తుకొనడమే కాక సి. పి. ఐ; సి. పి. ఐ (ఎం) లు చేపట్టిన కార్యక్రమాలకు మద్దతును ఇస్తున్నాయి.

## ఆంధ్రప్రదేశ్‌లో ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు

కాన్ఫరెన్సుకు ఆంధ్రప్రదేశ్‌లో శాఖలున్నాయి. హైదరాబాద్ శాఖ, ఈశాన్య ఆంధ్రశాఖ, కేంద్ర తూర్పు ఆంధ్రశాఖ, తూర్పు ఆంధ్రశాఖ, తెనాలి, గుంటూరు విజయవాడ శాఖలు అవి.

మల్లేపల్లిలో ఒక ప్రాథమిక పాఠశాలను, ఉద్యోగినుల వసతి గృహాన్ని, కుట్టుపని కేంద్రాన్ని, ఒక ఉద్యోగ సంఘాన్ని (Employment Bureau) ను హైదరాబాదు శాఖ నడుపుతున్నది. 16 సంస్థలు దానికి అనుబంధంగా ఉన్నాయి. దానికి ఐదు ముఖ్య శాఖలు ఉన్నాయి. అందులో పేరెన్నిక గన్నవి ఆంధ్రయువతీ మండలి, మహిళా నవజీవన మండలి, లేడీ హైదరీ క్లబ్బు. ఇవి వైవిధ్యంకల అనేక కార్యక్రమాలను సాగిస్తున్నాయి విజయవాడలోని భారత మహిళా మండలిలో 150 మంది సభ్యులున్నారు. అది రెండు శిక్షణ శిబిరాలను రెండు వయోజన స్త్రీల విద్యా కోర్సులను. కుట్టుపని శిక్షణ కేంద్రాన్ని, వృద్ధుల శరణాలయాన్ని సంగీత నాట్యకళావేదికను నిర్వహించింది. నాయకులను తయారుచేసే శిక్షణ శిబిరాన్ని కూడా నడిపింది. 27

## కొన్ని ప్రముఖమైన స్థానిక సంఘాలు, గ్రూపులు

ఆంధ్రప్రదేశ్‌లో వేలకొలదీ మహిళా మండలులు ఉన్నాయి. మొదట్లో జాతీయ విస్తరణ కార్యక్రమంలో, తరువాత సమాజ వికాస ప్రణాళికలో భాగంగా, ప్రజలు చూపిన ఆసక్తి ఫలితంగా, పెద్ద సంఖ్యలో మహిళా సంఘాలు, మండలులూ వెలిశాయి. గ్రామాలలోని ఆ మండలులు పెక్కుచోట్ల కేవలం నామమాత్రంగా ఉన్నాయి. కాని కొన్ని బాగా పనిచేసే మండలులు ఉన్నాయని సగర్వంగా చెప్పుకోవచ్చును. అందులో చాల మండలులునిర్మాణ కార్యక్రమాలను చేపట్టాయి. బాల్‌వాడీలు, హిందీ తరగతులు, కుట్టుసెంటర్లు, సంగీతపు పాఠాలు, పోషకాహార కోర్సులు, చెదురు మదురుగా వృత్తి విద్యాబోధన కోర్సులు ఇవీ వాటి కృషిఫలితాలు.

హైదరాబాదులోని ఆంధ్రమహిళాసభ ఒక కాలేజీని, ఆసుపత్రిని, నర్సుల శిక్షణాలయాన్ని, వయోజన విద్యా కేంద్రాలను, వృత్తి విద్యా కేంద్రాన్ని నడుపుతూ గణనీయమైన సేవ చేస్తున్నది.

ప్రబోధం, ప్రచారము, లేక ఆందోళనలద్వారా స్త్రీలలో చైతన్యం రేకెత్తించే నిమిత్తం ఇటీవల కొన్ని మహిళాసంఘాలు పుట్టాయి. వాటిలో కొన్ని ప్రత్యేక విధానాలను రూపొందించుకున్నాయి. మరికొన్ని ప్రత్యేక విషయాలపై ఆసక్తి చూపుతూ విశేష ప్రావీణ్యంతో పని చేస్తున్నాయి కనుక అలాంటివాటిలో కొన్నింటిని పేర్కొనవలసి వస్తుంది.

'అభ్యుదయ మహిళా సమాఖ్య' 1978 లో హైదరాబాద్‌లో ఉదయించింది. జంటనగరాల మహిళా సంఘాల ఫెడరేషను అది. అధికధరల లాంటి సమస్యలకు తోడుగా, గల్ఫ్ దేశాలకు కూరలు, కోడిగుడ్లు ఎగుమతి చేయరాదనే కార్యక్రమాన్ని ఎత్తుకుంది. అది ఒక ఊరేగింపును లేవతీసింది. అన్నితరగతులకు వర్గాలకు చెందిన 800 మంది స్త్రీలు ఊరేగింపులో పాల్గొన్నారు. ప్రభుత్వంలో స్పందన కలుగనందున తరువాత నెలలో ధర్నా సాగించారు. అదీ నిరుపయోగమైనది. అంత నిరాహారదీక్షకు పూనుకున్నారు. మూడురోజుల తర్వాత ప్రభుత్వం దిగివచ్చి ఎగుమతిని ఆపివేసింది ఆ సమాఖ్య ప్రెసిడెంటు మల్లాది సుబ్బమ్మ వి, ప్రభావతి, వి. కాశీరత్నం ముఖ్య కార్యకర్తలు. తరువాత 'స్త్రీ శక్తి సంఘటనము' నిర్మించిన మహిళల ప్రోత్సాహం, సహాయమూ, మద్దతూ ఈ సంఘం చేపట్టిన పై ప్రయత్నంలో లభించాయి.

'స్త్రీ శక్తి సంఘటన' 1979 లో స్థాపించబడింది. వరకట్న మరణాల కేసులలో ఆందోళనలు, మానభంగాల కేసులలో ప్రదర్శనలు, బెంగుళూరు హైకోర్టులో రమీజాబీ కేసులో రివిజను దాఖలు చేయించటం వారి విశేష కార్యక్రమాలు. భర్త చేత నిరాదరణ చేయబడి అత్త చేత హింసింపబడిన మధ్యతరగతి స్త్రీ జీవితగాథను వస్తువుగా తీసికొని 35 నిమిషాల వీధి

నాటకాన్ని వారి సభ్యులతో తయారు చేయించింది 'సంఘటన'. కార్మిక స్త్రీ జీవితాన్ని గురించి మరొక వీధినాటకాన్ని తయారుచేశారు సభ్యులు, స్త్రీ యొక్క చైతన్య జీవితాన్ని చిత్రించే 'ఒక స్త్రీ గాథ' అనే ఫిల్మ్ తయారు చేశారు. పై వీధి నాటకాలను, సినిమాను అనేక చోట్ల ప్రదర్శించి స్త్రీలలో జాగృతిని కలిగించారు. అనేక మహిళల సమస్యలపై చర్చలు నడుపుతున్నారు. ఆ సంఘంలోని ముఖ్యులు డా॥ రమామేల్కోటే, వసంతా కన్నభిరాన్, కె. లలిత.

చైతన్యంకల స్త్రీలతోను అభ్యుదయ భావాలుకల పురుషులతోను ఏర్పడిన సంఘం 'మహిళాభ్యుదయ సంస్థ'ల పురుషుల సభ్యత్వాన్ని కలిగి వుండుట దీని విశిష్టత. ఇది 1980 లో స్థాపించబడింది. మల్లాది సుబ్బమ్మ ఈ సంస్థ స్థాపక అధ్యక్షురాలు. 'స్త్రీల హోదా' మీద 1981 ఏప్రిల్‌లోను, 'స్త్రీకి భద్రతలేని సమాజం' మీద 1981 చివరి భాగంలోను సెమినార్లు జరిపింది సంస్థ. అనేక మహిళా సమస్యలపై మీటింగులు జరిపింది. హిందూ వివాహచట్టం, హిందూ వారసత్వ శాసనం, వరకట్న చట్టం వీటి సవరణ బిల్లులపై పార్లమెంటు, శాసన సభలచేత నియమించబడిన కమిటీలముందు సాక్ష్యం ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించిన 'స్త్రీలకు ఉద్యోగాలలో ముప్పైశాతం' ప్రతిపాదనను సమర్థించింది. 1982 లో మతకలహాల సందర్భంగా రచయితల సమావేశాన్ని ఏర్పరచింది. మతకలహాల సందర్భంగా ప్రజలు అందులో ముఖ్యంగా స్త్రీలవైఖరి, ఆలోచన, వారిలో కలిగిన భావాలు వీటిని గురించి సర్వేచేసి 12 పేజీల నివేదికను విడుదలచేసింది. 1981 నాటి సెమినారు (స్త్రీల హోదా) వ్యాసాలను పుస్తకరూపంలో ప్రకటించింది. పదిమంది పదవీ నిర్వాహకులలో 9 మంది స్త్రీలు.

వివాహం విషయంలో కులం, మతం, ధనం, మతతంతు వీటిని దాటి పొమ్మని యువతీయువకులను ప్రోత్సాహపరిచే సంస్థ ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ వివాహ వేదిక, (Cosmopolitan Marriage Bureau) హైదరాబాదు. పై లక్ష్యాలను ఆదర్శాలను అభిమానించే యువతీ యువకులు ఒకరి నొకరు పరిచయం చేసుకోవడానికి ఆ సంస్థ దోహదం చేస్తుంది.

అది 1981 లో పుట్టింది. మల్లాది సుబ్బమ్మ ఈ వేదికకు డైరెక్టరు "వివాహం : నేడు రేపు" అనే అంశంపై 1983 అక్టోబరులో ఒక సెమినారును నడిపింది. ఈ వేదికఅనేకమంది రచయితలు, రచయిత్రులు వ్యాసాలు రాసి చదివారు. అవన్నీ కలిసి పుస్తకరూపంలో వేదికచేత ప్రచురింప బడ్డాయి. అనేక వివాహాలు - కుల మత ప్రసక్తి లేని వివాహాలు - వేదిక అధ్వర్యాన వేదిక అవరణలో జరిగాయి, జరుగుతూ ఉన్నాయి. వేదిక ప్రజల దృష్టిని ఆకర్షించింది.

వైవాహిక కుటుంబ సలహా కేంద్రం (Family conselling centre and marriage guidance bureau) 1983 లో హైదరాబాద్‌లో నెలకొల్పబడింది. వివాహాత్పూర్వము, తరువాత సామాజిక, మానసిక, న్యాయ, వైద్య సంబంధమైన సలహాలను ఇవ్వడానికి అది ఉద్దేశింపబడింది. డా॥ సౌభాగ్యవల్లి, మల్లాది సుబ్బమ్మలు దానికి అధ్యక్ష కార్యదర్శులు.

(రాష్ట్రీయ స్వయం సేవక సంఘ ఆలోచనా రీతివల్ల ప్రభావితమయి జనసంఘం దరిమిలా భారతీయ జనతాపార్టీ మహిళా విభాగ్‌లో పనిచేసే స్త్రీలు అసభ్యత, అశ్లీలాలకు వ్యతిరేకంగా ఆందోళన లేవనెత్తుతున్నారు. వారిలో పేరెన్నికగన్నవారు జూపూడి హైమావతి, వారణాసి ఆండాళమ్మ, శమంతకమణి.)

తమమీద తాము ఆధారపడి, ఒక స్పష్టమైన దృష్టి, తాత్విక ఆలోచన కల సంస్థలను మాత్రమే ఇచట పేర్కొనబడినవి.

## ఐదవ భాగం తొమ్మిదవ అధ్యాయం రిఫరెన్సులు


1. ఆల్ ఇండియా ఉమెన్సు కాన్ఫరెన్సు (AIWC) వారి 1984 వార్షిక నివేదిక (సంక్షిప్త చరిత్ర) పుట 88-91
2. 'రోష్ని' మే - జూన్ 1982 పుట 1 'గోపేర్వర్‌లోని అర్ధసంవత్సర సమావేశం' అనే వ్యాసం

3. రోష్ని 1982 సెప్టెంబరు - అక్టోబరు పుట 1 : అంతర్జాతీయ సంస్థపై వ్యాసం

4. 'రోష్ని' 1982 నవంబరు - డిసెంబరు పుటలు 24, 25 : 'వృత్తి విద్యా శిక్షణ' పై అఖిలభారత సెమినారు.

5. 'రోష్ని' 1983 మార్చి - ఏప్రిల్ పుటలు 2, 18

6. కాన్ఫరెన్సు వార్షిక నివేదిక (1982) పుటలు 35-40 (39)

7. ,, పుటలు 66-68 (67) డా॥ ఉషా మెహతా ప్రారంభోపన్యాసం

8. ,, పుట 68

9. 'రోష్ని' 1982 మే - జూన్ పుట 1

10. 'రోష్ని' 1982 జనవరి - ఫిబ్రవరి పుట 15

11. భారత స్త్రీల జాతీయ ఫెడరేషను (National Federation of Indian women) 11 వ కాంగ్రెసు సావనీరు పుట 17 : 'కాంగ్రెసుకు కదలండి' అనే వ్యాసం

12. 'భారతస్త్రీల ఫెడరేషను' కార్యక్రమ నివేదిక (1984) (Work Report)

13. ,, ,, పుటలు 7-12

14. ,, ,, ,, 13-16

15. ,, ,, ,, 18-21

16. ,, ,, ,, 23-25

17. ,, ,, ,, 21

18 ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య 5 వ మహాసభ (అనంతపురం) 1977 సావనీరు పుట 15 : 'ఆంధ్రప్రదేశ్ మహిళోద్యమ చరిత్ర' గుజ్జుల సరళాదేవి వ్యాసం.

19. ,, ,, పుట 19

20 'సమాఖ్య' కాదేపల్లి సోడెం మహాసభ (1982) పుటలు 25. 27, 29

గుజ్జుల సరళాదేవి వ్యాసం.

21. గుంటూరు అఖిలభారత ఫెడరేషను మహాసభ (1982) కు

ఆం. ప్ర. మహిళా సంఘ నివేదిక పుటలు 104-108.

22 1980 జూన్ లోని 'ఆంధ్రమహిళా సంఘం' 4 వ ఆం. ప్ర. రాష్ట్ర

మహాసభకు (సూర్యాపేట) రిపోర్టు పుటలు 68, 69

| | | | | |
|---|---|---|---|---|
| 23. | ,, | ,, | పుటలు | 70-72 |
| 24. | ,, | ,, | ,, | 72 |
| 25. | ,, | ,, | ,, | 72-75 |
| 26. | ,, | ,, | ,, | 76 |

27. ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు 1982 వార్షిక నివేదిక అనుబంధం.

# 6 వ భాగం

## గతం : భవిష్యత్తు

ఇంతవరకూ మహిళోద్యమప్రగతిని వివిధదశలలో అనేకకోణాలనుండి పరిశీలించడం జరిగింది. ఎంతవరకు పురోగమించామని మదింపు వేసుకునే ముందు స్త్రీలలో జాగృతి కలిగించి సమాజంలో స్త్రీలకు న్యాయంగా రావలసిన స్థానంకోసం పోరాడిన మహామహులను స్మరించుకోవాలి. సామాజిక సంస్కరణయుగానికి చెందిన కందుకూరి రాజ్యలక్ష్మమ్మ, కొటికలపూడి సీతమ్మ, బాలాంత్రపు శేషమ్మ జాగృతి శకానికి చెందిన కనుపర్తి వరలక్ష్మమ్మ, ఉన్నవ లక్ష్మీ బాయమ్మ, ఆదుర్తి భాస్కరమ్మ, గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, కడపరామ సుబ్బమ్మ, ఆందోళన తిరుగుబాటు కాలపు కొమిర్రాజు అచ్చమాంబ, స్థిరీకరణదశలోని లక్ష్మీ రఘురాం మార్గదర్శకులైన జ్యోతులు.

ఆంధ్రప్రదేశ్ కుటుంబ నియంత్రణ సంఘపు ప్రేమలతా గుప్త, ఆం. ప్ర. మహిళా సమాఖ్య తాలూకు రీటాసేథ్, గుజ్జుల సరళాదేవి, బ్రిజ్ రాణిగౌర్, శ్రీ రాజ్యం సిన్హా, ఆంధ్రమహిళా సంఘపు మానికొండ సూర్యావతి, మోటూరు ఉదయం, మల్లు స్వరాజ్యం (ఏం. ఎల్. ఏ) మహిళా దశాబ్దంలోని ప్రముఖవ్యక్తులు. డా॥ రమా మేల్కోటే, వసంతా కన్నభిరాన్, కె. లలితలు ఈ కాలపు భావాలను ప్రతిబింబిస్తారు. రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి సామాజిక చైతన్యంకల ప్రతిభావంతులైన రచయిత్రులు. వీరు సంప్రదాయ మార్క్సిజానికి భిన్నమయిన స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్నారు. మహిళా సమస్యలపై అనేక వ్యాసాలు ఇతర గ్రంథాలు రాసిన మల్లాది సుబ్బమ్మ కొన్ని ప్రజోపయోగ సంస్థలను నెలకొల్పింది. హ్యూమనిజంతో జోడించిన స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని ఆమె వ్యాప్తిచేస్తున్నది. సమానత్వంకోసం స్త్రీల పోరాటాన్ని సంపూర్ణంగా గాఢంగా అవగాహన చేసుకోవాలంటే

ప్రతి సమస్యను విడివిడిగా తీసుకొని పురోగతిని అంచనా వేసుకోవాలి. అన్ని సమస్యల లాగానే స్త్రీల సమస్యలను కూడా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయాలు వర్గీకరణగా చేయవచ్చును

## సామాజిక రంగం

19 వ శతాబ్దంలో స్త్రీలు బహిరంగ సభలకు వచ్చేవారు కాదు. సంస్కర్తలు సమావేశ పరిచే బహిరంగసభలకు తమ భార్యలను, అక్క చెల్లెండ్రను, వదినా మరదళ్ళను, తల్లులను తీసుకొని రావలసినదని విజ్ఞప్తి చేసి వీరేశలింగం సంచలనం సృష్టించాడు. హిందువులలో పరదా పద్ధతి లేకపోయినా స్త్రీలు పురుషులతో కలిసి కూర్చోవడం సరాసరి మాట్లాడటం అరుదుగా జరిగేది. ఆ రోజుల్లో స్త్రీలు పాదరక్షలు ధరించేవారు కాదు. సులోచనాలను పెట్టుకునేవారుకాదు. రోజులు మారాయి. నగరాల్లో యువతులు పురుషులలాగా లాగులు చొక్కాలు వేసుకొని నల్లగ్లాసు కళ్ళద్దాలతో తిరుగుతున్నారు. జాతీయ నాయకుల బహిరంగసభలకు వేలు లక్షల సంఖ్యలో హాజరవుతున్నారు.

ఆనాడు బాల్యవివాహాలు జరగడం పరిపాటి. ఈనాడు ఎక్కడో సకృత్తుగా జరుగుతున్నాయి. గత శతాబ్దంలో విధవా వివాహాలు అంటే నిరసనగా చూచేవారు. ఈనాడు అవి మామూలు అయిపోయినాయి. తమ జీవిత భాగస్వామిని తాము యువతులు ఎన్నుకునే ప్రసక్తి లేదు అపుడు. ఇపుడు కొంతమంది స్త్రీలైనా ఆ హక్కును వినియోగించుకొని తమ జీవిత భాగస్వాములను తామే ఎంపిక చేసుకుంటున్నారు. ఆ రోజుల్లో వరకట్న సమస్యలేదు. కన్యాశుల్కం విస్తృతంగా ఉండేది. ఈ శతాబ్దపు ప్రారంభంలో వరకట్న ఆచారం ఉద్భవించింది. ఇప్పటికీ తగ్గుముఖం పెట్టకుండా సాగుతుంది. ఆనాడు వరకట్న మరణాలులేవు. బాలికలు, యువతులు దానిని సమస్యగా పరిగణించి అన్యాయమని భావించలేదు. ఈనాడు వివాహిత స్త్రీలు తమ తక్కువ హోదాను గమనించి మానసికంగా కుమిలిపోతున్నారు. అవమానాలను భరించలేక ఆత్మహత్యలకు

పాల్పడుతున్నారు. ఆత్మహత్యలు చేసుకునేలాగు భర్తలు, వారి బంధువులు హింసించి బలవంతం చేస్తున్నారు. తరుచుగా కోడళ్ళను అత్తలూ, భర్త హింసించి చంపటం గమనిస్తున్నాం. ఒకరకంగా పరిస్థితి విషమించింది.

పాతకాలంలో విడాకులు కోరే ప్రసక్తి లేదు. విడాకులకు అవకాశం సమష్టి మదరాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతానికి 1948 లో వచ్చింది. గత శతాబ్దంలో దానిని గురించి స్త్రీలు కలలో కూడ భావించలేదు. ఈ కాలంలో విడాకులు పుచ్చుకున్న స్త్రీని వేలుపెట్టి చూపడంలేదు అంతగా. నేరస్థురాలిగా ఆమెను పరిగణించటంలేదు. విడాకులను, వేరుగా ఉండ టాన్ని ప్రోత్సహించకపోయినా వాటిని ఖండించటంలేదు. పతీ సహగమనం పాతకాలపు ముచ్చటగా మిగిలిపోయింది. కాగా 3 లేక 4 ఏండ్ల కొకసారి ఎక్కడో జరిగినట్లు పత్రికల్లో వార్తపడి గగ్గోలును సృష్టిస్తుంది. వెనుకటి శతాబ్దంలో స్త్రీలపై హింసను ఎవరూ పట్టించుకోలేదు. భర్త భార్యను దండించటానికి హక్కు కలిగి ఉన్నాడని భావించేవారు. ఆ హక్కును ఎవరూ సవాలు చేయలేదు. ప్రస్తుత పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. భర్తల హింసను కూడా స్త్రీలు నిరసిస్తున్నారు. భార్యపై భర్త అత్యాచారం చేసి ఆమెను మానభంగం చేస్తే దానికి ఈ రోజుల్లో కూడా కేసు లేకపోయినా ఆ దుష్టచర్య తీవ్ర నిరసనకు గురి అవుతున్నది. మహిళా సమాజాలు ఆ భర్త క్రూర అమానుష చర్యను గర్హిస్తున్నాయి.

1937 కు పూర్వం ఒక పురుషుడు తన కుమారులతో, లేక సోదరులతో లేక తండ్రితో సమష్టి హిందూ కుటుంబంలో ఉండి చనిపోతే భార్యకు మనవర్తి మాత్రం వచ్చేది. పంపిణీ చేసుకొని వేరుగా ఉన్న భర్త చనిపోయినా విధవరాలికి తన భర్త వాటా పరిమిత హక్కులతో వచ్చేది. ఇపుడు ఆమె సర్వ హక్కులున్న వాటాదారు అయింది. ఆనాడు కుమార్తెకు వాటాలేదు. ఇపుడు హిందూ వారసత్వ చట్టప్రకారం ఆమెతండ్రి 'ఎస్టేటు' లో ఆమెకు సర్వహక్కులతో వాటా వచ్చింది.

గడచిన శతాబ్దంలో కులమూ, మతమూ పవిత్రంగా ఎంచబడేది. కులాన్ని, మతాన్ని అధిగమించడమనే ఊహ ఎప్పుడూ స్త్రీకి రాలేదు. వర్ణాంతర మతాంతర వివాహాలు చెల్లుతాయని ప్రకటించే శాసనాలు వచ్చిన తరువాత ఆధునిక భావాలు వ్యాప్తి చెంది సాహసవంతులైన స్త్రీలు కులాన్ని ఒక్కొక్కప్పుడు మతాన్ని దాటి తమ భర్తలను తామే ఎంపిక చేసుకుంటుంటున్నారు.

120 ఏండ్ల నాడు అస్పృశ్యతా నివారణ అనూహ్యం. గత శతాబ్దపు చివరిరోజుల్లో రఘుపతి వెంకరత్నం నాయుడు లాంటి సంఘ సంస్కర్తలు అస్పృశ్యతను ఖండించారు. ఇపుడు అస్పృశ్యతను రద్దుచేసినట్లు రాజ్యాంగపు 20 వ అధికరణలో ప్రకటించారు. అస్పృశ్యతా నివారణ శాసనం క్రింద అస్పృశ్యతను పాటించటం నేరమయింది.

జరిగిపోయిన శతాబ్దపు మధ్యలో స్త్రీలలో అక్షరాస్యుల శాతం ఒకటి మాత్రమే. ఇపుడు అది 20 వ శాతం. కాని ఒక్క విషయాన్ని విస్మరించరాదు. ఈనాటికి ఆదిలాబాద్‌లోని షెడ్యూలు తెగలవారిలో అక్షరాస్యత 5 శాతం మాత్రమే. ఆ దినాలలో స్త్రీ విద్య ప్రాథమిక స్థాయి దాటలేదు. ఈ దినాలలో పి. హెచ్. డి. సంపాదించిన తదుపరి పరిశోధనలు కూడా సాగిస్తున్నారు అనేకమంది మహిళలు. ప్రసవకాలంలో స్త్రీలు చనిపోవటం పాతరోజుల్లో మామూలే. శిశుమరణాల రేటు చాల హెచ్చుగా ఉండేది. అంటువ్యాధులు ప్రజలను బలికొనేవి. ఇపుడు పరిస్థితులు మారాయి. కాకపోతే సమాజానికి అందులో ముఖ్యంగా స్త్రీలకు అభ్యుదయం తగినంతగా లేదు.

దేవదాసీ వ్యవస్థను పురాతన సంప్రదాయంగా గౌరవించేవారు. దానిని ఇపుడు రద్దుచేసుకున్నాం. పడుపుగృహాలలోని వ్యభిచారాన్ని అరికట్టటానికి శాసనాలను రూపొందించినా వ్యభిచార నిర్మూలన చేయలేక పోయాం. ఈనాడు వ్యభిచారం మంచిదని ఎవరూ వాదించరు. ఆనాడు మరోరకంగా ఉండేది. ఉంపుడుగత్తెను ఉంచుకోవటం, వ్యభిచార స్త్రీతో

సాంగత్యం పెట్టుకోవటం ఘనతగా గౌరవప్రతిష్టలు పెంచే చర్యగా భావించే వారు. భావాలు మారాయి. అది ఆహ్వానించ దగిన మార్పు.

స్త్రీలను బానిసలుగా చూచేవారు 1937 ప్రాంతం వరకు. యజమానుల వద్దకు భర్తలు వచ్చి భార్యల జీతాలను కూలిని, వేతనాన్ని వసూలు చేసుకొని పోవడం కద్దు. ఆచర్య చట్టసమ్మతంకాదు. కాని ఆచారం, సంప్రదాయం ఆ చర్యను సమర్థించేవి ఆనాడు. ఇపుడు పనిచేస్తున్న భార్య—లా ప్రకారం బానిసకాకపోయినా—తను సంపాదించిన ప్రతి పైసా భర్త చేతిలో పోయాలి; అతడిచ్చే కొద్దిపాటి పైకంతో (Allowance) తన అవసరాలు తీర్చుకోవాలి. బయట పనిచేసి సంపాదించాలి. ఇంట్లో చాకిరి చేయాలి. అపుడు ఆమె పై అలా రెండురకాల బరువు పడ్డది. స్త్రీ యొక్క శ్రమ శక్తిని దోచుకునే పద్ధతి మారింది. రూపం మారిందే తప్ప అసలు విషయం మారలేదు.

పూర్వం ఆమె ఇంట్లో బండెడు చాకిరీ చేయాలి. వంటపాత్రలు కడగటం, బట్టలు ఉతకడం, వంటచేయుడం, పిల్లల పెంపకం, ఇల్లు చక్క దిద్దుకోవడం ఆమె పనిగా పరిగణించేవారు. ఈనాడు స్త్రీలు శ్రామికులలో 26 శాతంగా ఉన్నా, ఆమె సంపాదించిన పైకం కుటుంబానికి చెందుతున్నా పరిస్థితి ఏమీ మారలేదు.

అన్నింటికన్నా చివరిగా పేర్కొన బడుతున్నా ముఖ్యమైనది మౌఢ్యమూ, అంధవిశ్వాసమూ. దయ్యాలు భూతాలలో నమ్మకం ఎక్కువగా ఉండేది గతంలో. ఇపుడు గుణాత్మకమైన మార్పులేదు. స్త్రీలలో అధిక సంఖ్యాకులు అజ్ఞానంలో అంధవిశ్వాసంలో కొట్టుమిట్టాడుతున్నారు. విజ్ఞాన శాస్త్రంలో పట్టభద్రులు, డాక్టరేటు డిగ్రీలు ఉన్నవారు మహాత్ములలో నమ్మకం పెంచుకుంటున్నారు. జ్యోతిష్యం సాముద్రికం వీరవిహారం చేస్తున్నాయి. దొంగగురువులకు 'విద్యావంతులు' తలఒగ్గి నమస్కరిస్తున్నారు. భగవాన్లు, అవతార మూర్తులూ, సాధువులు, గురువులు, దైవసమానులు కోకొల్లలుగా ఉన్నారు సమాజంలో. వారు కపటులుగా నటులుగా ఉంటున్నారు. వారి భక్తజనంలో విపరీత సంఖ్యలో స్త్రీలు

కన్పడుతున్నారు. కొకపోతే అప్పుడప్పుడు మూఢవిశ్వాసాలకు తిరోగమన వాదానికి వ్యతిరేకంగా మాట్లాడే స్త్రీ అరుదుగా కన్పిస్తుంది. ఆధునిక స్త్రీ గర్భస్రావపు హక్కును సంపాదించుకున్నది.

మొత్తంమీద స్త్రీలు ఆధునికత వైపు, అభ్యుదయం వైపు చాల వరకు పురోగమించారని చెప్పుకోవచ్చు. అది సత్యదూరం కాదు.

## ఆర్థిక స్థితి గతులు :-

పూర్వం శ్రామిక స్త్రీలు గనులలో రాత్రిళ్ళు పనిచేసేవారు. ఇపుడు అలా చేయనీయరు. సమానమైన పనికి సమానమైన వేతనం అనే సూత్రం సూత్రప్రాయంగా అంగీకరింపబడినది. కాని 'లా' లో చాల లోపాలు, చిక్కులు ఉన్నాయి. ప్రభుత్వంలోనూ, అర్థప్రభుత్వ సంస్థల లోను స్త్రీలు పురుషులతో పాటు సమానమైన జీతాలు, వేతనాలు పుచ్చుకుంటున్నారు. ప్రసూతి సౌకర్యాలు ఈనాడు అనుభవిస్తున్నారు. పూర్వం అవిలేవు. ఆధునిక కాలంలో స్త్రీలు భూమికోసం, ఇళ్ళస్థలాల కొరకు, ఉద్యోగం కోసం పోరాడుతున్నారు. కాని స్త్రీల పోరాటాలవల్ల లాభిస్తున్నది పురుషులు. ఒంటరి జీవితం గడిపే స్త్రీ కాని విధవరాలు కాని బంజరుభూమికి పట్టా పొందినట్లు ఎప్పుడో కదా చిత్తుగా వింటున్నాం. ఈ సందర్భంగా స్త్రీలు సాధించింది లేదనే చెప్పవచ్చును. అలాగే కుటీర పరిశ్రమల ద్వారా స్త్రీలు సాధించిన సొమ్ము పురుషుల సౌఖ్యాలకు వినియోగింప బడుతుందని ఒక సర్వేలో వెలికి వచ్చింది. అయితే స్త్రీలు పురోగమించలేదని అనలేము. అది అతి స్వల్పమని ఈ సందర్భంతో చెప్పక తప్పదు.

## సాంస్కృతిక క్షేత్రం

'స్త్రీ బానిస అనే భావం' వున్న స్థానంలో ఈనాడు 'ఆమె ద్వితీయ శ్రేణి మానవ వ్యక్తి' అనే భావం వచ్చింది. రాజ్యాంగంలో స్త్రీ పురుషులు

సమానులని ఉద్ఘాటించినా ఆమెను రెండవ తరగతికి చెందిన మనిషిగానే పరిగనిస్తున్నది సమాజం. ఈనాడు స్త్రీలు రచయిత్రులుగా, కవయిత్రులుగా, నటీమణులుగా, గాయనిలుగా, నాట్యగత్తెలుగా, చిత్రకారిణులుగా, వక్తలుగా ఉపన్యాసకులుగా ఉంటున్నారు. పురుషులవలె క్రీడలలో పాల్గొంటున్నారు. వ్యాయామ కళను చేపట్టారు. పూర్వం దేవదాసీలు మాత్రమే లలిత కళలను అభ్యసించేవారు. కొంతమంది గృహిణులు మటుకే కవిత్వాన్ని చదవగలిగేవారు; రాయగలిగేవారు. ప్రస్తుతమున్న సామాజిక వాతావరణం పురుషునితోపాటు సమానత్వాన్ని ఆశించి, సాధించే శక్తిని స్త్రీకి కలుగ జేసింది.

## రాజకీయ రంగం

1860 ప్రాంతంలో స్త్రీలకు వోటులేదు. ఇపుడు వయోజన స్త్రీలందరికీ వోటుహక్కున్నది. ఇది భారతస్త్రీల విజయంకాదు. బ్రిటిషు స్త్రీల అవిరళ పోరాట ఫలితంగా వారికి వోటుహక్కు వస్తే అది భారతస్త్రీలకు శ్రమ లేకుండా సంక్రమించింది. స్త్రీ వోటర్లు మొత్తం వోటర్లలో 49 శాతం అయినా పార్లమెంటులో వారి ప్రాతినిధ్యం 5 శాతాన్ని మించడంలేదు. శాసన సభలో పరిస్థితి ఇంతకన్నా మెరుగుగా లేదు.

19 వ శతాబ్దపు స్త్రీలకు రాజకీయాలలో స్థానంలేదు. పాత్రలేదు. ఈనాడు స్త్రీలు వోటువేస్తున్నారు. ఎన్నికలలో కార్యభారాన్ని మోస్తున్నారు. అభ్యర్థులుగా నిలుచుంటున్నారు. అపుడపుడు శాసనసభకో పార్లమెంటుకో ఎన్నుకోబడుతున్నారు. వారి రాజకీయ చైతన్యం పెరిగింది. ఇతరుల చేత ప్రారంభింపబడినవైనప్పటికి పోరాటాలలో, ఆందోళనలలో పాల్గొంటున్నారు. ఇతరులకు పోరాటాలను - రాజకీయస్వభావం కలిగి ఉన్నా - బలపరుస్తున్నారు. 1930, 1932 లలో వస్త్రదుకాణాలను, సారాదుకాణాలను పికెటింగు చేశారు. పెదనందిపాడు, పల్నాడులలోని పన్నుల నిరాకరణోద్యమంలో పాలుపంచుకున్నారు. విదేశ వస్త్రదహనం చేశారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహం చేశారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో

ముందడుగు వేసి నిషిద్ధ లవణాన్ని తయారుచేశారు. ఎన్నికల విషయం పట్టించుకున్నారు. పాల్గొనటమో లేక బహిష్కరణమో దేనికైనా సిద్ధమయి నారు. పౌరహక్కుల ఉద్యమంలో తమవంతు బాధ్యత నిర్వర్తించారు. 1969 శ్రీకాకుళం సాయుధ పోరాటంలో గెరిల్లాలుగా ఉండి పని చేశారు. ఈనాడు అలాగే త్యాగాలు చేస్తూ కష్టాలు అనుభవిస్తూ అలాంటి పోరాటాలలో ముందుంటున్నారు రైతు పోరాటాల్లో, భూమికోసం జరిగే ఉద్యమాల్లో, అన్యాయమైన కూలికొరకు సాగే సమ్మెలలో, ప్రాంతీయ ఉద్యమాలలో తమ శక్తి యుక్తులను ధారపోస్తున్నారు. ప్రపంచ శాంతికోసం అహరహం శ్రమిస్తున్నారు.

ఒక అంశాన్ని గుర్తించుకోవలసిన ఆగత్యం ఉంది. ఈ పోరాటాలన్నీ పురుషులు ప్రారంభించినవే. కాకపోతే స్త్రీలు శక్తి వంచన లేకుండ పోరాడారు. నిర్ణాయకశక్తి ఏనాడూ వారి చేతుల్లో లేదు. నాయకత్వంలో ప్రథమస్థానం వారికి ఏనాడూ లభించలేదు. ఎప్పుడూ కూడ ఆంధ్రప్రదేశ్ మహిళలు తమ హక్కుల కొరకు, తమ శ్రేయస్సు కోసం రాజకీయమైన పోరాటాన్ని ఇంతవరకు తాముగా నడపలేదు. ఈ అంశం జ్ఞప్తిపథంలో ఉంచుకోవటం అవశ్యకర్తవ్యం.

## మహిళా వాణి

19 వ శతాబ్దంలో స్త్రీలు తమ అభిప్రాయ ప్రకటన చేయుటానికి వారికి తమ పత్రికలు లేవు. ఈనాడు పరిస్థితి మెరుగైనదని చెప్పలేము, నిజానికి మునుపటి కన్నా ఇది క్షీణదశ. స్త్రీల హక్కుల కొరకు పోరాడే పత్రిక తెలుగులో - చెప్పుకోదగినది - లేదు. భారీ ప్రచారం ఉన్న మహిళా పత్రికలు పురుషులచేత నడపబడటమే కాక వ్యాపార దృష్టితో కొనసాగుతున్నాయి. ఆదర్శవాదం తగ్గుముఖం పట్టింది. ఉత్సాహం పట్టుదల పన్నగిల్లాయి. ఒక విశాల దృక్పథం, ఆలోచన కరువవుతున్నది. గ్రుడ్డిలో మెల్లిగా ఉన్న అంశమేమంటే వ్యాపార దృష్టితో నడపబడే

ఇంగ్లీషు తెలుగు దినపత్రికలు తమ పత్రికలలో కొంత చోటును మహిళల అభిప్రాయ ప్రకటనకు కేటాయిస్తున్నారు. అయితే విమర్శనా యుతమైన తాత్విక వైఖరి వాటిల్లో లోపిస్తున్నది.

## మహిళా సంఘాలు

ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్ వారి శాఖలలో ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నవారు ఎక్కువగా మితవాదులు. వాళ్ళకు పెద్దగా సామాజిక ఆర్థిక వ్యవస్థను మార్చాలనే కోరికలేదు. వాళ్ళను 'మితవాద స్త్రీ' విమోచన కారులు Liberal Feminists అని పిలవవచ్చు. భారత స్త్రీల జాతీయ ఫెడరేషనుకు అనుబంధంగా ఉన్న ఆం. ప్ర. మహిళా సమాఖ్య, అఖిల భారత ప్రజాస్వామ్య మహిళా సంఘానికి అనుబంధంగా ఉన్న ఆం. ప్ర. మహిళా సంఘం ఈ రెండు సంఘాలలోని నాయకులు మార్క్సిస్టు భావాలు పుణికి పుచ్చుకున్నవారు. వారిని సంప్రదాయ మార్క్సిస్టు స్త్రీ విమోచన వాదులుగా (Traditional Marxist Feminists) అభివర్ణించవచ్చు. వారు సామాజిక ఆర్థిక వ్యవస్థను మార్చాలని ఆకాంక్షించే వారే. సోషలిజం వస్తే దానంతటదే స్త్రీ యొక్క స్థితి మెరుగుపడుతుందని వారు భావిస్తున్నారు. రష్యాలోను తూర్పు యూరపులోను ఉన్న పరిస్థితి వారి ఆశలను పటాపంచలు చేస్తున్నా వారు ఈ యాంత్రిక దృక్పథాన్ని విడనాడటంలేదు. విప్లవం వచ్చి ౭౭ ఏండ్లయినా రష్యాలో కుటుంబ పరిధిలో స్త్రీ పురుష సమానత్వం అనుభవంలోకి రాలేదు. సోవియటు స్త్రీ ఫ్యాక్టరీలలో, కార్యాలయంలో పనిచేసివచ్చి ఇంట్లో మళ్ళీ మూడు, నాలుగు గంటలు చాకిరీ చేయవలసి వస్తున్నది. పురుషుడు ఆ సమయంలో కులాసాగా కాలం గడుపుతున్నాడు. ఇది గమనించదగిన విషయం.

ప్రమీలా దండావతే లాంటి సోషలిస్టు స్త్రీ విమోచన కారులు [Socialist Feminists] ఆంధ్రప్రదేశ్‌లో లేరు. కాకపోతే సృజనాత్మక మార్క్సిజంలో విశ్వాసం ఉన్న కార్యకర్తలు లేకపోలేదు. వారు

మార్క్సిజాన్ని; ఫెమినిజాన్ని జోడించ ప్రయత్నిస్తున్నారు. వారు 'స్త్రీ శక్తి, సంఘటన'లో కన్పిస్తారు. మహిళాభ్యుదయ సంస్థ సభ్యులు కొందరు హ్యూమనిజాన్ని ఫెమినిజాన్ని సమన్వయపరచాలని ఆలోచిస్తున్నారు. ఎం ఎన్ రాయ్‌చే ప్రచారంలోకి తేబడిన రాడికల్ హ్యూమనిస్టు ఆలోచనా సరళిని వారు ఆమోదిస్తున్నారు.

## భవిష్యత్తు

అనేక సంఘాలను చూస్తుంటే - ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రస్థాయిన మూడు సంఘాలు ఉన్నాయి - వీటి అన్నింటిమధ్య స్త్రీల శ్రేయస్సు కోసం ఐక్యత ఒనకూడ కలదా అనే ఆశ్చర్యభావన కలుగుతుంది. ఈ పరిస్థితి అభ్యుదయానికి దారి తీస్తుందా లేక తిరోగమనమే సంభవిస్తుందా అనేది వివాదాంశం. అయినా కాలశక్తి ప్రబలంగా ఉన్నది. కాలగమనం విధిగా అభ్యుదయానికి దారి తీయాలనిలేదు. యూరపులో ఫాసిజం పుట్టడం, 1975, 1976 లలో మనదేశం ఆత్యయిక పరిస్థితి విధింపు వల్ల అంధకార దశలో పయనించడం గమనార్హం. అయినప్పటికి ఆంధ్రప్రదేశ్ స్త్రీలకు ఉజ్వల భవిష్యత్తు ఉన్నట్లు తోస్తున్నది.

ఇప్పటివరకు స్త్రీలు ఇతరులకోసం పోరాడారు. తమ భర్తలకోసం తమ పిల్లల కోసం, తమ సమాజంకోసం అశేషత్యాగాలు చేశారు. విశేష శ్రమకోర్చి కృషిచేశారు. ఇపుడు తమకోసం, తమ ఆధ్వర్యాన స్త్రీలు పోరాటమార్గాన్ని అనుసరించవలసిన తరుణం ఆసన్నమయింది. వారి సమస్యలు అనేకం ఇంకా అపరిష్కృతంగానే ఉన్నాయి. వ్యక్తిత్వం. సమానత్వం, స్వేచ్ఛ, న్యాయాల సందర్భంగా వారి హక్కులను సమాజం ఇంకా పూర్తిగా గుర్తించలేదు. ఆ హక్కును వారు అనుభవించటానికి అనువుగాలేదు. సమాజం ఆ అవకాశాలను స్త్రీలకు కల్పించటంలేదు. వారు ఇంట్లో చేసే పనిని మదింపు వేసి దానికి విలువకట్టాలి. మానవజాతి నశింపు కాకుండావారు మాతృత్వాన్ని చేపట్టడం వారు చేసే జాతీయసేవగా గుర్తించాలి. వారు చేసేపని పురుషులుచేసేపనికన్నా హీనమైనదనే భావం పోవాలి

సమానమైన పనికి సమానమైన వేతనం అనే సూత్రాన్ని న్యాయంగా అమలుపరచాలి. స్త్రీల పట్ల ఉన్న దురభిప్రాయాలు నశింపు కావాలి.

వీణా మజుందారులాంటి మహిళోద్యమ నాయకులు స్త్రీలు ఒక వర్గం కాదని, ఒక శాఖ లేక తెగ (Category) మాత్రమేనని గట్టిగా చెప్పారు. ఈ ప్రకటనలో చాల వరకు సత్యం ఉన్నది. స్త్రీకి స్త్రీగా ప్రత్యేక అస్తిత్వం ఉన్నది; జీవితం ఉన్నది. స్త్రీలందరికి సర్వసామాన్యమైన ఇబ్బందులు, కష్టాలు ఉన్నాయి. అవి ధనవంతులైన స్త్రీలను కూడా పెన్నాడుతున్నాయి. స్త్రీలను వారి స్త్రీత్వ హోదా ఆధారంగా సమీకరించ గలం! సంఘటితం చేయాలి. అంతమాత్రాన రాడికల్ ఫెమినిజాన్ని అనుసరించి తీవ్రమయిన వైఖరి తీసుకొని స్త్రీత్వాన్ని పొగిడి పురుషులను తెగనాడవవసరంలేదు. ఒకప్పుడు స్త్రీలు సంఘసంస్కరణకోసం మరొక్కపుడు రాజకీయహక్కుల కొరకు మరోసారి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఆశించి పోరాటాలు సాగించారు. ఇకనుండి అట్లా సమస్యలను విడదీయలేము. సర్వతో ముఖమైన వైఖరి అవసరమవుతున్నది రాజకీయ నిర్ణయాలలో భాగస్వామ్యం లేకుండా సామాజిక ఆర్థిక సాంస్కృతిక రంగాలలో తగినంత పురోగమనం సాధించ లేరు స్త్రీలు అలాగే సామాజిక ఆర్థిక సాంస్కృతిక రంగాలలో హక్కులూ స్థానమూ లేకుండా రాజకీయాలలో స్త్రీలు నెగ్గలేరు. కనుక ఆంధ్రప్రదేశ్ స్త్రీలు బహుముఖంగా పోరాటం సాగించాల్సి ఉంటుంది.

ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా పదవీ స్వీకారం చేసినపుడు ఆమె ఇలా చెప్పిందట. "నేను స్త్రీ విమోచన వాదిని (Feminist) కాను. నేను మానవవాదిని (Humanist)." ఆమె అన్న ఈ మాట పెక్కుమంది మహిళా కార్యకర్తల దృష్టికి రాలేదు. ఆమె ప్రోత్సాహకులు ఆ ప్రకటన ఆమె విశాల హృదయానికి నిదర్శనమని ప్రచారం చేశారు. పరిస్థితులు ఆమె చేయిదాటిపోయి ఆమెపై ఒత్తిడి వస్తే తప్ప ఆమె భారత స్త్రీల అభ్యుదయానికి వీసమెత్తు పని చేయదని పాపం వారికి తెలియదు. నిజానికి ఆమె ప్రకటన మహిళోద్యమ కార్యకర్తలలో గందరగోళాన్ని

సృష్టిస్తుంది. గందరగోళం అయోమయానికి దారితీస్తుంది. స్త్రీ విమోచనకు హ్యూమనిజానికి వైరుధ్యంలేదు. శిసలైన మానవవాది (Humanist) విధిగా స్త్రీ విమోచనవాది (Feminist) కావాలి. స్త్రీల శ్రేయస్సుకోసం కృషిచేయాలి. తన పదవిని నిలుపుకునే నిమిత్తం ఆమె స్త్రీల వోటు కావాలి. అలాగే రాజకీయంగా పురోగమించిన పురుషుల సానుభూతి సహకారాలు కావాలి. అందుకే ఆమె ఉద్దేశపూర్వకంగా రెండు అర్థాలు వచ్చేలా - నిజానికి రెండు అర్థాలు లేవు. పైకి అలా కన్పిస్తుంది - ఆమె మాట్లాడుతుంది. ఇది చాణక్య రాజనీతి.

స్త్రీ విమోచనకూ మానవ వాదానికి వైరుద్యం లేదని స్త్రీలు భావిస్తే, అన్నివర్గాల స్త్రీలను సంఘటితం చేయవచ్చని తలిస్తే అప్పుడు మహిళోద్య మాన్ని నడిపించవలసిన తాత్విక సిద్ధాంతము మానవవాద స్త్రీ విమోచన (Humanistic Feminism) అవుతుంది.

తాత్విక సిద్ధాంతాలు వాటంతట అవి విప్లవాలను తీసుకొనిరావు. సరియైన తాత్విక దృక్పథం కల మహిళా కార్యకర్తలు తగినంతమంది కావాలి. పోరాట కాలంలో నాయకులు పుట్టుకొని వస్తారు. నాయకత్వం వహించే స్త్రీ పరిస్థితులకు అనుగుణమైన వ్యూహాన్ని, ఎత్తుగడలను రూపొందించాలి. కాలమే అభ్యుదయాన్ని తెస్తుందని నమ్మి కూర్చున్నా, లేక కార్యాచరణ మాత్రమే ప్రయోజనకరమైన లాభాలను చేకూరుస్తుందని విశ్వసించినా ఉపయోగముండదు. పరిస్థితులను ఆకళింపు చేసుకోవటం వివేకాన్ని ప్రపంచజ్ఞానాన్ని వినియోగించడం నాయకత్వం వహించే స్త్రీ చేస్తే అపుడు తెలుగుస్త్రీలకు అనుకూలమైన పరిస్థితులను కల్పించవచ్చును. స్వేచ్ఛ, న్యాయం, మానవ హుందాతనం కోసం జరిగే పోరాటంలో తెలుగు స్త్రీలు భారత మహిళలకు నాయకత్వం వహిస్తారు. ఆ శుభసమయం ఎంతో దూరాన లేదు. ఎంతోకాలం దానికోసం వేచియుండనక్కరలేదు. అచిరకాలంలో అది సంభవిస్తుందని ఆశిద్దాం.

## గ్రంథాలు

1. 'ఆంధ్ర స్త్రీల పరిస్థితిలో మార్పు' (Changing condition of women in Andhra) : డా॥ ఎస్. పుతలీ కృష్ణమూర్తి
2. కందుకూరి వీరేశలింగం : డి. ఆంజనేయులు (Builders of modern india series) 1976 (In english)
3. నవ్యాంధ్రము : అయ్యదేవర కాళేశ్వరరావు (1959)
4. స్త్రీలు : (Women) : ఎం. కె. గాంధి (నవజీవన పబ్లిషింగ్ హౌస్) (In english) (1964)
5. విముక్తి ఉద్యమాలు, మహనీయులు : మల్లాది సుబ్బమ్మ (1978)
6. మహాకవి గురజాడ : దేవులపల్లి ప్రభాకరరావు (1969)
7. సర్వోదయ : ఎం. కె. గాంధి (నవజీవన పబ్లిషింగ్ హౌస్) 1969
8 ఆశ్రమ సోదరీలకు (To ashram sisters) "ఎం. కె. గాంధీ" (నవజీవన పబ్లిషింగ్ హౌస్) 1952
9. నా స్వీయచరిత్ర : అయ్యదేవర కాళేశ్వరరావు (1953)
10 మాగంటి అన్నపూర్ణ : ఆట్లూరి వెంకటసీత (1929)
11. బసవరాజుగారూ నేను : బసవరాజు రాజ్యలక్ష్మి
12. దుర్గాబాయి దేశముఖ్ : నేతి సీతాదేవి
13. ఆంధ్ర వీరాంగనలు : మాగంటి బాపినీడు (1944)
14, 30 ఏళ్ళ హైదరాబాదు : ముందుముల నరసింగరావు (1977)
15. వీరతెలంగాణా : రావి నారాయణరెడ్డి (1973)
16. వీరతెలంగాణా, విప్లవ పోరాటం : సుందరయ్య (1973)
17. ప్రత్యేక ఆంధ్రోద్యమము : ఎం. వి. రామమూర్తి 1973
18. నక్సల్ బరీ వెలుగులో : కృష్ణమూర్తి
19 సమానత్వం వైపు పయనం (Towards equality) స్త్రీల హోదామీద కమిటీ రిపోర్టు (1975)

20. ఆంధ్రకవయిత్రులు : ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మ
21. స్త్రీ (Woman) : షేక్ కిద్వాయ్ (In english)
22. భారతస్త్రీల హోదా (Status of indian womens) Seminar report 1981 of mahila Abhyudaya samstha
23 శరీరశాస్త్రం : రాజకీయము (Biological politics) జేనేత్ సేయర్సు (Janat sayers) 1982
24. భారత స్త్రీల జాతీయ ఫెడరేషను (National federation of indian womens) 11 వ కాంగ్రెసుకు కార్యక్రమ నివేదిక (Work Report) 1984 (In english)
25. సురవరం ప్రతాపరెడ్డి జీవితము సారస్వతం : ఎల్లూరి శివారెడ్డి 1973
26. సురవరం ప్రతాపరెడ్డి జీవితం, రచనలు : ముద్దుసాని సామిరెడ్డి (1974)
27. కందుకూరి వీరేశలింగం : వి. ఆర్. నార్ల (ఇంగ్లీషులో)
28. స్వీయచరిత్ర : కందుకూరి వీరేశలింగం
29. నారీదృక్పథం : కె. రామలక్ష్మి
30 ఆంధ్రదేశము : స్త్రీలు : డా॥ ఆల్లాడి వైదేహి
31. యుగయుగాల భారతీయ మహిళ : జె. వరలక్ష్మి
32. అబలా సచ్చరిత్రమాల : డా॥ భండారు అచ్చమాంబ
33. శాంతిదేవి స్మృతులు :- ఆచార్యరంగా
34 ఆధునిక స్త్రీ : మల్లాది సుబ్బమ్మ
35. ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు చరిత్ర : కంభపాటి సత్యనారాయణ
36 మారుతున్న సమాజం : మహిళలు : మల్లాది సుబ్బమ్మ

## పత్రికలు, సంచికలు, ప్రత్యేక సంచికలు

1. కనుపర్తి వరలక్ష్మమ్మ స్మారక సంచిక 1980
2. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1916
3. వీరేశలింగం స్మారక సంచిక

| | | |
|---|---|---|
| 4. | ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక | 1911 |
| 5. | ,, | 1913 |
| 6. | ,, | 1915 |
| 7. | ,, | 1916 |
| 8. | ,, | 1917 |
| 9. | ,, | 1919 |
| 10. | ,, | 1925 |
| 11. | ,, | 1929 |
| 12. | ,, | 1928 |
| 13. | గృహలక్ష్మి | 1928 |
| 14. | ,, | 1929 |
| 15. | ,, | 1930 |
| 16. | ,, | 1931 |
| 17. | ,, | 1932 |
| 18. | ,, | 1935 |
| 19. | ,, | 1938 |
| 20. | ,, | 1939 |
| 21. | ,, | 1940 |
| 22. | ,, | 1941 |
| 23. | ,, | 1947 |
| 24. | అనసూయ | 1919 |
| 25. | గోల్కొండ పత్రిక | 1937_38 |
| 26. | ఆంధ్రమహిళ | 1948 |
| 27. | ,, | 1949 |
| 28. | ,, | 1951 |
| 29. | ,, | 1952 |
| 30. | ,, | 1961 |
| 31. | ,, | 1963 |

